# ప్రజారాణి

(ప్రేమచంద్రుడు)

అనువాదకుడు

కోటంరాజు సీతాపతి



సరస్వతీగ్రంథమండలి

రాజమహేంద్రవరము

నిజాము రాష్ట్రము నందుండు ఆంధ్రసోదరుల సౌకర్యార్థము దక్షిణ హైద్రాబాదు నెం. 544/566 గల గృహమందు నామపల్లి గౌరీశంకరశర్మ యందులో, ఆంధ్ర బుక్కుడిపోవారిని మా ప్రతినిధులుగా ఏర్పరచినాము. కావున నిజాము రాష్ట్ర వాసులు కావలసిన పుస్తకములను వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ప్రకాశకులు

# ౧

మున్షీ సాలిగ్రాము కాశీపట్టణములో నొక భూస్వామి. పిత్రార్జితము చాల యున్నను "ఉద్యోగం పురుషలక్షణమ్" అని కాబోలు ఒకరి యదుపాజ్ఞలకు లోనుగాని న్యాయవాదవృత్తి నవలంబించెను. అతనికి దశాశ్వమేధఘట్టమున పెద్దమేడ కలదు. అతఁడుదారస్వభావుఁడు. సంవత్సరమునకు నిరువదియైదువేల రూపాయలు భూములపై వచ్చుచుండును. ఆతఁడు నెలకు వేయి సంపాదించును. కాని యేడాది తిరుగగానే చేతిలో దమ్మిడియైన మిగులదు. సాధువులు బ్రాహ్మణులన్న నతనికిఁ జాల ప్రీతి. తన ధన మంతయు సమారాధనలకును సదావర్తులకును వ్యయము చేయుచుండును. పట్టణములోని కే సన్యాసి వచ్చినను నితనియింట నతిథియై తీరును. కాశీలోని పండితశ్రేష్ఠు లందఱీతనికి జోహారు లొనర్తురు. వేదాంతసిద్ధాంతములందు నతని కపరిమితాభిమాన ముండుటచే వృత్తి మెప్పినను వైరాగ్యోన్ముఖుఁడై యుండును.

మున్షీ సాలిగ్రామునకు పిల్లలనిన మహాప్రీతి. పేటలోని పిల్లలందఱు నతఁడు ముద్దుపెట్టుకొన్నవారలనియే చెప్పవచ్చును. అతఁడు కచ్చేరికి బయలుదేఱగనే పిల్లలందఱు గుంపుగూడి యతనిని వెంబడింతురు. ఒకనాఁడు కఠినహృదయ యగు నొకతె తన బిడ్డను బాదుచుండగా వాఁడు నేలపైఁ బడి కడుపుబ్బ నేడ్చుచుండెను. సాలిగ్రామది చూచి నిలువఁజాలక త్వరితముగా నా బిడ్డను ఱంకఁబెట్టుకొని "అమ్మా! వాని బదులు నన్ను గొట్టుము" అని తలవంచి నిలువఁబడెను. అది చూచి నాటినుండి యామె బిడ్డలను గొట్టనని యొట్టుపెట్టుకొనెను. నిరంతర మితరుల బిడ్డల నిట్లు జూచువాఁ డిఁక తన బిడ్డల నెట్లు చూచుకొనునో

నిజామురాష్ట్రమందుండు ఆంధ్రసోదరుల సౌకర్యార్థము దక్షిణ హైద్రాబాదు నెం. 544/566 రు గృహమందు నాంపల్లి గౌరీశంకరనివాసగృహ యందుండు, ఆంధ్ర బుక్కుడిపోవారిని మా ప్రతినిధులుగా ఏర్పరచినాము. కావున నిజామురాష్ట్రవాసులు కావలసిన పుస్తకములను వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ప్రకాశకులు

౧

మున్షీ సాలిగ్రాము కాశీపట్టణములో నొక భూస్వామి. పిత్రార్జితము చాల యున్నను "ఉద్యోగం పురుషలక్షణమ్" అని కాబోలు ఒకరి యనుజ్ఞలకు లోనుగాని న్యాయవాదవృత్తి నవలంబించెను. అతనికి దశాశ్వమేథఘట్టమున పెద్దమేడ కలదు. అతఁ డుదారస్వభావుఁడు. సంవత్సరమున కిరువది ముప్పదివేల రూపాయలు భూములపై వచ్చుచుండును. తాను నెలకు వేయి సంపాదించును. కాని యేడాది తిరుగగానే చేతిలో దమ్మిడీయైన మిగులదు. సాధువు లన్న బ్రాహ్మణులన్న నతనికిఁ జాల ప్రీతి. తన ధనమంతయు సమారాధనలకును సదావర్తులకును వ్యయము చేయుచుండును. పట్టణములోని కే సన్యాసి వచ్చినను నితనియింట నతిథియై తీరును. కాశీలోని పండితశ్రేష్ఠు లందఱు నతనికి జోహారు లొనర్తురు. వేదాంతసిద్ధాంతములయెడ నతని కపరిమితాభిమాన ముండుటచే నెత్తి మెప్పించును వైరాగ్యోన్ముఖుఁడై యుండును.

మున్షీ సాలిగ్రామునకు పిల్లలనిన మహాప్రీతి. పేటలోని పిల్లలందఱు నతఁడు ముద్దుపెట్టుకొన్నవారలనియే చెప్పవచ్చును. అతఁడు కచ్చేరికి బయలుదేఱగనే పిల్లలందఱు గుంపుగూడి యతనిని వెంబడింతురు. ఒకనాఁడు కఠినహృదయ యగు నొకతె తన బిడ్డను బాదుచుండగా వాఁడు నేలపైఁ బడి కనుపుబ్బ నేడ్చుచుండెను. సాలిగ్రాముఁడది చూచి నిలువఁజాలక త్వరితముగా నా బిడ్డను జంకఁబెట్టుకొని "అమ్మా! వాని బదులు నన్ను గొట్టుము" అని తలవంచి నిలువఁబడెను. అది చూచి నాటినుండి యామె బిడ్డలను గొట్టసలు యొట్టుపెట్టుకొనెను. నిరంతర మితరుల బిడ్డల నిట్లు జూచువాఁ డేఁక తన బిడ్డల నెట్లు చూచుకొనునో

వేఱుగా చెప్పవలయునా ?

సాలిగ్రామునకు లేకలేక చిరకాలమున కొక బిడ్డకలిగెను. అప్పటినుండి గృహకృత్యము లన్నియు విడిచి వాని నూయలలో నూపుచు, షికారు తీసికొనిపోవు చిన్నిబండిలో నా పసిపాపని గూర్చుండబెట్టి తానే యొడ లంతయు చిఱుచెమట పట్టులాగున నీడ్చుచు సంతసించుచుండును. ఒక నిముషమైనను బాలకుని వదలక ముద్దులాడుచు, నాడించుచు నపరిమిత పుత్రవాత్సల్యముచే తన్ను తానే మఱచుచుండెను.

ఆతని భార్య సువాసు. వారు బాలకునకు ప్రతాపచంద్రుడని పేరిడిరి. ఆబిడ్డ పేరునకు తగిన సకలసద్గుణములు అందచందములు కలిగి విశేష ప్రతిభతో నుండెను. ఎవరితో మాటలాడుచుండినను వాని వాక్యములం దమృత మొల్కుచుండును. వాని వదనమండలము నిరంతరము కళకళలాడుచుండును. ఇట్టి చిఱుతప్రాయమందే వాని విశాలముఖమండల మేక్రొత్తవారు చూచినను అట్టె నిలువబడి తేరి పార చూచి యాశ్చర్యపడక మానరు.

ఆటపాటలలో వాని కాలేండ్లు గడచెను. సంతోషదినము లన్నియు రివ్వురివ్వున వాయువువలె తరలిపోవును. కాని దుర్దినములు విపరీత వ్యథల పాలుచేయుచు యుగములుగా తోచుచు మందమందముగా పోవుచుండును. ప్రతాపచంద్రుడు పుట్టి యెన్ని యోరోజులు కాలేదు. బారసాలనాడు కట్టిన మామిడితోరణము లట్టులే కళకళలాడుచుండెను. గడపకు రాచిన పసుపు కుంకుమ లింకను చెక్కుచెదరలేదు. ఆనాడు వాయించిన మేళతాళము లప్పటికిని చెవులకు వినబడుచునే యుండెను. ఇంతలోనే వాని కాఱవయేడు దాటుచుండెను. ఇప్పటి నుండియే బిడ్డలకు గండముపై గండము రా నారంభించును.

చూచువారలకు సాలిగ్రాము ప్రాపంచకవిభ్రాంతి కలవాడుగా కాన్పించుచుండినను యదార్థముగా మాత్రము నిష్కాముడై, నిస్సం

గిగా జీవనము గడపుచుండెను. పైకి సామాన్యగృహస్థుగా సంసార కష్టములందు ఖిన్నుఁడుగా సుఖములందు హర్షితుఁడుగా నుండినను, అంతరంగమున సుఖదుఃఖముల కతీతుఁడై శాంతముగా కాలక్షేపము చేయుచుండెను.

మాఘము ప్రవేశించుటచే ప్రయాగలో కుంభోత్సవ మారంభ మయ్యెను. పొగబండ్లలో జను లందఱు క్రుక్కిన దూదివలె ప్రయా ణముచేసి యచ్చటికి చేరుచుండిరి. ఎనుబది తొంబదేండుల వృద్ధు లింక మీఁద చూడమేమో యను భయముచే కఱ్ఱల నూతగా గొని కుంటుచు, పడుచు, లేచుచు, వారి మూర్ఖత్వమునకు మండిపడు సూర్యుఁడు తన ప్రచండకిరణములచే తపింపజేయుచున్నను నోపికతో వగర్చుచు మెల్లగా పొలిమేరల దాటి ప్రయాగ చేరుచుండిరి.

ఏ మహనీయులను సందర్శించుటకై యనేక తైర్థికులు పవిత్ర హిమాలయపర్వతకందరములందలి యంధకారబంధురములైన గుహ లలో జొరబడుటకు కూడ సాహసించుచుందురో యట్టివా రెల్లరు భాగీరథీస్నిగ్ధతరంగముల నవగాహనము చేయుటకు వచ్చియుండిరి. ఇదంతయు విని సాలిగ్రాము నేను గూడ పోయి యమ్మహోత్సవ మును గన్నులార చూడనైతినే యని దిగులొంది తన భార్యకడకు చేరి,

"సువామా, రేపు స్నానములు కాబోలు" అనెను.

"ఏమో, పేటంతయు పాడుపడినట్లున్నది. ఎక్కడ చూచినను మనుష్యుల జాడలు కనుపించుటలేదు."

"నీ కిష్టములేదు. కాని మనము కూడ పోయిన నెంత బాగుగ నుండును! ఇట్టి మహోత్సవము చూడతగినది కదా?"

"నా కేమియు వద్దు. ఉత్సవ మన్నతోడనే నా శరీరము జలద రించును."

"నీకేమోకాని నాకుమాత్రము పరమానంద స్వాములవారుకూడ వేంచేసినారని వినుటతోడనే మనసు నిలకడగాలేదు. ఎప్పుడెప్పుడా యని యువ్విళ్లూరుచున్నది. కాబట్టి నేను తప్పక పోయెదను."

మొట్టమొదట సువామ భర్త వెడలుట కంగీకరింపకున్నను తానెన్ని చెప్పినను ఆయన వినువాడు కాడని యెంచి విధిలేక యంగీకరించెను. ఆనాటిరాత్రి పండ్రెండు గంటలకే సాలిగ్రామము బయలుదేరి వెళ్లు సమయమున ప్రతాపచంద్రుని ముద్దుపెట్టుకొని భార్యను కౌగిలించుకొనెను. సువామ అప్పుడు పరికించిచూడగా నతని నేత్రము లశ్రుపూరితములైయుండెను. ఆమెగుండె గుబుక్కుమనెను. చైత్రాకాశమున నలి నీలమేఘరాసులను కాంచి యాందోళన చెందుచు కంపించు కర్షకుని హృదయమువలె ఆమె హృదయ మధీరమయ్యెను. ఆబాష్పజలబిందువులు వైరాగ్య త్యాగములను సూచించుచు చూచుటకు చిన్నవైనను వానియందెంతో పవిత్ర భావము మూర్తీభవించియుండెను.

సాలిగ్రామము గృహమును వదలినతోడనే సువామ నిట్టూర్పువిడిచెను. "భర్త నీకు మరల లభింపడు"ని యెవరో యనునట్లు ఆమెకు దోచెను. ఒకరోజుగడచెను. రెండురోజులుగడచినవి. మూడునాలుగు రోజులును గడచినవి. వారము దాటినది. కాని, భర్త మరల రాలేదు. సువామ అధైర్యపడి తంతిని ఇప్పించెను. మనుష్యుని పంపెను. అంతులేదు. ఇట్టిపనులు చేయుచుండగనే రెండవవారము గడచెను. అయ్యో! భర్తనేడువచ్చునో రేపువచ్చునోయను ఆశకూడ అప్పటి కంతరించెను.

సాలిగ్రామము రానందున అతని భార్యకే కాక పట్టణమున కంతయు లోటుగా నేయుండెను. వీధులలో, దుకాణములలో, వేయేల ఎచ్చట చూచినను ఆమహానీయుని విషయమై యాందోళన చెందుచునారే. ఈసంగతివిన్న ప్రతివాడును కంటతడిపెట్టుచుండిరి. బాలక బృంద

మును వెంట నిడుకొని యతఁడు తిరిగెడు వీధులన్నియు నేఁడునిర్మా నుష్యమై ధూళితో నిండియుండెను. ఆతని దగ్గఱకు బోవుటకై వెక్కి వెక్కి యేడ్చెడు బాలకులు నేఁడిట్టి విపరీత పరిస్థితి సంభవించిన దని గుర్తెఱుగఁ జాలకుండిరి. వారి తల్లులందఱు చీరచెఱఁగులతో కన్నీరు తుడిచికొనుచు తమదగ్గఱ చుట్టమును కోల్పోయినట్లు విల పించుచుండిరి.

ఆవిధమున సాలిగ్రా మకృష్ణయ్యదైనందున కెల్లవారు విచారించు చుండినను, విశేషముగా దుకాణదారులు, ఋణప్రదాతలు తమకీయ వలసిన దీయకయే పోయినాఁడని దిగులుపడుచుండిరి. ఎట్లో మొగ మోటమునకై పదుగురకు వెరచి పది పంద్రెండుదినములు గడపి ఒకరి వెంబడి నొకరు తమ కాగితములను సుబ్బమకు చూ ప దొ డ గి రి. బ్రాహ్మణ సమారాధనకై వాడుకొనిన నేతికి రెండువందల రూపాయ లకు ఒక కాని కూడ ఇవ్వలేదని కొందరు, పిండివంటలకై తెచ్చిన రెండువందలసేరుల మైదాపిండి ఖరీదివ్వలేదని ఒక కొందఱు, దాన ములకై తెచ్చిన బట్టలఖరీదు నియ్యవలయునని మఱికొందఱు చా నారంభించిరి. దేవాలయ నిర్మాణసమయమున నతఁడిరువదివేలు తీసి కొనివచ్చెను. అవియునట్లేయుండెను. ఏమైన చరాస్తియున్నదా? అదియునులేదు. ఋణములేవిధమున తీరును? స్థిరాస్తినమ్మవలయును. ఇట్లుచేసిన తప్ప, ఋణముల తీరుమానమునకు వేఱొక యుపాయ ములేదు.

ఈ ఋణబాధనుండి విముక్తిజెందు టెట్లు దైవమాయని సుబ్బమ చినిగిన చాపపై తలవంచుకొని కూర్చుండి యోజించు చుండెను. చంద్రుఁడు కొయ్యగుజ్జముపై నెక్కి వాకిట దడదడ పరుగు లిడు చుండెను. ఇంతలో వారి పురోహితుఁడగు మోటేరాము ముసిముసి నవ్వులు నవ్వుచు వచ్చెను. ఆతఁడు సంతోషముతో వచ్చియుండుట

గాంచి, ఖిన్నురాలగు సువాను అతఁడేదో శుభవర్తమానము దెచ్చి నాడని తలచెను. ఆమె యులికిపడిలేచి యతనికిపీటవేసి తాను ఆశా పూరిత నేత్రములతో కూర్చుండి చూచుచుండెను. మోశేరాము నశ్యము పీల్చుచు—

"మీ ఋణపత్రములు చూచితిరా!" అనెను. సువాను నిరాశతో చూచిననేమి?" అనెను.

"ఏమియులేదు! పద్దులు మితిమీరియున్నవి. సాలగ్రామముగారు వెనుకముందులు చూడక ఇష్టమువచ్చినట్లు తీసుకువచ్చి తనయొద్ద గుర్తుకైనను కొంచెము వ్రాసికొన్నవారుకాదు. ఇంతధనము కేవలము సమారాధనలకు సంతర్పణలకు వ్యయమైనదని ఎవరు నమ్మెదురు! ఇంతకు మనమేమి చేయగలము? వారెంత అడిగినను నోరు మూసుకొని ఇచ్చితీరవలయును."

"ఈయకేమి చేయుదుము? తప్పించుకొనుటకు వీలున్నదా? కర్మఫల మనభవించకతీరదుగదా? జరుగవలసినది జరుగకమానదు."

"సరే, అదియందఱకు తెలియును. కాని మీరేమైన ఆలోచించితిరా?"

"మనకున్న గ్రామము లమ్మివేయ వలయునని నాకు దోచుచున్నది."

"అయ్యయ్యో! ఎంతపిచ్చిదానవమ్మా! గ్రామముల నమ్ముకొని ఏమిచేయుదువు?"

"గత్యంతరములేనపు డేమిచేయవలయును?"

"భూమియంతయు మీచేతిలోనుండి దాటిపోయినపిమ్మట మీకు బ్రతుకు తెరువేది?"

"పైన ఈశ్వరుడున్నాడు. పుట్టించినవాఁడు పెట్టకమానఁడుకదా!"

"అయ్యో! మీకెంత కష్టకాలమువచ్చినది. నిత్యము పదిమంది

చేతులు కడిగించు ఇల్లు నేడిట్లు అప్పులపాలై పోవలసి వచ్చెనుగదా?''

"పరమాత్ముఁ డీవిధమున చేయగోరినపుడు మానవ మాత్రులమేమి చేయగలము?''

"అట్లుకాదు. బడితెవిరుగకుండ పాము చచ్చునట్లొక ఉపాయము చెప్పెదను విందురా?''

"చెప్పునాయనా! మీపుణ్యమెక్కడికిఁబోవును!''

"ఏమియు లేదు. సిస్తు చెల్లించలేమని కలెక్టరుగారికి దరఖాస్తు పెట్టుకొనుడు. మిగిలిన డబ్బువిషయమై భారమంతయు మాపై వేయుడు. మేము మీ సంపత్తున కేవిధమగు హానిరాకుండ చేయగలము.''

"అగుననుకొనుడు. మీరింత ధనమెక్కడనుండి తేగలరు?"

"మీకు ధనమున కేమికొదువ? సాలిగ్రాముగారి పేరు చెప్పినంత మాత్రముననే నోటులేకుండ చేబదులుగా వేలకువేలు పుట్టగలవు. ఇవన్నియు నెందుకు? ధనమంతయు సిద్ధముగా నున్నదనుకొనుడు. కేవలము మీనోటినుండి మాటవచ్చినచాలును."

"పట్టణములో పెద్దలు సమకూర్చిరా?''

"మాట మాత్రములో ధనమంతయు తక్కువడ్డీకి ఇచ్చుటకు ప్రయత్నములు జరిగినవి. ఇక దొరగారి కటాక్షము మాత్రము కావలయును."

"పన్ను తీసివేయుటకు దరఖాస్తు నేను పెట్టను. వారిపేర ఋణమంతకన్నను తేను. అందరిఋణములు సమ్మిడీలతో సహా గ్రామములు అమ్మియే తీర్చెదను.'' అని సువామ వ్యతిరేక భావమున మొగమావలకు త్రిప్పుకొనెను. అఖండ దుఃఖముచే వెలవెలబోవు నామె వదనమును కోప మాక్రమించుచున్నట్లుండెను. మోహేరాము ప్రశుతిమించినదనితలంచి, "సరే'' మీయిష్టము. మేమేమియు నిర్బంధము

చేయము. కాని, మీకణుమాత్ర మాపద సంభవించెనేని కన్నులతో చూడజాలము. ఆనాఁడు మాప్రాణములు ధారపోసెదము" అని పలికెను.

"అందుకని ఇతరులయొద్దకు వెళ్లి వారిని దేబిరింతునా? తినతిండి దొరకనిచో కఠోరోపవాసములొనర్చి కృశించి ప్రాణములనైన నశింపఁజేసికొందునుగాని పరులగడప దొక్కను."

"కృష్ణ, కృష్ణ! ఎంతకఠినముగా మాట్లాడుచున్నారు. అప్పుదీసికొన్న మీ ప్రతిష్ఠ కేమాత్రము లోపము రాదు. ఈమహాపట్టణమున రెండుమూడులక్షలు అప్పులేని భూస్వామి యెవ్వఁడైనకలరా? ఎవరికి వారు పుట్టెడప్పులలో మునుఁగుచున్నవారే."

"అప్పులవలన ప్రతిష్ఠ తగ్గిపోదా? ఏమో, నాకింకను విశ్వాసము లేదు."

"సువాసు గారూ! మీరీవిధముగా పంతముకై మాటలాడు చుంటిరిగాని ముందుగతి చూచుచుండుటలేదు. అయ్యో! ఈపసికూనగతి యేమగునాయని కొంచమైన యోచించు చున్నట్టు కనఁబడదే"

మర్మభేదకమగు నతని యీవాక్యమువలన సువాసు సీలకంఠుని మనస్సు నీరయిపోయెను. నేత్రములనుండి యశ్రువులు జలజల రాలజొచ్చెను. పుత్రునిపై ననురాగదృష్టి బరపి "అయ్యో, ఈ నా ముద్దుబిడ్డకై ఎన్ని తంటాలు పడితిని. ఆ కష్టమంతయు వ్యర్థమైపోవునా? విధాతవీని లలాటమున అగచాట్లు పడుమని లిఖించి యుండెనా? రాత్రింబగళ్లు క్రింద దింపక అల్లారుముద్దుగా పెంచుచు, ఎండ సోకనీయక, వడగాలి తగులనీయక దినమునకు నాలుగుపర్యాయములు అన్నము పెట్టి నీళ్లు పోసి మృదువస్త్రములు కప్పి పెంచుచున్న నా యీ బాలకుడు ముందు అన్నపానీయములకు దూరుడై దిగంబరుడై సూర్యకిరణము

లకు పసివాడి బిచ్చగానివలె వీధులవెంట దిరుగులాడును కాబోలు ?" అని దీర్ఘముగా యోచించుచుండెను. ఆమె కొంచెము దారిలోనికి వచ్చుచున్నదని మోహనరాయుడు సంతసించుచుండగా సువాసు తల యూచి "లక్షలకొలది సాధుసత్తములను కాపాడినవాని పుత్రుడెన్నడు ఇతరుల నాశ్రయింపజాలడు. తండ్రి చేసిన దానధర్మములే సత్యముగా సాయము లైనచో ఈతడే పదిమందిని పోషింపగలడు." అని పిల్లవానిని చూచి, "బాబూ! కొంచెము ఇటు రా. రేపటినుండి నీకు మిఠాయి, పాలు, పెరుగు దొరకవు. నీవు ఏడ్వవుగదా ?" అని బాలకుని కోమలబాహువులు పట్టుకొని దగ్గఱకుఁ దీసి చంక నిడికొని పైటకొంగుతో నతని నునుబుగ్గలమీఁది స్వేదబిందువులు తుడిచి ముద్దుపెట్టుకొనెను.

"రేపటినుంచి మిఠాయి పెట్టనంటున్నావా? ఎందుకే? దుకాణములో లేదా?" అని చంద్రుఁడు తల్లితో ననెను.

"దుకాణములో లేకేమి నాయనా? ఉన్నది కాని ప్రతిదినము డబ్బెవ్వరిత్తురు ?"

"నేను పెద్దవాడనైనాక డబ్బంత యిత్తానుగా" అని చల్ చల్ టక్ టక్ అమ్మా! చూడవే, నాగుఱ్ఱమెట్లా నడుస్తుందో" అనెను.

సువాసు కన్నులనుండి మిక్కుటముగా నశ్రులు ప్రవహించుచుండెను. "సుందరాకారుడు, సుకుమారుడు నగు ఈ చిఱుతవానికి ఇప్పటినుండియే దారిద్ర్య మనుభవించవలసి యున్నది కాబోలు. కాదు కాదు. ఎన్నికష్టములు వచ్చి నాతలపై పడినను సహింపగలను గాని నాపుత్రునిపై ఇంచుకంతయు వాని నీడనైన సోకనీయను" అని యోచించుకొనుచు మనస్సునకు ధైర్యము చెప్పుకొనుచుండెను. ప్రతాపచంద్రుఁడు కొయ్యగుఱ్ఱముపై తనశక్తి సామర్థ్యములన్నియు వినియోగించుచుండెను. ఆహా! పసివాండ్రచిత్తము లెంత స్థైర్యముతో

సంచరించుచుండును!

మోతేరాము సుహామను దన యభిప్రాయముతో నేకీభవించునట్లు చేయుట కెంతయో ప్రయత్నించి చూచెను. కాని యామె యొక మాటకైనను సరేయని ప్రత్యుత్తర మీయకుండెను. ఆమె మనస్థైర్యమును, ఆత్మాభిమానమును విన్నవారందఱు "భళీభళీ" అనుచుండిరి. అందఱికిని ఆమెయెడ నెన్నియోమడుంగు లభిమాన మభివృద్ధి చెందెను. మానాభిమానములు కలిగి ప్రతిష్ఠతో జీవనము జేయు పురుషుల భార్యలుచేయు ఉచితకృత్యమునే ఆమె యాచరించెను. కాని యించుకంతయు తప్పుత్రోవ పట్టలేదు.

తరువాత పదునైదు రోజులకే ఆస్తి యంతయు వేలమునకు వచ్చెను. తద్వారా ఏబదివేలు లభించగా సుహామ ఋణమంతయు పైసాలతో సహా తీర్చివేసెను. ఇంటిలోని అవసరములేని పరికరములు నన్నియు నమ్మి లోపల పెద్దపెద్ద గదులలో అఱుగోడలు పెట్టించి రెండుభాగములు చేర్పఱచి యొకదానిలో తానుండి రెండవది అద్దెకిచ్చెను.

౨

సుహామయింట నద్దెకున్న మున్షీసజీవనలాలు దూరదృష్టి కలవాఁడు. ప్రథమమున ప్రభుత్వోద్యోగిగా నుండి, స్వాతంత్ర్యాభిమానము గలవాఁడగుటచేత పైయుద్యోగుల సంతసింపజేయు కృత్యములందు అసంతుష్టుఁడై, వారుచేయు దురంతముల కోర్వజాలక రోసి యుద్యోగమును విసర్జించెను. ఉద్యోగకాలమునందు కొంతధన మార్జించి యుండుటచే దానితో నతఁడు కంట్రాక్టుచేయ నారంభించెను. అదృష్ట

వశమునను నిరంతరము పాలుమాలక జాగరూకతతో పాటుపడు చుండుట చేతను అతఁడు నెలకు నాలుగైదువందల రూపాయలు సంపాదించుచుండెను. అతఁడు ప్రారంభించిన ప్రతిపనియందును లాభమే విశేషముగా వచ్చుచుండెను. సజీవనలాలుగారి కుటుంబమే మంత పెద్దదికాదు. ఎంతో సంతుకలిగినను అచ్చిరాక చివరి కొక బాలికమాత్రమే వారికి దక్కెను. ఆమెకు వ్రజరాణి యని పేరుపెట్టి పంచప్రాణము లామెపై బెట్టి చాల వాత్సల్యముతో పెంచుకొను చుండిరి.

ప్రతాపచంద్రునికి వ్రజరాణికి మొదటి రోజుననే స్నేహముకుదిరెను. పదినిముషములలోనే యొకరియెడ నొకరికిగాఢవిశ్వాస మంకురించెను. వ్రజరాణి తన లక్కబొమ్మలు, గచ్చకాయలు, పీకెలు మున్నగునవి అతనికి చూపెను. ప్రతాపచంద్రుఁడును పుస్తకములు, కలములు, బొమ్మలు మొదలగు తన పరికరములు ఆమెకు చూపెను. వ్రజరాణి తల్లి సుశీల ప్రతాపచంద్రుని దగ్గఱకు దీసి అక్కున చేర్చుకొనెను. ఆనాటినుండియు నిర్భయముగా నిరువురు సాయం సమయముల కలసి మెలసి యాడుచు పాడుచు నుండిరి. చూచువారంకతె కీయిరువురు అన్నచెల్లెలుగా తోఁచుచుండిరి. సుశీల ఆయిరువురు బిడ్డలను జేరదీసి తొడలపై కూర్చుండ బెట్టుకొని యిరువురి ముఖమండలములు తదేక దృష్టితో చూచుచు తనలో తానెంతో సంతసించుచుండెను. వ్రజరాణి కూడ అప్పు డప్పుడు ప్రతాపచంద్రునికడ కేగుచుండుటచే సువాము వారిరువురి యాటపాటల గాంచి ఘోరసంసారబాధలు స్ఫురణకు వచ్చుచున్నను వానిని వెంటనే మఱచుచు ముద్దులమూట గట్టెడి వారి మధురవాక్యములు వినుచు అపరిమితాహ్లాదము నందు చుండెను.

ఒకనాఁడు సజీవనలా లెచ్చటికో పనిమీద వెడలి లోనికి వచ్చి

చూడగా బిడ్డ లిరువురు కుర్చీలపై కూర్చుండి యుండిరి. అందు ప్రతాపచంద్రుఁ డేదో పుస్తకము చదువుచుండెను. ప్రజరాణి చెవులు నిక్కించి వినుచుండెను. సజీవనలాలును చూచినతోడనే వారిరువురు తటాలున లేచి నిలువఁబడిరి. ప్రజరాణి మాత్రము నవ్వుచు తండ్రి యొడిలో చేరెను. ప్రతాపచంద్రుఁడు తల వ్రాల్చి నమస్కారము చేసెను. ఆహా! అతఁడెంతటి సుగుణపుంజము. నేఁటి కెన్ని దేములు నిండకున్నను భావిభాగ్యము లన్నియు వానిముఖమండలమున తాండ వించుచుండెను.. స్వచ్ఛమగు వదనము, ఎఱ్ఱనైన పలుచని పెదవులు, తుమ్మెదరెక్కలవంటి నీలకుటిలకుంతలములు, చలునజేసిన మకుటా లములు చూచి సజీవనలాలు ముగ్ధుఁడై "చంద్రుడూ! ఇటురా!" అనెను. చంద్రుడు వెనుకంజవేయుచు జంకుచు, మెల్లగా దగ్గఱకు పోయెను. అప్పుడు సజీవనలాలు పితృప్రేమతో వానిని అక్కున జేర్చి "బాబూ! నీవేమి చదువుచున్నావు?" అనెను. చంద్రుఁడేదో చెప్ప బోవు చుండగనే ప్రజరాణి "నాన్నా మంచికథలే నగేమి; ..... పిట్టలుకూడ మనమోస్తరే మాట్లాడు కొనేవా?" అనెను.

సజీవనలాలు చిఱునవ్వు నవ్వి "అవునమ్మా! అవికూడ మనమోస్తరే మాట్లాడు కొనును" అని యింక నేమో చెప్ప బ్రయత్నించుచుండగనే చంద్రుఁడు సిగ్గువిడిచి "కాదు కాదు! ప్రజరాణీ! మీనాన్న అబద్ధము చెప్పుచున్నాడు. ఇవి వట్టివట్టి కథలే కాని నిజంగా జరిగినవి కావు" అనెను. చంద్రుఁ డీవిధమున నిర్భయుఁడై తనవాదమును ఖండించగా సజీవనలాలెంతో ఆనందించెను.

అంతట మెల్ల మెల్లన భీతిని విడనాడి చంద్రుఁడు గబగబ చిలుక వలె "మాబడి చాల పెద్దది. అందులో ఈ ఊళ్లో వాళ్లంతా ఉండ వచ్చును. గోడలే తాడిచెట్లకంటే ఇంకా ఎత్తుగా ఉండును. పైనుంచే, బాతిని తన్నేవరకు అది చుక్కల్ని చూచి నవ్వింది. మా సోది

మాస్టరుగారి బల్లమీద మైనపుగుడ్డ పరచి ఉంటుంది. దానిమీదనే పూలుపూలుగా ఉండే గ్లాసులుంటవి. గంగలోని నీళ్లు మహాతొందరగా పోతుంటవి. అక్కడ గనక కొండలుంటే తటుక్కున కొట్టుకుపోతవి. మరే రైలు కీచుమని అఱచి పరుగెత్తుతుంది. ఇంజనే, గప్ గప్ అంటూ పోతుంది. అందులో ఆవి రుంటుంది. అందుచేతనే అదంత తొందరగా పోతుంది. తెలుసునా? దానితో చెట్లన్నీ, గబగబా గబగబా పరుగెత్తి పోతాయి" అని యింక నెన్నో చెప్పుచుండెను. వ్రజరాణి వాని నన్నిటిని సావధానముగా ఆలించుచుండెను. ఎన్నోమాఱులు ఆమెకూడ రయిలులో ప్రయాణము చేసినది కాని దాని నెవరు చేసిరో, యెట్లు నడచుచున్నదో, తెలియనే తెలియదు. ఆమె పలుమాఱులు తనకు సంస్కృతము నేర్పు గురువును ప్రశ్నించెను. కాని, ఆయన "బిడ్డా! పరమేశ్వరుని శక్తి అపారము" అని సెలవిచ్చుచు వచ్చెను. అందుచే పాపమా వ్రజరాణి పరమేశ్వరునిశక్తి యన్న పెద్ద గుఱ్ఱమనియు, అదియే మిగిలిన పెట్టెలను తలబట్టి యీడ్చుకొని పోవుచున్నదనియు తలపోసెను. చంద్రుడు మాటాడకుండినతోడనే వ్రజరాణి తన కోమలహస్తము తండ్రిభుజముపై వేసి "నాన్నా! నాన్నా నేనుకూడ చంద్రుని పుస్తకాలు చదువుతానే" అనెను. "అమ్మా! నీవు సంస్కృతము చదువుచున్నావు. కావున నీకా క్రొత్తభాష వద్దు."

"క్రొత్తభాష అయితే నేనుకూడా నేర్చుకుంటాను. అందులో ఎట్లాంటి కథలున్నా యనుకొన్నావు! అబ్బ అబ్బ! భలే కథలే. నాపుస్తకాల్లో కథలు లేనేలేవు. కాదే, నాన్నా! చదవడమంటే ఏమిటి?"

సజీవసరళా కింతవఱకు చదువుటయన నేమియో యెఱుంగకుండుటచే ప్రత్యుత్తర మీయజాలక అటునిటు జూచుచు తల గోకికొన

నారంభించెను. ఇంతలో చంద్రుఁ డామాట నందుకొని "నేను చదువు చుండగా నీవు చూడలేదా? దానినే చదవడ మంటారు" అనెను.

అట్లైతే నేను చదువలేనా? నేను చదివేదాన్ని మాత్రము చద వట మనరా!" అన్నది వ్రజరాణి.

వ్రజరాణి సిద్ధాంతకౌముది చదువుచుండెను. అందుచే చంద్రుఁడు "అదేమి చదువమ్మా! ఎప్పుడూ చిలకవలె వల్లిస్తుంటావు" అనెను.

## 3

కొంతకాలమునుండి ద్రవ్యాభావముచేత సువాను వంటలక్కను ఇం వృద్ధ దాసీలను తొలగించి తానే సమస్తకార్యములు చక్కబెట్టుకొను చుండెను. చిరకాలమునుండి యచ్చటనే తన జీవితము గడుపుచున్న వృద్ధదాసీని మాత్రము పైపనిచేయుట కుంచుకొనెను. స్వహస్తము లతో వంట జేసికొనుచు ఎన్నడిట్టి మోటుపనుల కలవాటు పడక సుకుమారిముగా నుండియుండుటచే ప్రథమమున కొంతకష్టముగా దోచి నను, పోనుపోను అభ్యాసవశమున అవి యామెకు సామాన్యముగనే యుండెను. విశేషపరిశ్రమవలన అప్పుడప్పుడు రాత్రులం దామెకు కొంచెము జ్వరము తగిలినట్లుగా నుండును. రాను రా నదియే వృద్ధి చెంది చూచినపుడెల్ల ఆమె రోగిగా గనబడుచుండెను. అన్నము నీళ్లు బొత్తుగా లోపలికి పోకుండుటచే ఆమె శరీరము చాల శుష్కించెను. ఏపని చేయుటకును ఆమెకు దార్ఢ్యము లేకపోయెను. కాని యట్టిలే పట్టుదల విడువక తనపనులు తానే నిర్వహించుకొనుచుండెను. కుమా రుఁడు కనబడునపుడు మాత్రము తన ముఖవైఖరి మార్చుకొని జబ్బు గానున్న దానివలె గాన్పింపకుండెను. అతఁడు బడికి పోవుటతోడనే

యతఁడు దానివైపు చూడనైన చూడక "వానిని నాకు మారుగా మా బుజ్జిచంద్రుని కిమ్ము. ఎండనుబడి బడికి పోవుచు వచ్చుచు చాల శ్రమ పడుచున్నాడు. త్రొక్కుడుబండి ఎక్కి హాయిగా తిరుగును'' అని మాత్రము చెప్పి వెడలిపోయెను.

సుశీల వ్రజరాణు లిరువురు సుహాసు వ్యాధిగ్రస్తు డైనపుడు చాల శ్రద్ధతో చూచిరి. సుశీల ఇంటిపనులవలన వచ్చుట కొంత యాలస్య మైనను వ్రజరాణి మాత్ర మొక నిముషమైన విడువక ఆమె మంచ మునే కనిపెట్టుకొని యుండెడిది. మందు నీయవలసినపుడెల్ల తానే త్రాగించుచు, దాహమిచ్చుచు, ఎంతో ఉపచారము చేసినది. ముద్దు ముద్దుపలుకులచే ఆటపాటలన్నియు నా బాలిక బొత్తుగా విడనాడెను. ఎప్పుడైన సుహాసయే యెంతో బలవంతపెట్టినచో చంద్రునితో మాత్ర మాడుకొనుటకు తమతోటలోని కేగెడిది. సుహాసు మంచము కడ చాలసేపు కాచుకొనియుండి కునికిపాట్లు వచ్చునంతవరకు అచ్చ టనేయుండును. ఒక్కొకపుడు ఇంటికిగూడ వెళ్లక అచ్చటనే నేలపై పడుండి నిద్రించును. రేయి చాల ప్రొద్దుబోయిన మీఁదట సేవకుఁడు వచ్చి ఆమె నెత్తుకొని యింటికితీసికొని పోవుచుండువాఁడు. ఆరోజు లలో ఒకనాఁడు వ్రజరాణి సుహాసు తలగడకడ కూర్చుండి వీవనతో విసరుచు పరధ్యానముగా నుండెను. ఆమె గోడవైపు చూచుచుండ సుందర వృక్షములపై సోకెడు వెన్నెలవలె ఆ బాలిక పెదవులపై చిఱునవ్వు తోఁచెను. పిన్ని యామెవైపు చూచుచున్న దేమోయను నూహయైన లేకుండనుండగా ఆమెచేతినుండి వీవన భూమిపై జాఱి పడెను. దానిని తీసికొనుటకు వంగగనే సుహాసు యామెను గాఢా లింగనము చేసికొని, "వ్రజరాణీ! నీవేదో యోజించుచున్నావు చెప్పుము'' అనెను.

వ్రజరాణి తలవంచుకొని సిగ్గుతో " ఏమీలేదుపిన్నీ! నేను నీకది

చెప్పను'' అనెను.

"చెప్పమ్మా! చెప్పు. నీవుచాలమంచిదానవు."

సిగ్గుతో "మరే—మరే—నవ్వవుగదా? — పో—నేజెప్పను." అని బాలిక పలికెను.

"నవ్వనులే చెప్పు. లేకపోయిన నేను కన్నులు మూసికొందును."

"ఎవరికి చెప్పవుగదా?''

"ఎవ్వరికి చెప్పనమ్మా!''

"నాకు చంద్రుడికి పెండ్లయితే ఇద్దరం సుఖంగా ఉంటాము.''

సుహాస గాఢముగా ఆమెను కౌగిలించుకొని "తప్పు, అమ్మా తప్పు. వాడు నీ కన్న కావలయును'' అనెను.

"అన్నకావలెనా? ఇప్పుడు తెలిసిందిలే, కాని నేను నీకు కోడల నైనకానా?''

"బాబు వచ్చినతరువాత వాని నడిగెదను. ఏమనునో?"

"వద్దే. అడుగవద్దు నాతోడుసుమా?"

"తప్పక అడిగెదను."

"ఒట్టు వేశానుగా! ఎలా అడుగుతావు?''

౪

కాలము నష్టపెట్టువారెవరు? అది నిరాఘాటముగా నడచుచునే యుండును. మోహేరాము ప్రతిదినము ప్రాత స్సాయంకాలములందు సజీవనలాలు గారింటికివచ్చి ప్రజరాణికి సిద్ధాంతకౌముదిచెప్పి వెళ్లు చుండెను. కాని ప్రస్తుతము ప్రజరాణి కాపుస్తకము నెడ శ్రద్ధాభక్తులు లేకుండుటచే ఆయన నామ మాత్రముగానే వచ్చుచుండెను. ఒకనాడు

సజీవనలాలు ఇంజనీయరాఫీసునుండి వచ్చి కచేరిచావడిలోని పడక కుర్చీలోకూర్చుండియుండెను. నొక రాతని కాలిజోడు విప్పుచుండెను. ఇంతలో రాధికయను దాసి చిఱునవ్వు నవ్వుచు తపాలు ముద్రగల ఒకయుత్తరము నాయనచేతికిచ్చెను. ఆయుత్తరముపైన "పూజనీయ పితృపాదారవిందముల సన్నిధికి" అని చిరునామా వ్రాసియుండెను. సజీవనలా లదిచూచి "ఈకవరు నాదికాదు. ఎవరిదో వారికిచ్చి వేయుము" అనెను.

"తమకే వచ్చింది విప్పిచూడండి."

"ఎవరైన బయటినుండివచ్చి యిచ్చి వెళ్లిరా?"

దాసి నవ్వుచు "విప్పిచూస్తే అంతా తెలుస్తుంది" అనెను. సజీవనలాలు మిక్కిలి విస్మయము నొందుచు కవరువిప్పి చూడగనే యందలి కాగితమునందీవిధముగ వ్రాయబడియుండెను.

"నాయనగారికి నమస్కారములు. ఇచ్చట నేను మీ దయవలన బాగుగా నున్నాను. మీ కుశల వార్తలన్నియు నాకెప్పటి కప్పుడు తెలియుచునేయున్నవి. నేను చంద్రునియొద్ద ఇంగ్లీషు నేర్చుకొనుచున్నాను. అతడు పాఠశాలనుండి వచ్చినతరువాత నాకు పాఠములు చెప్పుచున్నాడు. కాబట్టి నాకుమీరు బజారునుండి మంచిపుస్తకములు తేవలెను. చదువుకొనిన ఐహికాముష్మిక లాభములు లభించును. ఈవిషయమున మన వేదపురాణేతిహాసము లెంతయో ఘోషించుచున్నవి. కాన ప్రతివారును విద్య సాధించవలయును. దానివలన సమస్తదుఃఖములు తొలగిపోవును. నేను నిన్న మనోహరమైన కథ పిన్నికి చెప్పగా ఆమె నాకు లక్కబొమ్మ బహుమానము చేసినది. నే నిప్పుడాబొమ్మకు వివాహముచేయ నిశ్చయించితిని. దానికిమీరు

డబ్బిచ్చితీరవలయును. మున్ముందు నేను కౌముదిమాని ఇంగ్లీషు నేర్చుకొందును. ఈసంగతి ఇంతవఱకు అమ్మకు తెలియదు.

క్షమించవలయును.

మీ ముద్దుల పుత్రిక,

ప్ర జ రా ణి"

ఆకస్మికముగా ఉత్తరమును చదువుటచే సజీవనలాలునకు కొంత యానందము కలిగి మఱొకసారి గ్రుక్కలోనే లేఖనంతయు చూచి, ఆనందము పట్టజాలక పట్టికాళ్లతోనే లోపలి కరిగెను. అతడు చంద్రు నత్యాదరముతో దగ్గఱకు దీసి యిరువుర బిడ్డలచేతులు పట్టుకొని సుశీలయొద్దకు తీసుకవెళ్లి ఆమె కాయుత్తరమును చూపి "ఈయుత్తర మెక్కడిదో చెప్పుకొనుము" అనెను.

"చేతిక్రింద చూతము" అని సుశీల పలికెను.

"అట్లుగాదు. అక్కడనుండి లేవకుండనే వెంటనే చెప్పవలయును."

"చెప్పిన నేమిచ్చెదరు?"

"ఏబది రూపాయలు."

"మొదట రూపాయ లక్కడ పెట్టుడు. లేకున్న తరువాత కానం దురు."

"మాట దప్పుటకు నేనేమైన త్రాగుబోతు ననుకొంటివా? అంత సందేహమున్న పరిస్థితమిది తీసికొనుము" అని అతడు జేబులోనుండి పదిరూపాలనోటు తీసి చూపెను.

అప్పుడు సుశీల,

"అది ఎన్నిరూపాయల నోటు" అని యడిగెను.

"ఏబదిరూపాయలది. తీసికొని చూడరాదా?"

"ఎప్పటికి ఇచ్చెదరా?"

"ప్రథమమున చెప్పి తరువాత తీసికొనుము."

"బాబుది. ఇక నానోటు నాకివ్వండి. మాటదప్పిన నేనూరు కొనను" అని లేచెను. పాపను సజీవనలాలు చేతులు నులిమికొనుచు, "ఇంతకన్న వేరే దోపిడి మరేమికలదు? పైనబడి లాగుకొందువా?" అనెను.

"మాట యిచ్చి తప్పనెంచుట భావ్యమా?"

"నీకు మొదటనుండి ఇదంతయు తెలియును కాబోలు?"

"పైన ఇది యొకటియా? చాలు బాగున్నది పోదువు!"

"బాబూ! ఈయుత్తరము నీది కాదా?"

చంద్రుఁడు కడగంటిచూపుతో సజీవనలాలువైపు చూచి మెల్లగా "నే నెప్పుడు వ్రాసినాను?" అనెను.

"సిగ్గుపడకు చెప్పు" అని సజీవనలాలు అనెను.

"వాఁడే వ్రాసి ఇప్పుడు లేదనుచున్నాడు. మీరందర ఒకేకట్ట కట్టుకొని యుంటిరిగా" అని సుశీల పలికెను.

"నిజంగా నేను వ్రాసింది కాదు. వ్రజరాణి వ్రాసింది" అని చంద్రుఁడు చెప్పెను.

సుశీల యులికిపడి "వ్రజరాణి వ్రాసినదా" అని చప్పున భర్త చేతిలోనున్న ఉత్తరమును లాగికొని బొమముడి పాటుతో దానిని చూడ దొడఁగెను. కాని యామె నమ్మజాలక "వ్రజరాణీ! ఇది నీవు వ్రాసిన దేనా!" అని యడిగెను. వ్రజరాణి తలవంచుకొని "అవును" అనెను. వెనువెంటనే యామె పుత్రికను గాఢముగా కౌఁగిలించుకొని ముద్దాడెను. అప్పటినుండియు వ్రజరాణి చూచినపుడెల్ల కలముతో కాగితముపై యేదో వ్రాయుచునే యుండును. గృహకృత్యములందించుకైనను జోక్యము కల్పించుకొను నావశ్యకము లేకుండుటచే బంగారమునకు పరిమళ మబ్బినట్లు ఆమెకు లేఖనకళ పట్టుపడెను. కూఁతురికి చదువునెడ గల యాసక్తిని గాంచి సుశీల యెంతో సంతసించు

చుండెను. తండ్రికూడ ఆనందము పట్టజాలక "వ్రజరాణి పెద్దదైన మీదట చదువుకొనును" అని మనోహరములగు చిన్నిచిన్ని పుస్తకములను కొనితెచ్చి యిచ్చుచుండెను. ఎన్నఁడైనను కొమార్తె తన పాదములుగాని, భోజనముచేసి చేయిగాని కడుగు కొనినపుడు తల్లి చూచినచో పనికత్తెలపై నాగ్రహించి "పసిబిడ్డ నీవు తీసికొని ఆవిధమున కష్టపడుచుండ మీరు తెగబలసి యేమని కన్నులతో ఊరక చూచుచున్నారు!" అని గద్దించును.

ఇట్టి గారాబముతో కాలము గడుపుచుండ వ్రజరాణికి పండ్రెండవ యేఁడు సంపూర్తి యాయెను. కాని యింతవఱకు కామె పొయ్యి రాజేయుట కూడ ఎఱుఁగదు. ఎట్లెఱుఁగును? పుట్టి బుద్ధివచ్చిన నాటనుండి యెన్నడైన గృహకృత్యములందు జోక్యము కలిగించుకొనినదా? ఎల్లపుడు వ్రాతకోతలు దప్ప మఱొకవిషయ మామెకు తెలియనే తెలియదు. అందుచేత సుమారు ఒకనాఁడు సుశీలను జూచి,

"అక్కా! రాణి చదువుకొనుచున్నది కాని దానితోపాటు గృహకృత్యము లేమైన అలవరచు కొనుచున్నదా?" అని యడిగెను.

"ఏమి చెప్పుదును? నేనుకూడ నేర్పవలయు ననియే అనుకొందును. కాని ఏదో యోచించి యూరకొందును."

"ఊరకొను టెందుకు?"

"ఎందుకు గాదు. నాకే బద్ధకముగా నుండును."

"అట్లయిన నాకీపని అప్పజెప్పుము. కొలదిరోజులలోనే పిల్లను సమస్త గృహకృత్యములందు దక్షురాలిని చేతును. స్త్రీలకిట్టిపనులు చేతగాకున్న ఎంతో లోటునుమా."

"ఇప్పటినుండియే అది యెట్లు పొయ్యిదగ్గర కూర్చుండగలదు?"

"అభ్యాసవశమున నదియే యలవడును. దినదినము కొంతసేపు నీదగ్గర కూర్చుండబెట్టుకొమ్ము."

"లేతపూవులవంటి దాని పాలబుగ్గలు వాడిపోవా ?"

"వాడినగాని ఫలము రాదు."

మరునాటిరోజునుండియే వ్రజరాణిని వంటజేయ నభ్యసింపదొడఁగెను. ప్రథమమునం దామెకు చాల కష్టముగా తోఁచెను. పొయ్యి రాజదు. అందువలన ఊద నారంభించగా పొగ కన్నులలోనికి పోవుటచే మంట పుట్టి జలజల నీరు ప్రవహించుచుండెను. తరుణకమలముల వంటి యామె కన్ను లెఱ్ఱబారెను. నిప్పురవ్వలు పడుటచే అమూల్యము లగు పట్టుచీరె లెన్నియో చిల్లులుపడి పాడయిపోయెను. మాటిమాటికి నిప్పుకొఱవులను కదల్చుచుండుటచే ఆమె చేతులు కాలి బొబ్బలు పొక్కెను. క్రమక్రమముగా ఆబాధలన్నియు నుపశమించెను. వంటలో నెన్నిలోపము లున్నను సువామ కసరక వ్రజరాణి నుత్సాహపఱచుచు ప్రతిదినము వంట జేయించుచునే యుండెను.

వంటచేయ నారంభించి రెండునెలలైన కాకముందే వ్రజరాణి యొకనాఁడు చంద్రునియొద్దకు వెళ్ళి "బాబూ ! నేను అన్నము వండ గలను" అనెను.

"నిజంగానా ?"

"నిన్న నేను వండిన అన్నము తిని పిన్ని మహాసంతోషపడ్డది."

"అట్లయిన నన్నొకనాడు మీ యింటికి పిలువు."

వ్రజరాణి సంతసించి "సరే రేపు రమ్ము" అనెను.

రెండవనాఁడు తొమ్మిది గంటలకు వ్రజరాణి చంద్రుని భోజనమునకు పిలిచెను. అతఁడు వెళ్లి చూడగనే వంటయిల్లలికి ముగ్గుపెట్టి యుండెను. ఇంటిలోనుండి యేదో సువాసనకూడ వచ్చుచుండెను. పీటలు వేయబడియుండెను. ఒక కంచములో అన్నము, ప్రక్క ఆకులో పప్పు, కూరలు వడ్డింపబడియుండెను. కంచుచెంబు లోటాపీటలయొద్ద నున్నది. ఇట్లు పరిశుభ్రముగా అమర్చియుండుట చూచి చంద్రుడు

గంతులు వేయుచు సజీవనలాలునొద్దకు వెళ్ళి ఆయనను లాగుకొని వచ్చి వంటయింటవద్ద నిలువబెట్టెను. సజీవనలా లానందముతో పొంగి పోయి వెంటనే యుత్తరీయము తీసి చొక్కా విడిచి కాళ్ళుచేతులు కడిగికొని వంటయింటిలోనికి వచ్చి కూర్చుండెను. కాని పాపము ప్రజరాణికి మఱియొక అతిథికూడ పిలువకయే వచ్చి కూర్చుండునని యేమి తెలియును? ఒక్క చంద్రునకే ఆమె వంట చేసెను. అందుచే చాల సిగ్గుపడి తన తల్లివైపు సంశయదృష్టితో చూడ నారంభించెను. సుశీల యిదంతయు కనిపెట్టి చిఱునవ్వుతో భర్త నుద్దేశించి "మీకు ప్రత్యేకముగా అన్నము సిద్ధముగా ఉన్నది. పిల్లలమధ్యకు పోయి ఏలకూర్చుంటిరి?" అనెను.

ప్రజరాణి ఉన్నదానిలోనేసర్ది ఇరువురకు చెరిసగము వడ్డించెను.

ప్రజరాణి చేసినకూరలు ఎంతసొగసుగా ఉన్నవి! దీనిలో ఒక్క ముక్కయైనను వదలుటకు బుద్ధి పుట్టుటలేదు.

"అన్నియు అమృతముగా ఉన్నవి" అని సజీవనము పలికెను.

"అన్నము చూడండి. ఎక్కడైన మెత్తపడినదేమో" అనెను.

చంద్రుడు—"అబ్బా! ఇట్టికూరలు నాజన్మములో ఎన్నడు తిన లేదు. ఎంత రుచిగా ఉన్నవి!"

"ప్రజరాణీ, మీనాన్నగారికి మసాలా బంగాళాదుంపల కూరపెట్టు" అని చంద్రుడు పకపకనవ్వసాగెను. ప్రజరాణి సిగ్గున తలవంచుకొని మూతి బిగించుకొనెను. సుశీల భర్తతో "పాపము వాండ్రికై సిద్ధము చేసికొనినదంతయు మీరు మెక్కి వేసితిరా? ఇక లెండు" అనెను.

"నీనోరుకూడ ఊరుచున్న యెడల వచ్చి కూర్చుండుము."

మెల్లమెల్లన నిరువురు వండిన పదార్థము లన్నియు తిని లేచిరి. సజీవనలాలు శౌరీతీసి ప్రజరాణికిచ్చి బహూకరించెను.

డిప్టీకలెక్టరు శ్యామాచరణుఁడు చాల ప్రసిద్ధి కలవాఁడు. నగరములోని పెద్దమనుష్యులలో ఈయనతో పరిచయము లేనివాఁడు లేడనియే చెప్పవచ్చును. దీనికి కారణ మీయనయొక్క కలుపుకోలుతనమే. సహానశీలుఁడైన యీయనకు హోదాయున్న గిట్టదు. తన దగ్గఱకు వచ్చు కేసులను సూక్ష్మదృష్టితో పరిశీలించుచు వేగిరపడక న్యాయము తేల్చును. ఆయన యాలోచనాపటుత్వమునకును, న్యాయానుశీలనమునకును పెద్దపెద్ద వకీళ్లు, బ్యారిష్టరు లందఱు ముక్కుపై వ్రేలు పెట్టుకొందురు. ఈయన చాల స్వతంత్రాభిప్రాయములు కలవాడు. తన యిల్లు న్యాయస్థానముతప్ప మఱెచ్చటికిని పోవఁడు. సాలిగ్రాము సజీవుఁడై యున్నంతవఱకు—కాదుకాదు—అదృశ్యము కాకున్నంతవఱకు కాలక్షేపమున కాయనయొద్దకుమాత్రము వెళ్లుచుండువాఁడు. ఆయన కాన్పింపకపోయినమీఁదట తన యింటిగుమ్మమును వదలి మఱెచ్చటికి పోవనని శపథము చేసికొనెను. చాలకాలముక్రిందట ఒకసారి యతఁడు కలెక్టరుదర్శనముచేయ వెళ్ళెను. అచ్చటనున్న సేవకులు "దొరగారు స్నానము చేయుచున్నారు" అనిరి. రెండుగంటలసేపు అక్కడ నున్న ముక్కాలిపీటపై అతఁడు కూర్చుండి ప్రతీక్షించుచుండెను. తదనంతరము దొరగారు చేతిలో టెన్నిసుబాటు పట్టుకొని వచ్చి "పండిత్ జీ! మిమ్మింతవఱకు కూర్చుండబెట్టినందుకు చాల చింత కలుగుచున్నది. ఇప్పుడు క్లబ్బుకు అత్యవసరముగా పోవలసియుండుటచే నేడు వీలుకాదు. ఇంకొకపర్యాయము రండు" అని పలికెను. వినుటతోడనే సలాముచేసివచ్చి, శ్యామాచరణుఁ డదిమొదలు ఏ యాంగ్లేయుని దర్శించుట బొత్తుగా మానివేసెను. వంశ

ప్రతిష్ఠలు నిలుపుకొనుటయందును, స్వాభిమాన సంరక్షణమందును ఇతనికి పట్టుదల మెండు. ఈతఁడు చాల రసికుఁ డగుటచే నోటినుండి వచ్చెడు ప్రతిమాటయు హాస్యరసభరితమై యుండును. సాయంసమయమున ఉద్యానవనములో ఇష్టమిత్రులతో కలసి సరసాలాపము లాడుకొనుచుండినపుడు నడుమనడుమ వచ్చెడు చమత్కారములకు సభ్యులందఱు పకాపక నవ్వుచుందు రేని యావాటికయేగాక వీధియంతయు ప్రతిధ్వనించును. ఈతఁడు సేవకులతోకూడ చాల సరళముగా సంచరించును. వీధియరుగులపై వారితో కూర్చుండుటకు కూడ సంశయింపఁడు. ఇట్లు శ్యామాచరణుఁడు వారితోపాటు ప్రవర్తించుచుండినందున గుమస్తాల జేబులు నింపుట దుర్ఘటముగా నుండెను. అందువలన వా రీతని పేరన్న విషము వెళ్ళగ్రక్కుచుందురు. ఇతని కాచార విషయమం దంత పట్టింపులేదు. లాగులు చొక్కా లీయనకు పనికి రావు. బొందెలచొక్కా, పట్టంచు ఉత్తరీయపువల్లెవాటు, కలంకారి తలగుడ్డ, బిళ్ళగోచీ మొనలుదేలిన ఢిల్లీముచ్చెలు మొదలగునవి ఈయన ధరించును. దండలుతిరిగిన చేతులును, కళకళలాడు ముఖము కలిగిన శ్యామాచరణున కివియే కోటు పంట్లములకన్న అధికశోభ నొసగుచుండెను. ఇతనికి పట్టణమునం దంతట ఎక్కువ పలుకుబడి యున్నను ఇంట మాత్రము మాట సాగనే సాగదు. గృహసామ్రాజ్యమంతయు ఈయన భార్య పరిపాలించుచుండును. చాలకాలముక్రిందట ఆమె కిష్టము లేనిదే యీయ నొకప్పు డొక వంటకత్తెను ఏర్పాటు చేసెను. ఆ వంటలక్క చూచుట కింపుగా కాన్పించుచుండుటచే శ్యామాచరణుని భార్య ప్రేమవతి పతి కావించిన యనుచితకృత్యమునకు విసుగొంది కోపగృహమున ప్రవేశించెను. తరువాత కొంతకాలమునకు శ్యామాచరణుఁడు భార్యకు లొంగి వంటకత్తెను పంపివేసెను. అప్పటినుండి ఈయనకు విరక్తికలిగి గృహకార్యనిర్వహణమునందు

జోక్యము పెట్టుకొనుట మానివేసెను.

ఈయన కిద్దరు పుత్రులు, ఒక పుత్రికయు కలరు. పెద్దవాఁడగు రాధాచరణుఁడు గత సంవత్సరము బి. ఏ. పరీక్షయం దుత్తీర్ణుఁడై "రుడికీ" కాలేజిలో చదువుచుండెను. అతని కొక భూస్వామికొమార్తె నిచ్చి వివాహము చేసిరి. అతని తరువాతిదగు కొమార్తె సేవతిని ప్రయాగలో నొక కులీనున కిచ్చిరి. చిన్నవాఁడగు కమలాచరణున కింతవఱకు వివాహము కాలేదు. కనిష్ఠపుత్రుఁ డను గారాబముతో తల్లి పెంచుచున్నందున వాఁడు చదువుసంధ్యలయం దేమాత్రము శ్రద్ధ జూపకుండెను. పదునైదేండ్ల వయసు వచ్చినను ఒక చిన్నియుత్తరము గూడ వ్రాయలేఁడు. అందుచే పాఠశాలలో పడవేసిన నలుగురితో కలసి మెలసి తిరుగుచున్నయెడల రెండక్షరము లంటునేమో యని రిజస్టరులో పేరు చేర్పించిరి. కాని వాఁడు పాఠశాలకు పోయిన వెంటనే జ్వరము, తలనొప్పి వచ్చుచుండెను. అందుచే అచ్చటినుండి మాన్పించి ఉపాధ్యాయుని నియమించి యింటిలోనే "ప్రయివేటు" చెప్పించుచుండెను. నాలుగునెలలు గడచినను వాఁడు సగముతప్పులతో రెండు మూఁడు పాఠములకన్న ఎక్కువ నేర్చుకోలేకపోయెను. పిల్లవాని బుద్ధివైశద్యమును గాంచి యుపాధ్యాయుడు తనకు రావలసిన డబ్బు కూడ వదలుకొని మెల్లగా జారుకొనెను. ఎవరిని వచ్చి చదువు చెప్పుమనినను శిష్యుని తెలివితేటలు గాంచి వెనుకడుగు వేయుచుండిరి. చివరకు విధిలేక శ్యామాచరణుఁడే స్వయముగా ఆపని ప్రారంభించెను. ఒక వారమునకే తండ్రి కుమారుని తత్వమును సంపూర్ణముగా గ్రహించెను. న్యాయవాదుల వికృతవాదములమధ్యనుండి తప్పుకొనుట, సాక్షులు కూయు శుద్ధాబద్ధములనుండి సత్యమును గ్రహించుట మున్నగున వన్నియు ఆయనకు తేలికగా నుండెను కాని, చదువుసంధ్య లంటని మూర్ఖునకు చదువు చెప్పుట దుష్కరమని

స్పష్టమాయెను. పిల్లవాని మందబుద్ధికి కోపగించి తండ్రి యప్పుడప్పుడు వానిని దండించుచుండినపుడు ప్రేమవతి గొంతు చించుకొని గోల పెట్టుచుండును. అందుచే ఛీ యనుకొని రోసి వాని మొగము చూచుట కూడ మానుకొనెను. కమలాచరణుఁడు సాముద్రరేఖలు కలిగి, సుకుమారుఁడుగా, మధురభాషిగా నుండుటచే తల్లికి వీనిపై చాల ప్రేమ. అతఁ డట్టి తగని గారాబమువల్లనే గాలిపటములు, పావురములు మున్నగునవి యాడించు దుర్వ్యసనములలో తగుల్కొనియెను. తెల్లవారకముందే పావురముల నెగురవేయుటకు పోయి యిష్టసఖులతో కలిసి చీకటిపడిన తరువాత ఇల్లు చేరుచుండును. జూదము కూడ నుండినగాని దర్జాగా నుండదని యెంచి యందులోను ప్రవేశించెను. అద్దము, క్రొవ్వుదువ్వెన, మంగలికత్తి అత్తరు మొదలైనవి వాని కత్యంత ప్రియవస్తువులు.

ఒకనాఁడు ప్రేమవతి యేదో పనిమీఁద సుహాసు యింటికి వెళ్లెను. అచ్చట పసిడిబొమ్మవలె నుండు వ్రజరాణిని జూచి యీ బాలిక తన కోడలైనచో ఇంటి కలంకారముగా నుండునని భావించెను. ఏదో మాటసందర్భమున సుశీలతో ఆ విషయము కొంచెము ప్రసంగించి వదలెను. వ్రజరాణి కిప్పుడు పదమూఁడవయేఁడు వచ్చుటచే తల్లిదండ్రులును ఆమె వివాహవిషయమై యోజించుచుండిరి. ఇట్టి తరుణమందే ప్రేమవతి మనోగతము తెలియవచ్చుటచే వారు అపరిమితానందభరితులైరి. పరిచితులనియు, కులీను లనియు, పిల్లవాఁడును బుద్ధిమంతుఁడుగా చదువుకొనుచుండె ననియు, పిత్రార్జితమునకు కూడ లోప మేమియు లేదనియు వా రాశ చెందిరి. ఇట్టిసంబంధము మనము చేసికొన్నను ధన్యుల మగుదుమని తలపోసిరి. "ఆలస్య మమృతం విషమ్" అని భార్యాభర్త లిరువురు కూడ బలుకుకొని వెంటనే శ్యామాచరణునకు వర్తమాన మంపిరి.

ఈ వర్తమానము చేరుటతోడనే యచ్చట నానందముతో అత్త, ఆడుబిడ్డ, కొడుకులు, కోడలు ఏకమై గోష్ఠి చేసిరి. ప్రేమవతి పెద్ద కోడలగు చంద్ర "అత్తయ్యా! తమ రీయేడే వివాహము జేయ నిశ్చయించితిరా?" అని యడిగెను.

"చేయవలయు ననియే యున్నది. కాని మీ మామగా రేమందురో."

"కట్నములు కానుక లేమైన నున్నవా?"

"కట్నములు, కానుకలు అన్ని లక్షణములు సరిగా నుండువారి కుండవు. వధూవరులలో ఏదో లోప ముండు హేతువుచేత అది ధన రూపమున బయట బడుచున్నది. మన పెండ్లికూతురి కేలోటును లేదు. సర్వలక్షణసంపన్న."

"ఆమె కూడ వచ్చిన మన యింటిలో జాల సందడిగా ఉండును. ఏమే వదినా, నీవు పాటపాడు మేము తాళము వేయుదుము" అని ప్రేమవతి కుమార్తె సేవతి పలికెను.

చంద్ర—నాకు పాటలు పద్యములేమియు రావు. అదొక ఆసపెట్టుకొనవద్దు.

చంద్రకంఠము క్రౌంచెము గార్దభస్వరమును పోలియుండుటచే గొంతెత్తిపాడిన అపశ్రుతిపలుకును. అందువలన ఆమెకు సంగీతమన్న చాల అసహ్యము.

సేవతి—పాటలురావా? పట్టణములో నందఱు నీవు సంగీతము చాల బాగుగా పాడుదువని గొప్పగా చెప్పుకొనుచున్నారే?

చంద్రమతి యెగిరిపడి చురచుర చూచుచు, "పాటలు పద్యములు పాడి యితరులను మెప్పించి మెడలో హారములు దిగవేసికొన నిష్టము కలవారి కవియన్నియు కావలయును కాని నా వంటి దానికెందుకు?" అనెను. "వదినా! ఒక్కమాటకే నీకంత కోపమెందుకమ్మా! సరే

కాని ఆ "మఱచిపోయినావుర" అనుపాట పాడుదు! ఎన్నోరోజుల నుండి నీ పాట వినవైనలేదు. నే కెందుకో చాలకుతూహలముగా ఉన్నది."

"కోయిల కంఠమువలె గొంతెత్తి నీ వంటివారుపాడి పదిమందిలో ర క్తి బుట్టించవలయును కాని నా బోటిదాని దేమున్నది."

"అబ్బా, నీవు చెప్పినమాట వినవుగదా! మా వదినె చాలమంచిది. ఒక్కసారి పాడు."

చంద్ర—నీ యిష్టము వచ్చినపుడెల్ల పాడుమనిన పాడుటకు నేనేమైన బోగము దాని ననుకొంటివా? కాక—

సేవతి—ఇదిగో వదినా! విను. ఈ రోజుపాట పాడనిది నిన్నేమో వదలిపెట్టను.

సేవతికంఠము చాల శ్రావ్యముగా నుండి చప్పున హృదయము నాకర్షించును. ఆమె చాలరూపవతి. దానిమ్మగింజల వంటి పలువరుస, తరళములగు నయనములు కలిగి మోహినీదేవతవలె నుండును. మబ్బురంగు చీరకట్టుకొని నపుడు చూడశక్యము గాకుండును. సంగీతము నందభిరుచి కలవారి నోరెప్పుడూరకుండదు. అందుచే ఆమె కొంచెము కూనరాగమున,

"మఱచిపోయినావుర! నా మాటనీవు చిన్నికృష్ణా! ॥మ॥
పెరుగుముద్దల నారగించి పెరుగుచునుండంగ నీవు
మంచినీరు ద్రావినేను, మనుచునుంటి జగములోన కృష్ణా! ॥మరచి॥
పెరుగుముద్దల పెరుగుముద్దల"—అని పదిసారులు నొక్కిపాడి కడుపు చెక్కలగు లాగున పకపక నవ్వెను. అప్పుడు ప్రేమవతికూడ కొంచెము నవ్వెను. కాని చంద్రమాత్రము అలిగి,

"నవ్వు పట్టలేకుండ వచ్చుచున్నదే. దేనికమ్మా? కారణములేక అంత పొంగిపోవుటెందుకు" అనెను.

"వదినా! కోపమెందుకు? కాని ఇద్దఱముకలిసి పాడుదమురా."

"కాకి కోయిలలు కలసి పాడిన ఎంతసరసముగా ఉండునో మన మిరువురము కలిసిపాడిన అంతసరసముగా ఉండును."

"కోపమెప్పుడు నీ ముక్కుమీదనే యుండునేమమ్మా?"

"అట్లని నా జోలికి రాకుండ మానుకొంటిరా? నేను పాట పాడ లేకపోయిన యెడల నన్నెవరైన నిందింతురా?"

"ఎవరైన యనుమాట రాధాచరణునకు సంబంధించినది. చంద్ర కేలోపము లేకున్నను పతి కేమాత్రము లోపము కలిగింపదు. ఆయన కెన్నఁడైన ఇంత తలనొప్పి వచ్చినచో ఆమెకు పంచప్రాణము లెగిరి పోవును. భర్త వేళ కింటికిరాక కొంచె మెచ్చుటనైన గడియ మసలిన "ఏలరాకుండెనా" అని పరిపరివిధముల తహతహపడును. రాధా చరణుఁడు చదువుకొనుటకు కాశీపట్టణము వదలి "రుడికీ" వెళ్లినప్పటి నుండియు ఇతరులతో నవ్వుట, మనసిచ్చి మాటలాడుట ఆమె మాని వేసెను. ఆమె విలాసములన్నియు రాధాచరణుని వెంటనే వెళ్లెను. ఇట్టిసుగుణము లామె హృదయమున పాదుకొని యుండుటచే భర్త ఆమె వశవర్తి యయ్యెను. ఇందు వింతపడవలసిన విషయమేమున్నది! రూపరేఖావిలాసములం దెట్టి లోపములున్నను మనసునందు ప్రేమ పరిపూర్ణముగా తరంగించుచుండునేని యవన్నియు పేర్కొనుట అన వసరము.

సేవతి—ఎవరో నిందింతురని ఎత్తిపొడిచెద వెందుకు? వా రెవరో నీ పైన ఆపేక్షతోనే ఉండిరిగా!"

"ఏమి అపేక్షయో. కాని చాలకాలమునుండి ఒక యుత్తరమైన లేదు."

"నాలుగు రోజులేనా? వ్యవధానమయినది."

"నీ కాళ్లుచేతులు పట్టుకొని "ఒకయుత్తరము వ్రాయవమ్మా"

అని ఎంత బ్రతిమాలినను వినిపించుకొనుట లేదుకదా"

"ఎప్పుడాకచేసోది, యెవరు వ్రాయకలరు! ఏదైన క్రొత్తవిషయ ముంటేనా?"

"లేకేమి. ఈ సారి పెండ్లివిషయ మున్నదికదా, దానిని వ్రాయుము కలము సిరాబుడ్డి తెత్తునా?"

"ఒక షరతుమీద వ్రాతును."

"ఏమిటది?"

"నీవు—మఱచిపోయినావుర—అనుపాట పాడవలయును."

"సరే. అట్లే పాడుదును. నవ్వదలచు కొన్నవారంద ఱొక్కపెట్టున నచ్చి నవ్వుడు."

"ముందుగా పాడినగాని వ్రాయను."

"నీ పూరక మాటలు చెప్పుచుందువే కాని వ్రాయవు."

"నీ తోడు, నా తోడు, అమ్మతోడు. ఇక పాడు."

చంద్ర పాడ నారంభించెను—

మఱచిపోయినావుర నా మాట నీవు చిన్నికృష్ణ!
పెరుగుముద్దల నారగించి-పెరుగుచు నుండంగనీవు
మంచినీరు ద్రావినేను-మనుచునుంటి జగములోన ॥కృష్ణా!

"ఆమె చివరచరణము కొంచెము గొంతెత్తి పాడుచుండెను. సేవతి నా పాటలోని అపస్వరములకు లోలోపల నవ్వుచు పమిటచెంగు నోట గట్టిగా క్రుక్కుకొని పాట యందాదర మున్నదానివలె నటించు చుండెను. చంద్ర మరల రెండవచరణము పాడదొడగెను.

"నీకు గలరు అష్టభార్యలు"
నాకు గలవు నీ వొకడవె, నీ వొకడవెరా, కృష్ణా! నీ వొకడవెరా!

"నీవొకడవెరా" యనుమాటకు సేవతి నవ్వు నాపుకొనలేక క్రింద బడి దొర్లనారంభించెను. అప్పుడు చంద్ర కన్నీరు నించి,

"ఇక నవ్వులైనవి. కాగితము కలముదెత్తునా?" అనెను.

"ఇంక కొంచెము నవ్వనీయవమ్మా! తరువాత వ్రాసికొన వచ్చును."

సేవతి విరమించక నవ్వుచునే యుండెను. ఇంతలో కమలాచర ణుఁడు వేంచేసెను. అతడు పదునైదు సంవత్సరముల ప్రాయము గలిగి పచ్చనిపసిమి చాయన నుండును. బలిష్ఠమైన కాయము, నవ్వు ముఖము, కనుమాయక పరిమళించు ధౌతవస్త్రములు, కన్నులకు సుర్మా, చేతిలో పావురములజోడు కల యా సుందరాకారుఁడువచ్చి మంచముపై కూర్చుండెను. సేవతి తమ్మునివైపు తిరిగి,

"కమలా! నా నోరు తీయబడచేసిన నీకు శుభవర్తమానము తెలిపెదను" అనెను.

"నాకు శుభ ర్తమానము చెప్పినను చెప్పకున్నను నా పావురమీనాడు అన్నిపా ములను నోడించి చూపరుల కమితాశ్చర్యము కలిగించి యుండుట మీ యందఱి నోళ్లు తప్పక తీయబడును" అని యతఁడు గెల్చిన పావురమును బొటనవ్రేలిపై నిలువబెట్టెను.

సేవతి—నేనుచెప్పునది వినినవెంటనే ఇంతవాడ వంతవాడ వైపోపుదువు.

"చెప్పనక్కఱ లేదు. దాచిపెట్టుకొనుము. నాకు నీవర్తమానము వినకున్నను చాల సంతోషము కలిగినది. నేడేమి జరిగినదో నీకు తెలియునా? ఈపావురము జనులంద ఱబ్బురపడునట్లు నా ప్రతిష్ఠ నిలపినది. మున్నేఖాన్ అను మహమ్మదీయుడు కొంతకాలమునుండి నాపైన ఒకకన్ను వేసియుండి ఒకనాడు నేను వానియింటి సమీపముగా వెళ్లుచుండ 'మీదగ్గర ఏమైన జోడున్న విడుపుడు. ఒకచేయి చూచెదను' అని తనయొద్దనున్న జత చూపెను. అప్పుడు నేను 'వ్యర్థముగా తొందరపడక ఒకమాసము తాళుము. తరువాత నీయిష్టము

వచ్చినట్లు చేయుము' అని యంటిని. నే డద్దానిని పురస్కరించుకొని పెద్దమైదానములో ఏబదిరూపాయల పందెము నిర్ణయించిరి. వందల కొలది మనుష్యులు గుమికూడి యుండిరి. అతడు విడిచిన పావురము మెడనిక్కించి 'గుడు గుడు' శబ్దముతో బయలుదేఱ దానినిచూచి జనులందరు 'భళీ భళీ' యని హర్షముతో కరతాళధ్వనులు చేసిరి. అది పై కెగురుట తోడనే నాపావురమును ప్రాణాపాయకరములగు పోటులు పొడిచెను. కాని నాది చాల మెలకువతో ఆపోటుల నన్నిటి తప్పించుకొనుచు దానిని గాయపఱచెను. అదియు మరల రోషము చెంది దీనిని పొడిచెను. ఇది క్రిందికి వచ్చుటతోడనే నలుదిశలనుండి 'కొట్టినది' 'కొట్టినది' అని కోలాహలము చెలరేగెను. వెంటనే నే నెక్కడలేని రోషము తెచ్చుకొని భీకరముగా నుత్సాహకరమగు కేకవేసి చూడ నాపావురము పైన అదిక్రింద నుండెను. తదుపరి తన పావురము కూడ పైకి పోవలయు ననుకొని సాహేబెంతో ప్రయత్నించెను. కాని అది యణుమాత్రమైన మోహరించి నిలువచాలక పాఱి పోయెను. సాహేబెంతో దూరము వెంబడించెను. జనులందఱు చాల విస్మితులై చిత్రప్రతిమలవలె చూచుచుండిరి. చివరకు నిరాశచే మొగము చిన్నపుచ్చుకొని నిట్టూర్పులు విడచుచు సాహేబు చాల దిగులుపడెను. ధనము పోయినందున కాతని కేమియు విచారము లేదు కాని ఎన్నోసారులు పందెములందు గెలిచిన ప్రతిష్ఠ పోయినదే యని నిశ్చేష్టుడాయెను. తుదకు వెక్కివెక్కి యేడ్చుచు ఇంటికి వెళ్లి పోయెను. వెంటనే ఆతడు తన పావురమును ప్రాణములుండగనే మోకాలిలోతు గుంటలో పాతిపెట్టెనని వింటిని. అని జేబు గలగల లాడించెను.

సేవతి——అట్లయిన ఊరక నిలువబడు టెందుకు? దుకాణమునకు మనుష్యుని పంపుము.

"వదినా! నీకేమి కావలయునో చెప్పు."

"ఆమెకా! పెరుగుముద్ద."

"అన్నగారికో?"

"ఆయనకు అష్ట భార్యలు."

వెంటనే అక్కా తమ్ము లిరువురు కడుపుబ్బ నవ్విరి.

## ౬

వ్రజరాణి వివాహమునకై సుహాసు శరీరమును ధారవోయుచుండెను. సుశీల యామె చెప్పినట్లు వినుచు దాసివలె సర్వకార్యములు చేయుచుండెను. మున్సీసజీవనలాలు విధివిరామములేక బజారునుండి ఇంటికి, ఇంటనుండి బజారుకు ఉదయము మొదలు సాయంకాలమువఱకు కాళ్లు పడిపోవునట్లు తిరుగుచుండెను. కాని యెవ రెట్టి ప్రయత్నములు చేయుచుండిరో ఆ వ్రజరాణి చీఁకటిగదిలో కూర్చుండిపోవుచుండెను. అందఱు పనిసందడిలో నుండుటచే కొంచెమైనను ఎవరికామె సంగతియే జ్ఞాపకము లేకుండెను. చంద్రుఁడు ముసుఁగుపెట్టుకొని యుదయమున పాఠశాల కేగి చీఁకటిపడినతరువాత ఇంటికివచ్చి తన గదితలుపు గొళ్ళెము పెట్టుకొనెను. వ్రజరాణిముఖము చూడనని ప్రతిజ్ఞ పట్టినట్లాతఁడు కన్పించుచుండెను. ఎన్నఁడైన ఆమె తన కెదురైనచో బారెడుదూరముగా తొలగిపోవుచుండెను. వెనుకటివలె దగ్గఱ గూర్చుండి కబురులు చెప్పుచుండెనేని మొగ మావలకు త్రిప్పుకొని విముఖత్వము ప్రకటించుచుండెను. అందువలన ఆమె చాల విలపించుచు సుహాసుయొద్దకు బోయి "పిన్నీ, బాబు నాతో బొత్తుగా మాట్లాడుటలేదు. నీవైన చెప్పవే" అని కొంగు పట్టి

చంద్రునిదగ్గరకు లాగుకొనివచ్చి మారాము చేయుచుండెను. కాని చంద్రుడు వారిని చూచినవెంటనే యచ్చటినుండి మొగము తప్పించి యెచటికో పోవుచుండెను. వ్రజరాణి "బాబూ! కొంచెమాగుము; ఆగుము, నాతోడు, పోవద్దుసుమా" అని పిలచుచు వీధిద్వారము వఱకు వెంబడించుచుండును. అతఁడీమాటలు పెడచెవినిపెట్టి తిరిగి చూడకయే వెళ్ళుచుండుట కాంచి వ్రజరాణి యచ్చటనే నేలపై కూలబడి ఏడ్చుచు "చంద్రునకు నామీాద ఇంతకోప మెందుకు? నే నేమియు చేయలేదే" అని సువామను కౌఁగిలించుకొనుచుండును. సువామ యామెను అక్కున చేర్చుకొని "అమ్మా! పోనిమ్మా. వాడు వెఱ్ఱివాడయ్యెను" అని చెప్పి యూరడించుచుండెను. కాని క్రమక్రమముగా దానికి గల మూలకారణ మామెకు కొంచెము విశదమయ్యెను.

వివాహ మింక ఐదురోజు లుండగనే దూరదూరమునుండి బంధువులందఱు వచ్చిరి. వాకిలిముందు పెద్ద పందిరి వేసిరి. నేఁడు సువాము, సుశీలయు, మఱికొందఱు కలసి దేవీపూజకై వెళ్లిరి. దాసీలందఱు ఊపిరాడని పనితొందరలం దుండిరి. వ్రజరాణి దిగులుతో చంద్రుని దగ్గరకు పోయి చూడ బల్లపై లాంతరు వెలుగుచుండెను. అతఁడు మంచముపై నిద్రించుచుండెను. వాని వదనమండల మెంతో వాడియుండెను. గదిలోని వస్తువు లన్నియు చిందరవందరగా నుండెను. ఎన్నినెలలనుండియో గదితలుపులు తెఱువకుండినట్లు చెప్పకయే చెప్పుచుండెను. పరిశుభ్రతకై పాటుపడు చంద్రుఁడు నేఁడిట్లు ఉపేక్ష వహించుట కేమి కారణమో? పాపము వ్రజరాణి జాలిపడి పుస్తకములన్నియు నెత్తి యొకటివెంబడి నొకటి భద్రముగా పెట్టెను. మేజాను పయిటచెంగుతో తుడిచి గోడకు వ్రేలాడు పటముల ధూళిని దులుపుచుండెను. ఇంతలో చంద్రుఁడు కొంచెము పొరలి "వ్రజ

రాణీ! నిన్ను మఱువఁజాలను” అని కలువరించెను. కొంచె మాగిన పిదప నాతఁడు మరల “వ్రజరాణీ! ఎక్కడకు పోయెదవు? ఇక్కడనే కూర్చుండుము” అనెను. మఱికొంతతడవున కీవలకు పొరలి “వ్రిజ రాణీ, వ్రిజరాణీ, కూర్చుండవా ? సరే పొమ్ము. నే నిక నీతో మాటలాడను” అనెను. ఒక నిముష మాగినమీఁదట “సరే పొమ్ము, ఎక్కడికి పోయెదవో చూచెదను” అని పాఱిపోవువారిని పట్టుకొను టకు పరుగిడువానివలె ఆతఁడు మంచముపై నుండి దుమికెను. కాని వ్రజరాణిహస్త మాతని హస్తమం దుండెను. వెంటనే యతనికన్నులు తెఱపిడిపడెను. కొంతసేపటివఱకు నిశ్చేష్టితుఁడై తదేకదృష్టితో నామెను చూచుచుండెను. తటాలున ఆమె చేయి వదలి మంచముపై లేచి కూర్చుండి,

“వ్రజరాణీ! నీ వెప్పుడు వచ్చితివి? ఇప్పుడే నిన్ను చూచినటుల నాకు కల వచ్చినది” అనెను.

వ్రజరాణి మాటలాడబోయెను కాని కంఠము స్తంభించెను. కన్నులు మూతవడెను. చంద్రుడు మరల ఆమెను చూచి,

“ఈ పుస్తకములు నీవే చక్కగా అమర్చితివా? నావలన నీ కెంతకష్టము కలిగినది” అనెను.

వ్రజరాణి అప్పటికిని మాటలాడకుండెను.

“ఇప్పటికైన నన్ను మఱచిపోవేమి వ్రజరాణీ!”

వ్రజరాణి కంట తడివెట్టి,

“నీవు నన్ను మఱచిపోతివా ?” అనెను.

చంద్రుడు సిగ్గుతో తల వంచుకొని విచారముతో నుండెను. వ్రజరాణి,

“నీ వేల నాపై అలిగితివి? నీ కేమి అపరాధము చేసితిని ?” అనెను.

"ఏమోకాని ప్రజరాణీ, నాకు నీ ముఖము చూడగనే ఎక్కడి కైన లేచిపోయిన బాగుగా నుండునని తోచుచున్నది."

"రాత్రింబగళ్ళు నేను నీకై యేడ్చి యేడ్చి తపించుచుండ నీ కణు మాత్రమైన దయ కలుగలేదే? కొంచెము నోరు తెఱచి మాటలాడు టకైన ఇష్టపడవే. నీ విట్లుండుటకు నే నేమి చేసితిని?"

"నా కేమియు అలుక లేదు."

"అయితే ఏల మాట్లాడవు?"

"నీ తల్లిదండ్రులు ధనవంతులు. నేను బీదవాడను. కావున మన ఇరువుర తారతమ్యము గమనించి నిన్ను మఱువవలయునని తలచు చున్నాను."

"ఇంతకాలము నన్ను ధనికులబిడ్డగా తలచక ఇప్పుడు తలచుట కేమి కారణము?" అని ప్రజరాణి యేడ్వఁదొడఁగెను. అందువలన చంద్రుని మనసు కరిగి,

"ప్రజరాణీ, మన మిరువురము చాల దినములనుండి కలసి యుంటిమి. కాని నేటితో వియోగము కలుగును. కొద్దిరోజులలోనే నీ విచ్చటివారినందఱను వదలి అత్తవారింటికి పోవుదువేని నన్ను తప్పక మఱచిపోవుదువని తలచి నేనుకూడ నిన్ను మఱచిపోవలయు నని ప్రయత్నించుచుంటిని. కాని ప్రయత్నము చేసినకొలది నీ సంస్మ రణ మంతకంతకు బలపడిపోవుచు నా కశక్యముగా నుండుటచే స్వప్న మందును నిన్నే సందర్శించుచున్నాను" అనెను.

శ్యామాచరణుని గృహము నేడు సమస్త బంధుజనులతో క్రిక్కిరిసి యుండుటవలన ఇంద్రభవనమువలె విరాజిల్లుచున్నది. సేవతి చెలికత్తెలగు రుక్మిణి, సీత, రామాదేవి, చంద్రకుమారి యను నల్వురు సంపూర్ణాలంకృతలై లోపలికి బయటికి 'ఘల్లుఘల్లున' దివ్యకాంతలవలె తిరుగుచుండిరి. శ్యామాచరణుని చెల్లెలగు జానకిదేవి ఇటావా నుండి యిరువురు కుమార్తెలు కమల ఉమాదేవులను వెంటబెట్టుకొని వచ్చెను. కమలకు వివాహమయ్యెను. కాని ఉమాదేవి యింకను చిన్నది. ఇరువురు చక్కదనపు చుక్కలుగా వెలుగుచుండిరి. ఆహా! నేటి సేవతి సౌందర్యమేమని చెప్పవచ్చును ? ఆమె కన్నులు కళకళలాడుచున్నవి. కట్టుకొనిన గులాబిచీరనుండి ప్రతిక్షణము విద్యుత్తేజములు పారాడుచుండ, తెల్లమొఖమలు రవిక మల్లెపువ్వువలె కాంతులీనుచున్నది. అప్పుడే యభ్యంగనస్నాన మొనరించి వచ్చుటచే కాబోలు అతిదీర్ఘములగు నామె నీలకేశములు చిక్కువడి వ్రేలాడుచున్నవి. నవయువతులతో సరసాలాపము లాడుచుండుటచే ఒకింత కురులు చిక్కుతీసుకొనుటకైనను ఆమెకు విరామము లభింపకున్నది. వంటలక్కకూఁతురగు మాధవి పారిజాతపు మొగ్గల లంగాకట్టుకొని, కన్నులకు కాటుకపెట్టుకొని, లోపలికి బయటికి ఏమో పనియున్న దానివలె చీటికి మాటికి వచ్చుచు పోవుచుండెను.

అట్టి సమయమున రుక్మిణి సేవతిసగాంచి "సేవతీ! మీ వదినె ఎక్కడ ఉన్నదే? బొత్తుగా కనుపడనైనలేదు. ఘోషాయేమైన వచ్చినదా?" అనెను.

" గదిలో నిద్రించుచుండవచ్చును. మీరు చూచు చుండగనే

ఆమెను లాగుకొని వత్తును ఉండుడు” అని సేవతి చంద్ర గది లోని కేగెను. చంద్ర మామూలు చీరకట్టుకొని మంచముపై పరుండి వాకిలివైపు తదేక దృష్టితో చూచుచుండెను. సేవతిని చూడ గనే లేచి సరిగా కూర్చుండెను. అప్పుడు సేవతి యామెనుచూచి ఒక్క తవే ఇచ్చట నేలయుంటివి? భయమువేయుటలేదా? రా పోదము” అనెను.

“తాళుదూ నేనింక చీరైన కట్టుకొనలేదు.”

“ఇంతవర కేల కట్టుకొనకుంటివి? అందఱు సిద్ధమై నీ కొఱ కెదురు చూచుచున్నారు, లెమ్ము.”

“నే నిప్పుడే కట్టుకొనను.”

“నీ కేమియు నిది బాగుగాలేదు. పదిమంది విని యేమందురో తెలియునా?”

“ఈరోజుననే వచ్చెదనని ఉత్తరములో వ్రాసియున్నది. నీవు చదువలేదా?”

“సరే. ఇప్పుడు తెలిసినది. ఇదంతయు ముందుగా నేల చెప్పవు?”

“చూడు. రెండుజాములుకూడ దాటినవి. ఇంకను రాలేదు.”

ఇంతలో కమల, ఉమ వచ్చిరి, చంద్ర పైట సవరించుకొని మంచముక్రింద కూర్చుండెను. అప్పుడు కమల “ఇంకను ఈమె చీర కట్టుకొనలేదా?” అనెను.

సేవ—మగడు వచ్చినగాని, రాణివాసములో నుండి ఈమె కదలదట.

కమల—ఆయన కవసరమున్న రాడా? దానికై ఇంత భీష్మించి కూర్చుండు టెందులకు?

సేవతి—ఆ విధమున చీవాట్లు పెట్టినగాని బుద్ధిరాదు. నేనెంతో చెప్పి విసుగెత్తి చివరకు నోరు మూసికొనియుంటిని.

కమల—మగవారిమీద మనకెంత ప్రేమయున్నను దానిని పైకి చెప్పకూడదు. అట్లన్నదైనజరిగిన వారు మనను ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీరు ద్రాగించగలరు. నీవు తరచుగా ఆయనతో మాటలాడక కొంచెము బెట్టుసరిగా ఉంటివేని నీమగడు దాసాను దాసుడై తన ప్రాణములన్నియు నీపై పెట్టుకొని సంచరించును. కాని «నాభార్యకు నాపై ప్రేమకలదు" అనువార్త యెఱిగెనేని ఆ మరుసటి దినమునుండియే ఆతని దృష్టి మాఱిపోయి ఎచ్చటకైన షికారువెళ్లిన చాలసేపువరకు రాకుండును. అన్నము ముందు కూర్చుండి కొంచె మెంగిలిపడి లేచిపోవును. మాటమాటకు మండిపడుచు నీ వేడ్చిన యెడల నిన్ను లేనిపోని మాటలచే నొప్పించుచు ఇతర స్త్రీల రూప స్వభావాదులు బహువిధముల ప్రశంసించి చాల అప్రసన్న చిత్తుడై యుండును. ఇదంతయు స్వానుభవముతోనే చెప్పుచున్నాను. కాని, కల్పితముకాదు. ప్రథమమున నా నాధుడు నాపై ఎంతఆదరముతో నున్నది ఎట్లు చెప్పగలను. ప్రతిక్షణమును సేవకునివలె చేతులు కట్టు కొని నిలువబడియుండును. ఏదేనిపనివలన ఒకింత శ్రమ జెందితినేని విసనకఱ్ఱ పట్టుకొని విసరుటకు సిద్ధపడును. అన్నము కలిపి నానోటి కందించుటకు కూడ వెనుకాడకుండెను. ఇంతేకాదు. చివరకు నా (చిఱునవ్వుతో) పాదములొత్తుటకు కూడ సంకోచించకుండెను. నా నోటనుండి మాటరాకముందే ఆపని సంపూర్తియై కన్నులకు కాన్పిం చుచుండెను. నేనప్పుడు క్రొత్తగా కాపురముపోయి అనుభవము లేని దాన నగుటచే పురుషుల కపట వ్యవహారముల గుర్తింపజాలకుంటిని. నేవతీ! నేచెప్పునది అబద్ధ మనుకో నిజమనుకో. పదిమంది ముత్తైదు వులయెదుట చెప్పుచున్నాను. నే నాయన స్వాధీనురాలనైన రెండవ దినమునుండియే నీకేమి చెప్పుదును. స్వభావమంతయు బొత్తుగా మార్చుకొని షికారు కనుమిషచే ఎచటికో పోవుచు ఒకనాడు చెప్ప

కుండగనే పరారయి పూలదండలతో అత్తరు గుమగుమలతో అర్ధ రాత్రమునకు నాగదిలోనికి వచ్చెను. ఎప్పటివలె చేతులు కట్టుకొని ఆయనసేవకు సంసిద్ధురాలనగుదునని పాపమా అమాయకుడు తలచెను. కాని నేను నిండుముసుగు పెట్టుకొని కుక్కిరి బిక్కిరిలాడక పరుంటిని. రెండవనాడుకూడ మాటలాడక బిగుసుకొని యుండుటచూచి తన తప్పు దిద్దుకొని వచ్చి నాకాళ్లపైబడి యెంతో బ్రతిమాలుకొనెను. అప్పటినుండి ,,పురుషులపై మనప్రేమ వెల్లడింపరాదు'' అను సిద్ధాంతము చేసికొంటిని.

సేవతి——మాయన్నగారి వివాహ మప్పుడు మీ యాయనవచ్చెను. నేను బాగుగా చూచితిని. ఎంతోమంచివాడు. ముఖమెప్పుడు నవ్వుచునే యుండును.

కమల——అప్పుడు మాపార్వతిని కడుపుతో నుండుటచేత నేను రాజాలకుంటిని. ఇక్కడినుండి అక్కడకువచ్చిన తరువాత గోరంతలు కొండంతలుచేసి నిన్నెంతో ప్రశంసింప నారంభించెను. నీ వెప్పుడో ఆయనయొద్దకు తాంబూలమిచ్చుటకు వచ్చితివట. అప్పుడాయన నీ చేయిపట్టుకొని దగ్గఱ కూర్చుండబెట్టుకొని ఏమేమో మాటలాడెనట. నిజమేనా?

సేవతి——ఇదంతయు శుద్ధాబద్ధము. అసలుసంగతి మాదాసీలెవ్వరు సమయమునకు కాన్పింపనందున మాఅమ్మ నన్నుపిలిచి ,,వారు భోజనము చేసిరికాన తాంబూల మిచ్చిరా'' అనెను. నేను తాంబూలము కైకొని వెళ్లగా ఆయన మంచముపై పరుండి నన్ను చూచినతోడనే లేచి కూర్చుండెను. తాంబూలమిచ్చుటకు చేయిచాచిన వెంటనే నా మణికట్టు గట్టిగాపట్టుకొని ,,ఒకమాటవినిపో''అనెను. నేను వెంటనే బలవంతముగా చేయి వదల్చుకొని పరుగిడి వచ్చితిని.

కమల——ఇప్పుడు తేలినదిగదా? చూడుడు. పది పన్నెండేండ్ల

యీడుగల పసికళ్లాలు ఆయనతో ఏమిముచ్చటలాడకలదు? ఒకభ్రమ. పురుషులు చాల ప్రలాపస్వభావులగుటచే "నే నిదియంటిని. అది యంటిని" అని ఏమో, బింకములు కొట్టుచుందురు. నాకిట్టి వట్టి రాచ కార్యములన్న తలనొప్పికలుగును. అన్యాయముగా లేనిపోనిమాటలు చెప్పుచు పొద్దులు పుచ్చుకున్న కలుగు లాభమేమిటి? మగవారు ఎప్పుడేదైన కించిత్కార్యము చేసినయెడల "మేమదిచేసితిమి, ఇది చేసితిమి"అని డాబులు కొట్టుకొనుచుందురు. నేనప్పటినుండియే "ఛీ" అనుకొని ఆయనచెప్పెడి ఒకమాటనైన నమ్మచుండుటలేదు.

ఇంతలో నొకదాసివచ్చి,

"మీరందరిక్కడ కూచుండి మాట్లాడుతుండారుకాని బైట ముత్తైదులందరు సిద్ధంగాఉండి తొందర పడుతుండారు"అన్నది.

సేవతి—చూచితివా వదినా? ఇకనైన ఆలస్యము చేయకు దాసీ! కొంచెము పెట్టెలోనుండి చీరె తీసియిత్తు. ఆమె లేవలేదు.

'ఎవరో యెందుకు' అని కమల చీరెబయటకుతీసి చంద్రను శృంగారింప దొడగెను. సేవతి ముత్తైదువుల యొద్దకరిగెను. వారిలో రుక్మిణి సేవతినిచూచి,

"మంచిదానవమ్మా నీవు. ఇదిగో వచ్చెదనని చెప్పిపోయి ఇంత వఱకు వదినెతో వేళాకోళము లాడుచుంటివా?"అనెను.

సేవతి—నేను వెళ్లగానే నావెంట కమల కూడవచ్చినది. ఇద్దఱు ముగ్గురాడువారు చేరుటచేత ఏదోమాయసోది ప్రారంభమైనది. వారిద్దఱుకలసి కొంచెము సేపటిలోనే వత్తురు.

రుక్మిణి—కమల బిడ్డల తల్లియేనా?

సేవతి—అయ్యో, దానికేమికొదువ. ఒకరికి ముగ్గురు.

రామాదేవి—అన్నిటికి ఏమిగాని, ఆమె కంటె చాల అందముగా ఉన్నది.

చంద్రకుమారి—నీకు కంటె బాగున్న దేమోగాని, నాకు మాత్ర మామె ముక్కు ఎంతో అందముగా ఉన్నది. ఆమె యేమియు ననని యెడల చప్పున లాగుకొందమా అను బుద్ధి పుట్టుచుండును.

సీత—కేవలము ముక్కేమిటి? వారిద్దఱక్క చెల్లెండ్రును ఒకరి కన్న నొకరు దివ్యసుందర విగ్రహములుగా నుందురు.

సేవతి—మనసీతకు మనసువచ్చినమగడు దొరికెను. పూర్వజన్మ మందేమో గౌరమ్మను బంగారముతో పూజించియుండవచ్చును.

రుక్మిణి—(వేళాకోళముగా) ఆయన అతిశయమేమి? కొంచెమెత్తు తోలయినంతమాత్రమున ఒరిగినదా?

సీత—నీకు నల్లనివాడే బాగుగా ఉండునా?

సేవతి—నాభర్తయే నల్లనివాడైన ఇదివఱకే విషము తిని యుండెడిదానను.

రుక్మిణి—ఈ వట్టి బింకము లెన్నయిన చెప్పవచ్చును. కాని వాస్తవమైన సౌఖ్యము నల్లని మగనివల్లనే లభించును.

సీత—సౌఖ్యము కాదు, చట్టుబండలు! అట్టె యమధర్మరాజువలె వచ్చి పైనబడును. ఛీ, నాకిట్టిమాటలవలన శరీరము కాలుకొనిపోవును.

రుక్మిణి—నీకిపుడు చిన్నతనము, కావున ఇంత దుడుకుగా మాట్లాడుచున్నావు. అందగాడు నిరంతరము తనకీకు తాకులే చూచు కొను చుండుననను సంగతి నీకు తెలియదు. ఆతడెప్పుడు తన సంగతే గాని భార్యవైపు కన్నెత్తియైన చూడడు. తనవలె తన భార్యకూడ మంచి సౌందర్యవతియైన కొంచె మిల్లు వాకిలి పట్టించుకొని నాల్గు రోజులు కాపురము చేయును. కాని లేకున్న మరుసటిదినమే గుడిసె మీద దెబ్బదీసిపోవును. ఇంతకు అతని కింత ధైర్య మెక్కడ నుండి వచ్చును? "నేనందగాడను. నాకిది కాకున్న దీనికన్న అందకత్తెలు కోట్లకొలది లభింతురు" అనుగర్వమొందుటవల్లనే కాని నల్లనిమగడో

ఆతనిభార్య చక్కని దయినయెడల ఆమెను వజ్రాల గనిగా చూచుకొనును. తనకు చక్కదనము లేకున్నను భార్య నెన్నిరెట్లో ప్రేమించి తనలోపమును పాపుకొన ప్రయత్నించుచుండును. "నే నించుకైన ఈమెపై కోపించితినేని సాకొంప కూలిపోవును" అని సదా భయము చెందుచుండును. తెలిసినదా! ఇరువుర తారతమ్యము?

చంద్రకుమారి—భార్యనోటినుండి మాట రాకముందే కోరిక నెరవేర్చువాడే నిజమైనభర్త.

రామాదేవి—నీకు నగలపై అభిలాషకలదు. కాన నీ అభిప్రాయమును ఇక్కడ వెలువరచవద్దు. భర్త యెటువంటివాడైననేమి ?

సీత—అబ్బా, ఏదైనవస్తువుకై భార్య తన భర్త కెట్లాజ్ఞాపించునో కాని నాకు తెలియదు. మనసులో కొంచెమైన సంకోచము కలుగదా ?

రుక్మిణి—నీవంటి వెఱ్ఱిబాగుల దాని కన్నియు సంకోచములే. నీముఖమునకు తోడు ఎన్నడైన భర్తతో మనసిచ్చి మాట్లాడితివా ?

సీత—నే నాయనను ఊరక చూచుకొనుచు నే సంతృప్తిని చెందుచుందును కాని, దినదినము క్రొత్తక్రొత్తనగలకై, చీరలకై మారాము చేయుటకు నామన సొప్పదు.

ఇంతలో ఆ పాదమస్తకము సువర్ణభూషణములు ధరించిన యొక సుందరి యచటికి వచ్చెను.

రామాదేవి—రా, మహారాణీ, రా. అందఱు ఉన్నారు. కాని నీ వొక్కతవే తక్కువ.

నూతనముగా వచ్చి ప్రవేశించిన ఆమె పేరు మహారాణి. ఆమె తన నగలవైపు మాటిమాటికి చూచుకొనుచు,

"ఏమి చేయుదును ? వద్దని యెంత చెప్పినను వినక మాదాసి పట్టి బలవంతమున ఈ నగ లన్నియు తగిలించినది. పొరుగింటియామె వచ్చి

తల దువ్వి చుట్టచుట్టినది. చక్కగా ఉన్నదా?'' అని యడిగెను.

సీత—దాని కేమి కాని నీ జాకెట్టు చూచిన ఎంతో ముచ్చటగా ఉన్నది.

మహారాణి—నీ కెక్కడ కనుపడెనే ఇది? దీని చరిత్ర అంతయు చెప్పిన ఒక భారత మగును. గుడ్డకొని మాసముక్రిందట దర్జీవాని కిచ్చితిని. వాడును పది పంద్రెండుసారులు కుట్టుకొని వచ్చెను. ఒకసారి చేతులు పొడవు. ఒకసారి మెడపట్టీ వదులు. మఱియొకసారి అంచు సరిగా ఉండకపోవుట, ఇంకొకసారి చంకలలో బిగువు. నీ కేమి చెప్పుదును; కుట్టినదే ఎన్నోసార్లు కుట్టినందున గుడ్డంతయు కూరాకై పోయినది. వాడు విసిగి ఇప్పుడే నాముఖాన పాఱవేసి పోయినాడు.

ఈవిధమున లోకాభిరామాయణము జరుగుచుండగనే కేకలు వేయుచు మాధవి వచ్చి "రాధాచరణుడు, సేవతి పెనిమిటి యగు ప్రాణనాధుడు వచ్చిరి. భలే భలే" అని చిటికలు వేయ నారంభించెను.

మహారాణి—రాధాచరణుడు వచ్చెనా?

సేవతి—అట్లనా? అట్లయిన ఈసంగతి వదినెతో చెప్పి వచ్చెద. వా రెక్కడ ఉన్నారు?

మాధవి—అదేమి? పెద్దగదిలో మీ యాయన తలగుడ్డ చుట్టుకొని యున్నాడు. రాధాచరణుడు కోటు తొడుగుకొని యున్నాడు. నన్ను చూడగనే చాల డబ్బు లిచ్చిరి—ఇవిగో చూడుడు—అని పిడికిలి తెఱచి చూపెను.

మహారాణి—సేవతీ! నీపంట పండినది. మానోళ్ళు తీయబడ వేయవా?

"నే నేమైన ఒప్పందముకు చేసియుంటినా?" అని పలుకుచు సేవతి చంద్రదయొద్ద కరిగి "ఇదిగో వదినా! నీ శకునము నిజమైనది" అనెను.

చంద్ర—వచ్చెనా ? కొంచె మక్కడకు వెళ్లి లోపలికి పిలుచుకొని వత్తూ.

సేవతి—మగవాండ్ర యొద్ద కెట్లు పోదును? మీ యన్నగారు కూడ వచ్చినారు.

చంద్ర—ఇంకెవరినైన పంపి పిలిపింపవలయును. లేకున్న ఇతరులతో మాట్లాడును.

తటాలున బూడ్సులచప్పుడు వినబడెను. రాధా చరణుడువచ్చి ప్రత్యక్షమాయెను. ఆతఁడు పెద్దవాఁడుకాడు. ఇరువది నాల్గిరువదియైదేఁడులుండును. చాల నవ్వుమొగముతో పచ్చని పసిమిగలిగి క్రాపు జుట్టుతో నుండెను. ఫ్రెంచి కటింగుగడ్డము. నిక్కియున్న మీసములు చాల సొగసుగా నుండెను. సన్ననిపట్టుచొక్కా తొడుగుకొనివచ్చి పందిరి మంచముపై గూర్చుండి సేవతితో, „ఏమే సేవతీ! వారము రోజులనుండి బొత్తుగా ఉత్తరముల వ్రాయుచుండుటలేదే" అనెను.

„మీరు వచ్చుచుందురని ఉత్తరము వ్రాయనైతిని" అని యట నుండి వెళ్లిపోయెను. చంద్రపయిట చెఱఁగు ముఖమున కడ్డముపెట్టుకొని చిఱునగవుతో „ అచటికి వెళ్లి నన్ను మఱచి పోతిరా" అనెను. రాధాచరణుఁడు మందహాసముతో „కావుననే ఎంతో దూరమునుండి పడిపోయినట్లు వచ్చితిని" అని యామెను గాఢాలింగనముచేసికొని ముద్దుపెట్టుకొనెను.

## ౭

వ్రజరాణి వివాహమునకు కొన్నిదినములుముందే చంద్రుఁడు వారి యింటికి రాకపోకలు మానివేసెను. వివాహమునాఁ డేపనిలోను

జోక్యము పుచ్చుకొనక చివరకు పిడికెడు మెతుకులైన తినిరాక మోము ముడుచుకొని యింట కూర్చుండియుండెను. సజీవనలాలు, సుశీల, సుహాసమున్నగువా రెందఱో యనుక్షణము బ్రతిమాలి భంగపడిరి. కాని యతఁ డూరేగింపునైన కన్నెత్తి చూడకుండెను. అందుచే సజీవనలాలు మనసు విరిగి వాని నేమియు ననఁజాలక మిన్నకుండెను. వివాహము సంపూర్తి యగువఱకు చంద్రుఁడీ స్థితియందుండెను. అప్పటినుండి యావంకనైన చూడక బడికి పోవలసినప్పుడు వ్రజరాణి కనుపడిన ఏ దిడ్డిగుమ్మమునుండియో పెద్దపులికి బాటసారివలె, అప్పులవాని కాసామివలె భయపడి పాఱిపోవుచుండెను. వ్రజరాణిపేరు విన్నంతనే యతఁ డదరిపడును. ఒకవేళ బడినుండి యింటికి వచ్చుచున్నపుడు ఇంట వ్రజరాణిని కాంచెనేని బయటివాఁడు బయటనే యదృశ్యుఁడై యెక్కడికో పోవును. ఈసంగతు లన్నియు కాంచి సుహాస "బాబూ! నీవు వ్రజరాణిపై అలిగితివా? దానితో ఎందుకు మాటలాడుచుండుటలేదు? అది యెల్లపుడు నాయొద్దకు వచ్చి 'నేనేమి అపచారము చేసితి'నని ఒక్కమొగి నేడ్చుచున్నది. చూడు నాయనా! మీ రిద్ద రెంతకాలము కలసిమెలసియుంటిరి? వ్రజరాణి యన్న పంచప్రాణము లర్పించెడు నీవు నేడిట్టి విషమావస్థ యేల దెచ్చిపెట్టితివి? పాప మాపసికూన నీ పరిస్థితులు చూచి చిక్కి శల్యమై ప్రాణావశిష్టగా నున్నది. దానియవస్థను చూచినవారికికూడ నెట్టులో ఉన్నది. అహోరాత్రములు దానికి నీ మాటేకాని మఱొకటి లేదు" అని అనేకవిధముల బోధించుచుండెను. చంద్రుఁ డివి యన్నియు అశ్రద్ధతో వినుచు అచ్చటినుండి మెల్లగా తప్పుకొనుచుండెను. ఇప్పు డాతఁడు అశుభముశుభము తెలియని నేదరికాఁడు. అతని జీవనలతికకు యౌవనాంకురములు మొలకలెత్తుచుండెను. బుద్ధి తెలిసిననాట నుండియు వ్రజరాణి జీవితమును తన జీవితములో శర్కరాక్షీరముల

విధమున కలుపుకొనెను. ప్రథమావస్థయందలి మనోహరదృశ్యముల నిపుడు కఠినహృదయముతో మఱువఁదలఁచుట యతనికి దుర్భరము గానే యుండెను. కాని యేమి చేయును ? "తన సర్వస్వము" అని నిరంతరము తలపోయుచున్న ప్రజరాణి నేఁ డెక్కడికో వెళ్లిపోయెను. 'నాది' అని యెన్న డనుకొనని ఒక యపరిచితుని చేతులలో ఆమె చిక్కిపోయెను. అందువలన చంద్రున కెంతో వ్యాకులము కలిగి "చిన్ననాటనుండియు తలచుచున్న నా యీాప్సితము భంగపఱచి నా ఆశల వినాశము కావించిన చెనటుల నా భావనలవలెనే వినాశము కావింతును" అని కోపోద్రిక్తచిత్తుఁ డగుచుండెను. అందఱికన్న సుశీలపై ఆతని కెక్కువ కోపము.

క్రమక్రమముగా అతఁడు పాఠశాలనుండి యింటికి వచ్చినతోడనే కమలాచరణునిగుఱించి యేవో దుర్ఘటనములను క్రూస గ్రుచ్చినట్లు అందఱికి వర్ణించిచెప్ప రంగములో దిగెను. అందు సుశీలవచ్చి కూర్చున్నప్పుడుమాత్రము స్పష్టముగా, ప్రమాణపూర్వకముగా నొక్కి చెప్పదొడగెను. ఆతనికి సుశీల నేడ్పించుటయన్న ఎంతో యానందము. అసత్యముచెప్పు టాతని కిష్టములేకున్నను జరిగిన సంగతినే బల్లెపుపోట్లవలె సుశీలహృదయమును నొప్పించు వాగ్జాలముతో వర్ణించుచుండెను. "నేఁడు కమలాచరణుఁడు తల పైనతగులునటుల పాఠశాలలో బల్లపై నిలువబడినాడు. నేనాతని కాంచి కొంచెము సంకేతము చేయగనే పకపక నవ్వెను. జరిగిన సంగతి మొదటినుండి వినుపించెద. అత డొక పిల్లవాని జేబుగడియారమును నేఁ డపహరించెను. వాడు వెళ్లి తన ఉపాధ్యాయునకు చెప్పగా ఆయన అందఱిని శోధించి కమలాచరణునియొద్దనే గడియారము పట్టుకొనెను. ఆ యుపాధ్యాయు డీసంగతిని ప్రధానోపాధ్యాయునికి తెలియపఱచెను. ఆయన ఈ విషయము విన్నవెంటనే ఆగ్రహావేశపరవశుఁడై బెత్తము

తీసికొని ఫెళ్లుఫెళ్లున వీపంతయు చెండివై చెను. కొట్టునంతవఱకు పాఠశాల ప్రతిధ్వనించులాగున విలపించి వాడు బయటికి వచ్చినతోడనే పకపక నవ్వుచు మీసము వడివేసెను. పిన్నీ, ఇంకను వింటివా? మొన్న పిల్లలందఱు పాఠశాలద్వారముకడనే ఉడుకుదుమ్ముగలో పొర్లించి తన్నితన్ని ప్రాణావశిష్టుని చేసిరి.'' అని చెప్పెను.

సుశీల సంగతిసందర్భములువిని లోలోపల విసుగుకొనుచు చింతిలుచుండెను. ప్రజరాణి వచ్చినపుడుమాత్రము చంద్రుఁడా ముచ్చటలు చెప్పక ఆమె యచ్చటినుండి పోవునంతవఱకు మెదలక ఉండుచుండెను.

అప్పుడప్పుడు సజీవనలాలుకూడ చంద్రుఁడు చెప్పు విషయములు విని "నిజమే'' అని యొప్పుకొనుచుండెను.

కమలాచరణుఁడు పాఠశాల కేగుట మాని మైదానముమీఁద సహచరులతో పావురముల నెగురవేయుచునో, పోకిరిగుంపుతో కలసి చుట్టలు బీడీలు తగులవేయుచునో నోటినిండ తాంబూలము వేసి వికృతవేషభాషలతో చరించుచుండగనో పలుసారు లాతఁడు చూచి యుండెను. సజీవనలా లిది చూచినవెంటనే యింటికి వచ్చి మండిపడి "ఇల్లువాకిలి ఉన్నవాడు, పిల్లవాఁడు బుద్ధిమంతుడని యెన్నో చెప్పి నీవే నాకిట్టి అప్రతిష్ఠ తెచ్చిపెట్టితివి'' అని భార్యను చీవాట్లు పెట్టుచుండును. ఈ వివాహసంబంధమున సుశీలపై ఎంతభార మున్నదో తనపైకూడ నంతభార మున్నదనుసంగతి యాయన బొత్తుగా మఱచి పోయెను. పాపము, పిడికెడు తిని వంటయింటిలో కూర్చుండు అబలకు వరుఁ డిట్టివాఁడైనసంగతి ఎట్లు తెలియును? ఆమె యేమైన జ్యోతిషము నేర్చినదా? తల్లిదండ్రులు గౌరవార్హులు, పిల్లవాఁడును వారి ననుకరించుచుండు ననుకొనెను. కాని సజీవనలాలే బద్ధకించి యచటికి వెళ్లి పిల్లవాని సంగతిసందర్భములు బాగుగా విచారించియుండలేదు.

ఇప్పటికిని భారతవర్షమునందు పిల్లవాని తెలివితేటలు పాటింపక కేవలము ధనధాన్యములనే చూచి సంబంధముచేయు అమాయకు లెందఱో కలరు.

సుశీలకు వ్రజరాణికన్న ప్రియతరమైన వస్తువు వేఱొద్దియు లేదు. ఆమె కొమార్తెనే తన ప్రాణముగా భావించుచుండెను. చిన్ననాఁటి నుండియు మా వ్రజరాణి ఇంత సిరిగలవారింటి కోడలు కావలయు ననియు, దేవతలవంటి అత్తమామలు కలిగి శ్రీరామచంద్రునివంటి సద్గుణసంజాతుఁడగు వరుఁడు లభింపవలయుననియు సుశీల కోరుకొను చుండెను. ఎన్నో అవస్థలు పడి యిట్టి సుకుమారి యగు బాలికను కాంచుటచే ఏవిధమగు సంసారబాధలు కలుగకుండులాగున ఆమె ముక్కోటిదేవతలకు మ్రొక్కుకొనుచుండెను. ముద్దుముద్దుమాటలు చెప్పి హృదయమున కపరిమితానంద మొడఁగూర్చు ఈ బాలికను భర్తృసహితముగా జీవితకాల మంతయు తనయొద్దనే యుంచుకొన వలయుననియు, వారికి బిడ్డలు పుట్టిన పురుఁడుపోసి పెంచెడి ముద్దు ముచ్చటలు తీర్చుకొనవలయుననియు, అల్లుఁడు తనను "అత్తా!" అని పిలుచుచుండ ఆతనిని పుత్రునిగా భావించి యుప్పొంగవలయుననియు గాఢముగా తలపోయుచుండ నేఁడిట్టి భీభత్ససంఘటనలు చంద్రుని నోటినుండి వినుచున్నందున ఆమె హృదయము మహావ్యథ నొందెను.

ఆమె యనుకొనిన దేమి? అయిన దేమి? "ఇప్పటి కేమియు మించిపోలేదు. వ్రజరాణి పెద్దదై అత్తవారింటికి వెళ్ళి కాపురము చేయుచున్న అల్లుడు తనంతట తానే దుష్కృత్యములు మానుకొనును" అని మనసునకు ధైర్యము చెప్పుకొనుచుండెను. కాని యేదియో యొక నిందయైనచో కొంచెము ధైర్యము చెప్పుకొని దుఃఖము దిగ మ్రింగవచ్చును కాని, యొకటి కాదు, రెండు కావు; దినమున కెన్నో యిట్టి దుండగములు అల్లుని గూర్చి వినవచ్చుచుండెను. "అయ్యో!

వ్రజరాణి లలాటమందు విధాత యెట్టి దుష్ఫలమును లిఖించి యుం డెనో? రూపగుణరాశియై, నాయింటి దీపముగా వెలుగుచున్న వ్రజ రాణి క్రూరస్వభావుడై దినదినము పలువురచే చివాట్లు, చెప్పుదెబ్బలు తినువానితో కాపుర మేవిధమున చేయునా” యని జాములకొలంది నిలువంబడియే యామె విలపించుచుండెను. మొదట మొదట సుశీల వ్రజరాణిని కొంచెము కసరుచుండెడిది. కాని యిపు డేమియు అనుట లేదు. కూంతురి ముఖము చూడగనే యామె కెక్కుడలేని జాలి పొంగి వచ్చుచుండెను. తన యెదుటినుండి కదలనీయక, యెన్నండైన వ్రజరాణి సువామగా రింటి కేగినచో వెంబడినే పోయి యామె నెవ్వరైన బలా త్కారముగా నెత్తుకొనిపోవుదురేమో యని చింత చెందినవిధమున స్వయముగా వచ్చి వెంటబెట్టుకొని తన యింటికి పోవుచుండెను. కటిక వాని కత్తిక్రింద పడియున్న తన దూడను గాంచి “అంబా” యని యార్తనాదము చేయు గోవువలె వ్రజరాణి వదనమండలమును గాం చిన వెంటనే సుశీల నిశ్చేష్టితయై సమస్త ప్రపంచమునకు ప్రళయము వాటిల్లినటు లెంచుచుండెను. క్షణకాలము వ్రజరాణి బయటకు పోయిన గూటినుండి పిల్లలను కోల్పోయిన పక్షివలె సుశీల యెంతో వ్యాకులపడుచుండెను.

సుశీల యిట్టి విపరీతసంఘటనలచే కూంతురి భవిష్యద్వృత్తాంత మును తలపోసి దుస్సహ దుఃఖావేశముచే వెతనొందుచున్న కారణ మున శరీరము చాల కృశించెను. దినదినము బయలుదేఱు నూతన నింద లన్నియు ఆమె హృదయమును చించి జల్లెడచేసివైచెను. అట్టి స్థితిలో ఆఱుమాసములు కాకముందే యామెకు క్షయరోగచిహ్న ములు కాన్పించెను. మొట్టమొదట నామె చాల సాహసించి హృదయ వేదనను బయలుపఱచక దాచుచు వచ్చెను, కాని యెంతకాల మట్లు చేయగలదు? రోగము వృద్ధియగుచుండుటచే శరీరము క్షీణించుచుం

డెను. మంచములో నుండి బొత్తుగా లేవలేని యవస్థ సంప్రాప్తించెను. ఎందఱో వైద్యులు, డాక్టరులు చికిత్స చేయుచుండిరి. ప్రజరాణి, సువాసు ఇరువురు పక్కలో కూర్చుండి సపర్యలు చేయుచుండిరి. ప్రజ రాణి యథాశక్తిని ఆమె కన్నులకు చాటుగాక యెదుట మెలఁగు చుండెను. కాని యెప్పుడైన యొక క్షణము కనుబడకున్న నిరాశచే సుశీల వెక్కి వెక్కి యేడ్చుచుండెను. సజీవనలాలు ప్రథమమున చాల ధైర్యముతో మందుమాఁకు లిప్పించెను, కాని యెంత చేసినను ప్రయత్న మంతయు విఫలమై రోజురోజు రోగ మభివృద్ధి చెందు చుండుట కాంచి నిరాశచెంది లాభము లేదని యుత్సాహముతో చికిత్స చేయింపకుండెను. అదివఱకు చాలకాలముక్రిందట సువాసు మంచము పట్టినపుడు సుశీల యామె కండగా నిలిచి యెంతో సేవ చేసెను. ఇప్పుడు సువాసు వచ్చి యామె మంచమునొద్ద కాచుకొని యుండి సకలోపచారములు చేయుచుండెను. ఇరుగుపొరుగువారితో చాల కలసి మెలసి యుండెడి దగుటచేతను, విశేషించి సుశీల తన యాప్తురా లగుటచేతను సువాసు యామె సేవలందు నిమగ్నచిత్తయై గృహకృత్యములు కూడ మఱచిపోవుచుండెను. ఒక్కొక్కనాఁడు చంద్రునితో నింత మాటలాడుటకు కూడ అవకాశము చిక్కుటలేదు. వాఁడును అన్నము కూడ తినక యట్లే బడికి పోవుచుండెను. కాని నోరుతెఱచి "అదేమని" తల్లి నడిగినవాఁడు కాఁడు. సుశీల నేఁ డిట్టి వ్యాధిపీడితురాలై యున్నందున వాని కోపము కొంచె ముపశమిం చెను. అయ్యది వైద్యుల యాౌన్నత్యముతో బాటు అభివృద్ధి నొందుచు వారి క్షీణతతో క్షీణించిపోవును.

ఎన్నఁడైన చంద్రుఁడు భోజనము చేయకయే పాఠశాల కరుగు చున్నాఁడను వార్త విన్నయెడల, వెనువెంటనే ప్రజరాణి తన పనులు వదలి యతనికడకు పోయి, భోజనము చేయుట కెంతో బలవంత

పెట్టును. కాని యతఁడు వినుపించుకొనక యొక పలుకైన పలుకక, యామె యేడ్చుచుండినను అట్లే వదలి వెలుపలికి వెళ్ళిపోవుచుండెను. ప్రజరాణి విషయమున నిర్దోషి యని నిస్సంశయముగా నతఁ డెంచును కాని మైదాలుమాసములలో నెటులైన ఆమె తన యత్తవారింటి కేగును గదా; అప్పుడు తన బాంధవ్యమును త్రెంపుకొనుటకు తప్పక ప్రయత్నించి తీరవలయును. ముం దెన్నఁడో చేయవలసినదాని నిప్పటి నుండియే చేయుచుండిన ఉత్తమముగా నుండునని యతఁడు భావించు చుండెను. అతఁ డేకాంతమున కూర్చుండి తాను కావించిన ప్రేమా ఘాతములకు వెక్కి వెక్కి యేడ్చుచుండెను. కాని హృదయములో పాదుకొని యున్న ప్రేమోద్వేగమును బయలుపఱచుటలేదు.

ఒకనాఁ డాతఁడు పాఠశాలనుండి యింటికి వచ్చి గదిలో కూర్చుండి యుండ ప్రజరాణి వచ్చి నిలువఁబడెను. సంతతధారగా స్రవించు బాష్పజలముచే అద్దములవంటి యామె స్నిగ్ధకపోలములు మలినమై యుండ ఆమె వెక్కి వెక్కి యేడ్చుచుండెను. నిరాశాపూరితమగు నామె దృష్టిని కాంచి జాలిగొని చంద్రుఁడు "ప్రజరాణీ! ఏల యేడ్చు చున్నావు?" అనెను. ప్రజరాణి ప్రత్యుత్తర మేమియు నీయక యింకను బిగ్గరగా ఏడ్చుచుండ చంద్రుని గాంభీర్య మంతయు మటుమాయ మయ్యెను. అతఁడు నిస్సంశయుఁడై లేచి ప్రజరాణి కన్నులనుండి ప్రవ హించెడు అశ్రుబిందువులు తన జేబురుమాలతో తుడువ జొచ్చెను. ప్రజరాణి స్వరము మార్చుకొని "చంద్రుడూ; ఇక అమ్మ బ్రతుకదు; నే నేమి చేయుదును?" అని చెప్పుచు బావురుమని యేడ్చెను.

చంద్రుఁడీవార్త వినినవెంటనే స్తబ్ధుడై కొంతవఱకు నిలువఁబడి, పిదప వేగముతో ప్రజరాణియింటి కేగి సుశీల మంచమునకు సమీపమున నిలువబడి యేడువనారంభించెను. వేళ్ళు పాదుకొని క్రోధదర్ప మెంత ఘనీభవించినను వారిని తమ ప్రతిద్వంద్వులతో కలుపుట కి

యవసానకాలమే యద్భుత శక్తిసమన్వితమైనది. ఎందఱో బలాఢ్యులగు శాత్రవు లప్పుడే లొంగిపోవుదురు. ఏ శస్త్రముచే లొంగకున్నను క్షీణమై పుల్లవలె పడియున్న శరీరమే వారిని లొంగతీయును. సంవత్సరమునుండి యింటివైపు చూడని చంద్రుఁడు నేఁడు రోగియొద్ద కార్ద్రహృదయముతోఁ జేరెను. సుశీల నేత్రములు ముకుళించినను ముఖమండలము ప్రభాతకమలము వలె దివ్యకాంతిసమన్వితమై యుండెను. నేటి ప్రాతఃకాలమునుండియు సుశీల "నా కన్నులకు బాబును చూపింపుఁడు" అని యొకేవిధమున పట్టుపట్టియుండుటచే సువాము వానిని పిలుచుటకై వ్రజరాణిని పంపెను. సువాము సుశీలను పిలిచి "ఇదుగో, బాబు వచ్చినాడు చూడుము" అనెను. సుశీల కన్నులు తెఱచి గాఢానురాగముతో చేతులు చాచెను. అదివఱకెచ్చటనో దాగియున్న స్వల్పవైషమ్యముకూడ ఇప్పుడు చంద్రుని హృదయమునుండి తిరోభూత మయ్యెను. అట్టి యాపత్సమయమందు ఎవ్వడైన తన మత్సరము సాధింప పట్టుపట్టెనేని వా డెంతమాత్రము మానవుఁడని చెప్పుటకు యోగ్యుఁడు కాఁడు. చంద్రుఁడు దగ్గఱకు పోవ, కన్న కొడుకునువలె సుశీల యనురాగముతో కౌఁగిలించుకొనెను. చాలతడ వట్లులే యుండి యేడ్చుచుండిరి. అతఁడు తప్పించుకొనిపోవునేమో యని భయము చెందినట్లు ఆమె గట్టిగా పట్టుకొనెను. "అయ్యో! ఇట్టి దుష్పరిణామ మంతకును కారణము నేనే కదా" అని చంద్రుఁడు తనను తాను బహువిధముల నిందించుకొనెను. సుశీల కోమలహృదయమునకు వ్యథ కల్పింప అల్లుని దుర్గుణము లన్నియు వర్ణించి చెప్పి నా మానసమున రగుల్కొనుచున్న ద్వేషానలమును వెలిగ్రక్కి నేటి కీమె ప్రాణాపహారిగా పరిణమించితినే" యని చంద్రుఁడు దిగులొందుచుండ కన్నులనుండి యశ్రువులు బొట బొట భూమిపై పడుచుండెను. అప్పుడు సుశీల మెల్లఁగా "బాబూ! నే నిం

నొక్కటి రెండురోజులకన్న ఎక్కువ బ్రదుకను. నావలన ఏ యపచార మైన అయినయెడల క్షమింపుము!'' అని పలికెను. చంద్రుడు కంఠము రుద్ధమై స్వాధీనము తప్పుటచే నిరుత్తరుం డయ్యెను.

సుశీల మరల "నాయనా! నాపై నీ కింత అలుక ఏల కలిగెనోయి? నీవు మాయింటికి రావు. మమ్ము చూచి మాటలాడవు. మేము నీకొఱకు కలువరించి కలువరించి నిరాశచే కూలిపోవుచుంటిమి. నీవణు మాత్రము మాజోలి పట్టించుకొనవు. చెప్పు బాబూ! చెప్పు; రోగ గ్రస్తురాలగు ఈ పాపాత్మురాలివలన నీ కేమి బాధ కలిగెను? నా కడుపున పుట్టిన బిడ్డవలె భావించి నిన్ను చూచినతోడనే ఉప్పొంగి సంతసించుచుంటిని. ఇదంతయు నేను చెప్పనేల? సకల మీశ్వరునకే తెలియును'' అని పలుకుచుండగనే దార్బల్యకారణమున ఆమె మాట తడబడెను.

౬

మూడుదినములు కడచిన తరువాత సుశీల విషయమై యందఱు ఆశలు వదలుకొనిరి. ఆ మూడుదినములు సజీవనలాలామె మంచము దిగక పలువిధముల ధైర్యము చెప్పుచుండెను. ఏదియైన పనిమీద నతఁడు క్షణమాత్రము మంచము విడిచినచో ఆమె యెంతో వ్యాకుల తతో నేడ్చుచు "అయ్యో! నన్ను వదలి యెచ్చటికో పోయిరి'' అని కేకలు వేయును. చూపులతోనే తృప్తిచెందక గుబులువలన నుండి యుండి ఆయన చేయి పట్టుకొని నిరాశతో యామె "నన్ను వదలి యెచ్చటికిని పోరుకదా'' అనును. సజీవనలాలు చాల దృఢచిత్తు డయ్యు నను పత్నిప్రేమకు దిగులొంది కన్నులవెంట నశ్రులు రాల్చును. అప్పు

డప్పుడు సుశీలకు మూర్ఛ వచ్చుచుండును. తెలివి వచ్చినతోడనే యులికిపడి భీతచిత్తయై "అదిగో ఎచ్చటికో పోయిరి" అని యఱచును. సజీవనలాలక్కడనుండి గద్గదస్వరముతో "నే నిక్కడనే యున్నాను" అని చెప్పినను మూర్ఛాధిక్యతవలన నిదంతయు నామె చిత్తమునకు నాటకుండెను. ఆమె యెదుట భర్తను చూచుచుండియు నమ్మజాలక 'ఇక్కడనుండి ఎక్కడికో పోయిరి; అయ్యో! అయ్యో!' అని పలవించును. కొంచెముసేపటికి మూర్ఛ తెలిసినతోడనే మెదలకుండి తరువాత ఏడ్వ నారంభించును. మూడురోజులును ఆమెచుట్టు వ్రజరాణి, సువామ, చంద్రుడు కాచుకొనియున్నను వారిలో నొక్కరినైన సుశీల పేర్కొనక తన భర్తనే మాటిమాటికి స్మరించుచుండెను. వ్రజరాణి తల్లిని కౌగిలించుకొని విలపింప ఆమె కొంచెము కన్నులు తెఱచి "ఎవరు? వ్రజరాణివా?" అనును, కాని మఱేమియు ననకుండును. లోభి తాను సేకరించి పాతివేసిన ధనవిషయమును అంత్యకాలమున స్మరించులాగున పతివ్రతయగు హిందూ స్త్రీ తన మరణసమయమున పతినే స్మరించును.

అప్పుడప్పుడు సుశీల యులికిపడుచు విస్మితయై "ఎవరో నిలువబడి వాగు. ఆ పాఱిపోవుచున్న దెవరు? ఉండు ఏల తీసుకపోయెదవు? నేను పోనివ్వను" అని కేకలు వేయుచు భర్త చేతులు గట్టిగా పట్టుకొనును. మూర్ఛ తెలిసినవెంటనే లజ్జితయై "ఎవరో వచ్చి, మిమ్ము తీసికొని పోవుచున్నట్లు కలగంటిని. చూడుడు, నాతోడు మీ రిక్కడనుండి ఎక్కడికి కదలవద్దు. కదలితిరేని ఎవ్వరైన మిమ్ము తీసికొని వెళ్లుదురు. మరల మీ రెట్లు నాకు లభింతురు?" అని ప్రలాపించుచుండెను. సజీవనలాలు హృదయము కరిగి నీరైపోవుచుండ ఆమెవైపు జూచుచు జాలితో "నిన్ను విడిచి నే నెక్కడికి వెళ్లను" అని పలుకును. సువామ యీ చర్య యంతయు గమనించి "ఇక నీయింటి దీప మారిపోవును"

అని దుఃఖించుచుండెను. రోగబలముచే సుశీల లజ్జాభయము వదలి ప్రాణేశ్వరుని సమ్ముఖమున అట్టె నోరు తెఱచియుండును.

నాల్గవదినమున సుశీలకు కొంత స్వస్థత చిక్కెను. అదియే యవసాన మని సజీవనలాలు తలంచెను. దీప మారిపోవు సమయ మాసన్నమగునపుడు గప్పున మండునట్లు ప్రాతఃకాలమున నాతఁడు కాల్యకృత్యములు తీర్చుకొని యింటిలోనికి వచ్చుటతోడనే సుశీల చేసన్నతో భర్తను దగ్గఱకు పిలిచి "మీచేతులమీదుగా నానోట నీరుపోయుడు" అనెను. నేఁడు ఒడలు తెలిసి స్వగృహాలో నున్నందున సుశీల ప్రజరాణిని సువామను బాగుగా గుర్తించెను. చాలసేపు ఆమె ప్రజరాణిని కౌఁగిలించుకొని దాహము త్రాగి సువామతో "అమ్మా! కొంచెము నన్ను లేవతీసి కూర్చుండబెట్టుము. వారి పాదము లంటవలయును. ఇక నీజన్మమున కిట్టి సౌభాగ్యము కలుగునో లేదో ఎవ్వ రెరుగుదురు!" అనెను. సువామ కన్నీటితో సుశీలను లేవదీసి కూర్చుండబెట్టెను. చంద్రుఁడు ప్రజరాణి ఇరువురు నెదుటనే నిలిచియుండిరి. సుశీల సజీవనలాలుతో "నాదగ్గఱకు రండు" అనెను. సజీవనలాలు హృదయభారముతో ఆమెను కౌఁగిలించుకొని గద్గదస్వరమున "భయపడకుము. దైవానుగ్రహ మున్న జబ్బు నెమ్మదించును" అనెను. సుశీల నిరాశతో "నేను నయమగును. కాని కొంచెము మీపాదములు చాచుడు. శిర ముంచెదను" అనెను. సజీవనలాలు వెనుకాడుచుండ సువామ యేడ్చుచు "కాళ్లు చాపుడు. ఆ కోర్కెనైన తీర్చుకొనును" అని పలికెను. సజీవనలాలు కాళ్లు చాపగా సుశీల చేతులతో పట్టుకొని పలుమాఱు ముద్దుపెట్టుకొని వానిపై చేతు లుంచి యేడ్వ నారంభించెను. నిముషమాత్రముననే వేఁడికన్నీటితో ఆయన పాదములు తడిసిపోయెను. పతివ్రతయగు నా రమణీలలామ ముత్యములవంటి యశ్రుబిందువులతో పతికి కాళ్ళు కడిగెను. తరువాత

నామె కొంచెము గొంతు సవరించుకొని కుమార్తెచేయి తండ్రిచేతిలోఁ బెట్టి "నాథా! ఇన్నాళ్ళు మీతో సుఖముగా కాపురము చేసితిని. నేటితో ఋణము తీరిపోయినది. ఇప్పుడో ఇంకొక క్షణమునకో ప్రపంచమును వదలి పోవుటకు సిద్ధముగా ఉన్నాను. ఇదిగో ఈ వ్రజ రాణిని మీకు సమర్పించుచున్నాను. మీ కీమె తప్ప నికెవ్వరు 'నా' అనువారు లేరుకదా? దీనిని కనిపెట్టి యుండుడు. భర్తతో కాపురము చేయుచుండగా చూచు సౌభాగ్యము నా నొసట వ్రాసియుండలేదు. దీని నెన్నఁడును నేను పల్లెత్తుమాటైన అనలేదు. కఠినముగా చూడ లేదు. మీ రీమెను ఆదరముతో చూడుడు." అని చెప్పుచుండగనే ఆయాసము కొంచెము తగ్గెను. మూర్ఛ వచ్చిన ట్లుండెను.

అవకాశము దొరికినప్పు డెల్ల సువాసకు చేతులు జోడించి యేడ్చుచు "అక్కా! వ్రజరాణి నీది. నీవే ఆమెకు తల్లివి." "తండ్రీ, బాబూ, చంద్రుఁడూ! దైవానుగ్రహమున నీవు చిరంజీవి వగుదువు గాక. తల్లిలేని ఈ బిడ్డను నీ తోడబుట్టినదానినిగా చూచుకొనుము. దాని ప్రాణము లన్నియు నీమీదనే పెట్టుకొని ఉన్నది. ఎన్నడు దాని నేడ్పించవద్దు. అసహ్యించుకొనవద్దు. దానిపై నలిగి ఉపేక్షించి యుంటివేని చంద్రుడూ! ప్రతాపచంద్రుడూ! అది నీకై ప్రాణములు వదలును. దానికెన్ని అవస్థలు వ్రాసిపెట్టి యున్నను నీవుమాత్రము కోపగింపక తోబుట్టువుగా భావింపుచు కొంచెమప్పుడప్పుడు ధైర్యము చెప్పుచుండుము. ఇదిగో, నే నింకొక ఘడియకే ప్రాణము వదిలెదను. నాతోడు నీవు వ్రజరాణిని ఉపేక్షించవద్దు. నీవే దాని కష్టసాగరమున నావవై దరిజేర్పుము. నీమీద నాకెన్నియో ఆశలుండెను. నీపెండ్లి పీటలమీద కూర్చుండి నీకు పుట్టెడు బిడ్డల కుగ్గుబోసి పెంచి ఆలించి పాలించవలయునని యుండెను. కాని చంద్రుడూ! నేనేమి చేయుదును! బ్రహ్మదేవుడు నానొసట నింకొక విధముగా వ్రాసినాడు" అని ఏడ్చు

చుండగనే యామెకు మైకము క్రమ్మెను. ఇల్లంతయు రోదనధ్వనితో నిండిపోయెను. వంటకత్తెలు, దాస దాసీజనులందఱును "ఈమె దేవత" యని పలువిధములు ప్రశంసించుచు కన్నుల నీరిడుచుండిరి. వారిలో రాధికయను దాసి "అయ్యో ఇన్నాళ్లనుంచి చాకిరి చేస్తూన్నా, ఒక నాడు కాకపోతే ఒకనాడైనా పల్లెత్తు మాటైనా అనలేదు" అనెను. వంటకత్తె "అయ్యో! నే నేమని చెప్పుకొని యేడ్తును! వంట ఎంత పాడుగా ఉన్నా కోపగింపక కడుపునకన్న బిడ్డవలె ఆదరించుచుండేది. సాధారణముగా మాటలాడుచున్నను ఎంతో నవ్వుచుండును. డబ్బుం తయు నెల యగుటతోడనే భర్తతో చెప్పి ఇప్పించుచుండును" అనెను.

అందఱు ఈరీతిని చెప్పుకొను చుండగనే మధ్యాహ్న మయ్యెను. వంటమనిషి భోజనము సిద్ధపఱచెను. కాని తినువా రెవరు? ఎంతో బలవంతముమీద సజీవనలాలు ప్రాణాహుతులు వేసికొని వచ్చెను. చంద్రుఁడు వంటయింటివైపు చూడనైన లేదు. ప్రజరాణికి సువాసును ఆకలిదప్పిక లడగియే పోయెను. సుశీల యప్పు డప్పుడు ప్రజరాణిని బుజ్జగించుచు సువాసును గాఢాలింగనము చేయుచు చంద్రుని మాటి మాటికి ముద్దుబెట్టుకొనుచు గడచిననాటి ముచ్చటలు జ్ఞాపకమును తెచ్చుకొని బహువిధముల ఏడ్చుచుండెను. సాయంకాలమునకు దాస దాసీలను పిలిచి "నేను మిమ్ములను కఠినమైన మాటలన్న యెడల వానిని మఱచిపొండు" అని వేడుకొనెను. అంత అక్కడనుండి కదల గనే సుశీల సువాసుతో "అక్కా! చాల దాహమగుచున్నది. కొంచెము నీళ్లచుక్కలు గొంతులో పోయుడని వారితో చెప్పుము" అనెను. సజీవనలాలు నీరు తెచ్చెను. నీరు మ్రింగుడు పడకున్నను ఎంతో కష్టమున ఎవరో అమృతము తెచ్చి త్రాగుమని చెప్పినట్లు భావించి యొకగ్రుక్క మింగెను. అప్పుడామె ముఖము వికసించెను. కన్నులు

గిఱ్ఱున నీరు తిరిగి పోయెను. మెల్లఁగా భర్తమెడపై చేయివేసి "నేను మీచేతులలో ప్రాణము వదలుచున్నాను—ఎంత యదృష్టవంతురాలను!" అని మెదలకుండెను. ఇంక నేమో చెప్ప నుద్యుక్తురాలయ్యెను కాని సంకోచముచే విరమించినట్లు కాన్పించెను. కొంచెము తాళిన మీదట మరల భర్తచేయి పట్టుకొని "మిమ్మేదైన కోరిన తీర్తురు గదా" అనెను. సజీవనలా లాశ్చర్యపడి "నీకేమి కావలయునో సంశయము విడచి అడుగుము" అనెను.

సుశీల—నామాట త్రోసివేయరు కదా?

"గొంతులో ఊపిరియుండగా త్రోసి వెయ్యను."

"త్రోసివేతురేమో యను భయము వేయుచున్న దే"

"అయ్యో! నీమాట నే త్రోసివేయుదునా? చెప్పు భయములేదు"

"మిమ్ము విడువనులే,—ఇదుగో నేను—పోయిన—వ్రజరాణిని—మఱచి—పోయెదరా?"

"ఇట్టిమాట లనవద్దు. అదుగో వ్రజరాణి ఎట్లేడ్చుచున్నదో చూడు."

"అట్లనా? అటులయిన నన్ను మఱువరు కదా"

"ఎన్నటికిని మఱచిపోను"

సుశీల ఎండిపోయిన చెక్కిళ్లు భర్త పెదవుల కందించి రెండుచేతులు మెడకు పెనవేసెను. మరల వ్రజరాణిని తనయొద్దకు తీసికొని మెల్ల మెల్లగా "అమ్మా! వ్రజరాణీ! నాన్నగారిమాట మీరక ప్రతిక్షణము వారిసేవ చేయుచుండుము. తల్లీ! ఇక నీయింటి భారమంతయు నీపైన పడినది. ఎట్లు నిర్వహింతువో అని దీనముగా భర్తవైపు చూచి "అయ్యో! నాకోర్కె తెలియజేయక ముందే ప్రాణము పోవుచున్న దే" అనెను.

"నీవు వ్యర్థముగా వ్యథపడుచున్నావు అడుగుము ఆలస్యమెందుకు?"

"మీరు నావారే కదా?"

"బ్రతికిననాళ్లు నీవాడనే"

"నన్ను మఱచినా ప్రధానవస్తువు ఇంకొకరి చేతిలో పడిపోవకుండు కాక."

"అతఁడాభావము గ్రహించి ఈసంగతి యేల ఎత్త వలయును? బ్రతుకు నంతవఱకు నేను నీవాడనే కాని యన్యుఁడను కాను" అనెను.

సుశీల సుధామను పిలచి మరల కౌఁగలించుకొన బోయెను. కాని మూర్ఛచే పడిపోయెను. వ్రజరాణి చంద్రుఁడును ఏడువసాగిరి. సజీవన లాలు గడగడ వణకుచు సుశీల గుండెలపై చేయి యుంచెను. శ్వాస నిమ్మళముగా ఆగిపోవుచుండుట చూచి వంటమనిషిని పిలిచి "ఇక నీమెను భూశయనము చేయవలయును" అని పెద్దగా ఏడ్వఁ జొచ్చెను. సుధామ వంటమనిషి కలసి సుశీలను భూశయనము చేసిరి.

చీఁకటి పడెను. ఇంటిలో నందఱు పెద్ద పెట్టున ఏడువదొడఁగిరి. పూశయ్యలపై పవళించిన శరీరమిపుడు కటికనేలపై మొద్దువలె పడి యుండెను. ఇంకను చేతిలో నాడి కొంచె మాడుచుండెను. సజీవన లాలు పుట్టెడు దుఃఖముతో తలకడ కూర్చుండెను. ఆకస్మికముగా నామె లేచి భర్తపాదములు పట్టుకొన ప్రాణము లెగిరిపోయెను! కాని చేతులట్టులే భర్త పాదములను పెనగొని యుండెను. వంటమనిషి ఇంటిలోనుండి దీపము తీసికొని వచ్చెను. కాని యంతకు ముందే సుశీల జీవనజ్యోతి యస్తమించెను.

V. good Book

This part is very wonderfull part

రాధాచరణుఁడు కాలేజి వదలినతరువాత మురాదాబాదులో ఇంజ
నీరుపనిలో ప్రవేశించెను. చంద్రకూడ కాశీనగరమువదలి భర్తదగ్గ
ఱకు వెళ్లిపోయెను. ప్రేమవతి కోడలిని పోనీయక ఆపుట కెంతో
ప్రయత్నించెను. కాని పోవఁదలచినవారి నాపు టెవరికిసాధ్యము ?
సేవతి మొదటనే యత్తవారిల్లు చేరెను. ఇంటిలో ప్రేమవతితప్ప
నింకెవ్వరు లేకుండుటచే పని యంతయు ఆమె నెత్తిపై బడెను.
ఒక్కతెయే యగచాట్లు పడలేక కోడలగు వ్రజరాణిని పంపవలయు
నని కబురంపిన బాగుగా నుండుగదా యని తలఁచెను. కాని యీ
విషయమున శ్యామాచరణున కిష్టము లేకున్నను, ఇంటిలో తన పెత్త
నము సాగకుండుటచే మౌనము వహించియుండెను.

కబురు వచ్చుటతోడనే సజీవనలాలు తన అంగీకారమును తెలియ
పఱచెను. "ఎటులైన సంసారబంధముల త్రోసిపుచ్చి తీర్థయాత్రలచే
కృతార్థుఁడు కావలయునని యతఁడు తలపోయుచుండెను. గృహకృత్య
ములు క్రమముగా తగ్గించుకొనుచు, దినమంతయు నింటిలో ఆసనము
వేసికొని భగవద్గీత, యోగవాశిష్టము మున్నగు సద్గ్రంథములు పారా
యణ చేయుచు సాయంకాల మగుటతోడనే గంగాస్నానమునకు
వెళ్ళును. అచ్చటినుండి ప్రొద్దుపోయి ఇంటికివచ్చి నామమాత్రము
భోజనము చేసి నిద్రించును. అతనివెంబడి చంద్రుఁడును ప్రతిదినము
గంగాస్నానమునకు వెళ్ళును. అప్పటికి వాని వయస్సు పదునాఱేం-
డ్లయినను, తండ్రి గుణములు, స్వీయసాత్త్వికబుద్ధి, సత్సాంగత్యము
మున్నగునవి ఏకమై వేదాంతవిషయములను మననము చేయుట
యందును, నూతనవిషయములను తర్కించి తెలిసికొనుటయందును

అత్యాసక్తుని కావించెను. అట్టిపనులు చేయుటయందు అపరిమితా నందము నొందుచు భగవత్కథలు నిరంతరము శ్రవణము చేయు చుండుటచేతను, సద్విషయములు మననము చేయుచుండుటచేతను, వాని బుద్ధి భక్తిమార్గమునకు తిరిగెను. అప్పుడప్పుడు సజీవనలా లాశ్చర్యపడువిధమున నతనితో గంభీరవిషయములను సూక్ష్మబుద్ధితో తర్కించుచుండును. సజీవనలాలువలన చంద్రుఁ డెంతటి యోగ్యుఁ డయ్యెనో సుహాసచేయు సద్బోధలవలన వ్రజరాణి అంతయోగ్యురా లయ్యెను. ఆమె కిప్పుడు వయస్సు పదునైదేడులు. ఇట్టి యౌవనమున నూతనోత్సాహములు, దృష్టిచాంచల్యము, హావభావవిజృంభణములకు మారుగా, ఆమెయందు మాధుర్యము వెల్లివిరియుచుండెను. అయినను వ్రజరాణి బాల్యములోవలె ముగ్ధత్వము, సంభాషణ చేయునపుడు హృదయమందలి పవిత్రభావము వదనమున కనబడుచుట మున్నగు వానిచే చూచువారల కామె పవిత్రముగా తోచుచుండెను. తెల్లవారు జామున నాలుగుగంటలకే నిదురలేచి ప్రథమమున సజీవనలాలు జపముచేయు గదిని పరిశుభ్రపఱచి యతనికి కావలసిన పూజా ద్రవ్యములు లోపములేక పదిలముగా నచ్చట చేర్చి, వంట ప్రారం భించును. మధ్యాహ్న మగుటతోడనే కొంచె మేదైన చదువ వ్రాయ మొదలిడును. సుహాస కామెపై కన్నతల్లికన్న ఎక్కువ ప్రేమ, మమత్వముకలవు. ఆమె యేదైన పని చెప్పినయెడల వ్రజరాణి దానిని తత్క్షణమే రాజాజ్ఞగా నెరవేర్చుచుండెను.

వ్రజరాణిని అప్పుడే యత్తవారింటి కంపవలయునను అభిలాష సుహాసకులేదు, కాని సజీవనలాలు బలవంతముచే ఏమియుచేయ జాలక యామె నత్తవారింటి కంపు ప్రయత్నములు చేయ నారంభించెను. ఆరోజు సమీపించుకొలఁది వ్రజరాణి హృదయము గుబగుబ లాడఁ దొడఁగెను. అందుచే నామె యహోరాత్రములు చింతించుచు అప్పు

డప్పుడు తండ్రిని సువాసును కౌఁగిలించుకొని "ఇక మీకు దూర మగుదును" అని యేడ్చుచుండును. కాని యెంత యేడ్చినను ఫల మేమి? వివాహమైన పిల్ల అత్తవారింటికి పోవలసినదే, కాని పుట్టింట నుండుటకు వీలు లేదుకదా? ఆమెపై ఎవరి కేమి యధికార మున్నది?

చంద్రుఁడు, వ్రజరాణి చిన్ననాఁటనుండి అన్నచెల్లెలుభాతి అధి కానురాగముతో పెరిగిరి. కాని యిప్పుడా మెకన్నులు చంద్రుని చూచిన తోడనే క్రిందికి వాలుచుండెను. అతఁడు నదేవిధమున నొలఁగుచు వ్రజరాణిఇంటికి తరుచుగా వచ్చుట మానివేసెను. ఎప్పుడైన వచ్చి నను క్రిందిచూపులతో ఒకమూల నొదుగుచు సంకోచించుకొనుచుండెను. ఇట్టి యవస్థ యేల వచ్చెను? నాని చూపులలో ఎవ్వరికిని—చివరకు వ్రజరాణికికూడ తెలియరాని ప్రేమరసము గాఢ ముగా లీనమై యుండెను.

వ్రజరాణి కాపురమునకు పోవలసిన గడవు ఇంక మూఁడు దిన ములే యుండెను. ఒకనాఁటి సాయంకాలమున చంద్రుఁడు లోపల ఏదియో పనికై లాంతరు వెలిగించుకొనుచుండ వ్రజరాణి వచ్చెను. ఆమె చీరె చెఱఁగంతయుఁ గన్నీటితో తడిసియుండెను. అప్పటికి రెండు సంవత్సరములనుండియు వ్రజరాణి కంట తడిపెట్టగా చంద్రుఁడెన్నఁడు చూచియుండలేదు. ఆమె తన వియోగము సతిసికి తెలుపదలఁచి "చంద్రుఁడూ, నే నెట్లు సహింతునోయి" అనెను.

చంద్రుని కన్నులం దశ్రులు క్రమ్మలేదు. కంఠముకూడ గద్గదము కాలేదు. "ఈశ్వరుఁడు నీకు ధైర్యము తెచ్చుకొనుశక్తి ప్రసాదించు గాక" అని ధీరముగా పలికెను. వ్రజరాణి తలవంచెను. ఆమెచూపులు నేలకు వాలెను. ఒక్క వెక్కిలితో హృదయమందలి అనిర్వచనీయ గాధను ఆమెను వెలిగ్రక్కెను.

క్రొత్తగా కాపురమునకుఁ బోవుటయన్న స్త్రీల కెంతో కష్టము. చిన్ననాఁటి సఖులు, తలిదండ్రులు, అన్నదమ్ములు మొదలగువారిపై గల యనురాగ మంతయు వీడిపోవును. మరల నప్పుడప్పు డీయింటికి వచ్చుచుందునను అభిప్రాయ మున్నను దానివలన అణుమాత్రమైన యానందము కలుగదు. మరల వచ్చునపుడు పుత్రీభావముతో రాక, అతిథిభావముతో వచ్చి నాలుగుదినములుండి యింత పసుపుకుంకుమ పట్టుకొనిపోవునుగాని ఆమెకు మొదటి స్వాతంత్ర్య ముండదు. ఉద్యానవనమునం దాడుకొనుచుండు ఇష్టసఖులనుగూడ వదలిపెట్టి పోవలయునను భావన హృదయమున తగిలినతోడనే ఆమె గుండె వ్రక్కలైపోయెను. నేఁటినుండి ప్రమోదవనమున నవ్వులాటలన్నియు వదలి సంసారభారము నెత్తిపై పడవేసికొనవలయునుకదా!

దాసికత్తెలు వచ్చి ప్రజరాణిని శృంగారింపతొడఁగిరి. ఒకతె కాళ్లకు పారాణిపెట్టుచుండెను. ఇంకొకతె జడలో గంధకుసుమములు తురుముచుండెను. కాని యెవతె కిట్టి పరిచర్యలు చేయుచుండెనో ఆ ప్రజరాణి కన్నులనుండి భూమిపై ముత్యములు రాల్చుచుండెను.

ఇంతలోనే బయటనుండి "వేళ మించిపోవుచున్నది, త్వరపడుడు" అని వార్త వచ్చెను. సుహాను దగ్గఱనే నిలువఁబడియుండెను. ఆమె వద్దకు వెళ్ళి ప్రజరాణి గట్టిగా కౌఁగిలించుకొని, బాష్పావరోధముచే అంతర్లీనమైన శోకాగ్నిని తైలము బోసినట్లు ప్రజ్వరిల్లజేసి ఆవుర మని యేడ్చెను.

కొంచెముసేపటికి మేనాద్వారముకడకు వచ్చెను. ప్రజరాణి చూడ వచ్చిన యిరుగుపొరుగు యువతులను కౌఁగిలించుకొని సుహాను పాదములపై వ్రాలెను. తరువాత ఇరువు రాఁడువారామెను తీసికొనిపోయి మేనాలో కూర్చుండబెట్టిరి. మేనా లేచెను. కాని సుహాను నిలువున భూమిపై కూలిపోయెను. ఇల్లంతయు పాడుపడిన ట్లుండెను.

ఎండతో స్త్రీలు గుంపులుగుంపులుగా వాకిట గుమికూడియుండిరి. కాని ప్రజరాణి లేకుండుటచే ఆ ప్రదేశ మెంతో కళావిహీనముగా నుండెను. - good sentences

## ౧౧

కుంకుమబొట్టుచే లలాటము శోభించులాగున ప్రజరాణిచే ప్రేమవతి భవన మంతయు దేదీప్యమానముగా వెలుగొందుచుండెను. సువాసు కరపిన బుద్ధులవలన ప్రజరాణి అందరియెడ నడకువతో ప్రవర్తించు చుండెను. ఆమె వినయవిధేయతలను, మాట సరళిని గాంచి సేవతి సఖియగు మహారాణి సయితము ప్రేమవతి సమ్ముఖమున "మీ చిన్న కోడలు నడవడివలన మమ్మందఱ నోడించెను" అని అంగీకరించెను. సేవతితో రోజంతయు ముచ్చటలాడుచున్నను, కోకిలవంటి కంఠముతో గంటలకొలది కురిపించు గానవర్షము విన్నను, ఆనంద మొందనివారికి నేడు ప్రజరాణి ముఖకమలము గాంచినతోడనే యెక్కడ లేని ఆనందము కలుగుచుండెను.

కమలాచరణుని మిత్రు లందఱు ఆతనియొద్ద జేరి "కమలా! క్రొత్త పెండ్లికూతు రేమో వచ్చినదట! ఆమె మహాసౌందర్యవతియని వింటిమి. మమ్మందఱను మఱువక కొంచెము జ్ఞాపక ముంచుకొనుము సుమా" అని బలవంత పెట్టసాగిరి. అత్తవారింటి ధన మంతయు వచ్చి పడుటచే ఎప్పుడు చూచినను కమలాచరణుని జేబులు నిండియే యుండుచుండెను. గలగల లాడించి "అరే, మరచిపోవు టెందుకు? నేను చాల సంతోషింపవలసిన రోజులు. మీ యందఱకు విందుచేసెదను గాన ఇష్టమువచ్చినట్లు సారాయి త్రాగుడు. కాని కొంచెమైన గోల చేయ

వలదు. నోరు తెఱచి ఒకమాఱైన పలికిన లోపల మా యావిడ విని "వీ రందఱు పోకిరిజట్టులో చేరినవారే కాబోలును" అని భావించును. ఆమె మాయింటికి వచ్చినతోడనే నా ప్రాణము లన్నియు నెగిరి పోయినవి. ఆమె సామాన్యురా లనుకొంటిరా? సంస్కృతము, ఆంగ్లము, హిందీ, ఫారసీ మొదలగు భాష లన్నియు పుక్కిట బట్టినది. ఎప్పుడైన ఆమె సంస్కృతములోనో, ఆంగ్లములోనో నాతో మాట్లాడిన పొట్టబొడిచిన అక్షరములేని నేను ఏమి చేయుదునా యని ఎంతో భయపడి చచ్చిపోవుచున్నాను. అందుకనియే దాని యెదుటికైన పోవక తప్పించుకొనుచు మీతో కాలక్షేపము చేయుచున్నాను" అనెను.

కాశీనగరములో నుండు పావురాల ఆటగాండ్రు, జూదగాండ్రు, జట్కావాండ్రు ఎందఱో కమలాచరణుని మిత్రులే, కాని అందులో రకమున కొకరు చొప్పున ఐదుగురు మాత్రము ప్రాణస్నేహితులు కలరు. అందఱి కందఱు పరమనీచులు; నిరుపయోగులు. కాని అందఱిలో ౧మియామసీదు కొంచెము చదువుకొన్నవాఁడు. ఆతఁ డేదో కచ్చేరిలో బంట్రోతుగా నుండి అధికారి దర్శనాపేక్షులై వచ్చువారి వద్ద రాబట్టు డబ్బంతయు త్రాగుటకే వ్యయము చేయుచుండును. రెండవవాఁడు ౧౧హామీదుఖాను. వాని తండ్రి కంట్రాక్టుచేసి చాల ధనము గడించి మరణించెను. కాని యాధన మంతయు మూఁడు సంవత్సరములలో పాడుచేసి ప్రతిదినము సాయంకాలము చాకలిదానిని అదరించి బెదరించి అద్దె యిచ్చెదనని ఇస్త్రీబట్టలు తీసికొని వానిని ధరించి నవాబువలె బజారులవెంట తిరుగుచుండును. మూఁడవవాఁడు హాజరత్ సయ్యద్‌హుస్సేను. జూదములో నతి నిపుణుఁడు. వేల కొలఁది ప్రజలు చుట్టు కూర్చుండి చూచుచున్నను, చాకచక్యముతో తన పందెమునే గెలిపించును. నిత్యము భార్య మెడలోని నగలను

ఒక్కొక్కదాని నపహరించుటయే వాని యుద్యోగము. మిగిలిన యిరువురు రామసేవకలాలు, చందూలాలు. వీరి కేదియో ఆఫీసులో ఉద్యోగము. అసలు జీతముకన్న పై సంపాదన విశేషము. సగము సురాపానమునకు, మఱి సగము భోగముపడతులకు వ్యయపఱతురు. ఇంటిలోనివా రన్నము నీళ్ళు లేక వీథులవెంట భిక్షాటనము చేయు చున్నను, వారికి చీమ కుట్టినంత యభిమానమైన లేక తమ దుర్వ్యసనములందే ప్రమత్తిల్లి యుందురు.

ఇదివఱకే తమ యిష్టాగోష్ఠియందు వేళ నిర్ణయింపబడి యుండుటచే, రాత్రి యెనిమిదిగంటలకు శ్యామాచరణుఁడు నిద్రించుచుండి నపుడు వారు తమ విడిదిలో కూర్చుండి సురాపానము చేయుచుండిరి. ఐదుగురు నీ పనియందు మహాదక్షులు; అనుభవశాలురు. మత్తెక్కుట తోడనే వారు కొంచెము మైమఱచి ప్రలాపింప దొడఁగిరి.

నియూమసీదు—ఏమిరా! కమలా! భార్యను చూడగానే ఒడలు మఱచితివా?

కమలా—ఇదేమిరా! ఇంత పిచ్చిగా మాట్లాడుచున్నావు?

హామీదుఖాను—చెప్పరా, చెప్పు. ఇందులో దాచిపెట్టు టెందుకు? క్రొత్తవారము కాములే.

కమలా—ఏమి చెప్పనురా? ఇంటిలో నెప్పుడైన ఎదురగునేమో భగవంతుడా అని నేను పడు అవస్థ ఇంతింతని చెప్ప నలవికాదు. ఇంతవఱకు కన్నెత్తియైన తేరిపార చూడక, ఎటు లున్నదో యని నిన్న కిటికీతలుపు సందులలో నుండి చూచితిని. అబ్బా, ఏమి చెప్పుదును? అప్పటినుండి యిప్పటివరకు ఆమె బంగారుబొమ్మలాగున కన్నులకు గట్టినట్లు కనబడుచున్నది.

హామీదుఖాను—నీవు భలే అదృష్టవంతుడవురా!

కమలా—ఏమి యదృష్టవంతుడను. ఒక చావు చచ్చి బ్రతికితిని.

హాజరత్ సయ్యద్—అరే, అంత చక్కని దైనయెడల మా కంద అకి గూడ ఒకసారి చూపించవూ? This is a wonderful book

రామసేవకలాలు—స్నేహమన్న పదిమంది కలిసి విం దారగించుట కాదు. ఇటువంటివి కూడ లోపల దాచుకొనక నలుగురకు చూపించ వలసినదే.

హామీదుఖా—ఘోషా యేమైన ఉన్నదా?

చందూలాలు—మా కేమి ఘోషా? అదంతయు మీకే. తెల్ల వారిని చూడు, ఎట్లుందురో. ఎవరికైన క్రొత్తగా భార్య వచ్చిన యెడల బండి దిగకముంతే వాని స్నేహితు లందఱు వెళ్లి చేయి కలిపి వత్తురు. స్నేహమంటే అదే.

మియామసీదు—అబ్బా నేనామె నిప్పుడు చూడనిది రాత్రికి నిద్దురపట్టునట్లు లేదు.

కమలా—(చెంపకాయ వేసి) ఛీ గాడిద! నీ నాలుక చీల్చివేయు దును.

మియామసీదు—మే మేమి చేయమురా? భయపడకు. కొంచెము కన్నులతో మాత్రమే చూచెదము.

హామీదు—అరే, కమలా! ఇందు బురా యేమి లేదురా. ఏదో పదిమంది దోస్తీగా ఉండబట్టి అడిగినాము.

కమలా—మీ కంత చూడవలయునన్న ఆపేక్ష యున్న నేను కాదంటినా?

మియామశీదు—భలే, ఇవి మగసిరిమాటలు. సరే కాని మే మైన వేషములు వేసికొనవలయునా?

కమలా—ఏమియు మార్చుకొనవలదు. కాని మొగమునకు మాత్రము మసి పూసికొనిన చాలును.

హామీదు—అట్లయిన ఇప్పుడే పదండి.

ఇక్కడ బుడ్లకు బుడ్లు సారాయి ఎగిరిపోవుచుండెను. ఇంటిలో వ్రజరాణి పందిరిమంచముపై పరుండి ఆలోచనానిమగ్నురాలై "బాల్యకాలమందలి దినము లెంత పవిత్రములైనవి. ఆరోజులలో ఒకటియైన నిప్పుడు వచ్చెనేని ఎంత ఆనందము కలుగును? ఆహా ఎంత సుఖప్రదమైన జీవనము! ప్రపంచ మంతయు ప్రేమపూరితమై సౌజన్యఖనియై విరాజిల్లును. సృష్టిలోని సమస్తవస్తువులు ప్రేమాస్పదములై యుండును గదా" అని తలపోయుచుండగనే కన్నులు మూతవడెను. బాల్యమందలి యొక రంగము ఆమెకు స్వప్నమున కాన్పించెను. బాబు వచ్చి యామె మట్టిబొమ్మను పగులగొట్టెను. ఆమె దానికి బదులు వాని పుస్తకములోని రెండు కాగితములు పట్టున చించెను. బాబు కోపించి వీపుపై ఒక్కటి గ్రుద్ది వెలుపలకు పరుగిడిపోయెను. ఆమె యేడ్చుచు బాబును దిట్టుచు వెళ్ళి సువామకు చెప్పుకొనెను. సువామ వానిని పట్టుకొని "ఏమమ్మా! వీడు నిన్ను కొట్టి పరుగెత్తుచుండలేదా? ని న్నెక్కడ కొట్టెనో చెప్పు వీని పని పట్టించెదను" అనెను. బాబు కన్నులవెంట లొడలొడ నీరు కార్చుచు వ్రజరాణివైపు చూచెను. వ్రజరాణి యేడుపు గుటుక్కున మ్రింగి ముసిముసి నవ్వులు నవ్వుచు "వీడు న న్నెప్పుడు కొట్టెను? కొట్టలేదే" అని వాని చేయి పట్టుకొని తనకని పెట్టిన మిఠాయి కూడ వానికి పెట్టి యిరువురు కలిసి గంతులువేయుచు ఆడుకొనుచుండిరి. ఆహా! ఆరోజు లిపుడు వచ్చునా?

ఇంతలోనే ప్రొద్దుపోయెను. ఆకస్మికముగా ఎదుటగోడ కేదియో టప్పుటప్పున పొడుచునట్లు శబ్దము వినబడగా నామెకు మెలకువ కలిగెను. అపుడు చెవి నిక్కించి విన్నతోడనే ఇంకను స్ఫుటముగా వినవచ్చుచుండెను. కాని అప్పుడప్పుడు చప్పుడాగుచు మన్ను క్రిందబడినట్లుగా పొడకట్టెను. భీతిచే వ్రజరాణి కాళ్ళుచేతు లొక్క మొగి వణకుచుండెను. మనసు అదరెను. అయినను గుండె రాయి చేసికొని

వంటమనషియొద్దకు వెళ్ళి మెల్లగా లేప నారంభించెను. కాని యామె కుంభకర్ణునిద్రలో నుండెను. అప్పుడే ఒక మంటిగడ్డ ధమ్మని లోపల పడెను. వంటమనిషి అదరిపడి లేచెను. ఇరువుర కెవరో దొంగలు వచ్చి రని యూహించిగా తెలిసెను. వంటమనిషి చాల నిపుణురా లయినందున "అఱచిన అందఱు మేల్కొందురు. దొంగలు పారిపోవుదురు. దీని వలన లాభ మేమాత్రము లేదు" అని తలంచి, దొంగలు కన్నము వేసి మొదట కాళ్లు పెట్టి చూచి తరువాత లోపల ప్రవేశింతురని యామె యెన్నడో వినియుండుటచే ఏమైన బడిత దొరుకునేమో యని వెదకిచూచెను. కాని యేమియు దొరుకలేదు. సమీపమందే గట్టిగా కట్టుకట్టిన కొబ్బరిపుల్లల చీపురు తీసికొని "కాళ్ళు పెట్టిన వెంటనే దీనితో లాగికొట్టిన విరిగిపోవును" అని తలచి పొంచి నిలువ బడెను. కాని దొంగ కాళ్ళకు బదులు తలపెట్టెను. వంటమనిషి అక్క డనే యున్నందున బలముకొలది తలపై గట్టిగా కొట్టెను. వెంటనే ఠక్కనుశబ్దము వినబడెను. దెబ్బ తగులుటతోడనే దొంగతల ఆవలకు లాగుకొని "అబ్బబ్బా! పుచ్చ పగులులాగున కొట్టినదిరా, రామ రామ!" అని పోవుచున్నట్లును, వానితో మఱికొందఱు నవ్వుచున్న ట్లును వినబడెను. తరువాత, అంతయు నిశ్శబ్దమాయెను. ఈసంగతి ఇంటిలోనివా రందఱకు తెలిసి ఉదయ మగువఱకు మాట్లాడుకొను చునేయుండిరి.

ప్రాతఃకాలమున కమలాచరణుఁడు ఇంటికి వచ్చుటతోడనే యతని కన్ను లెఱ్ఱగా నుండెను. తలకు కట్టుకట్టి యుండెను. వంట కత్తె యతని దగ్గఱకు వెళ్లి బాగుగా పరిశీలించివచ్చి ప్రజరాణితో "అమ్మా! ఒకమాట చెప్పెదను. కష్టముగా నుండదు కదా?" అనెను.

"కష్టమెందుకు? చెప్పదలచినది చెప్పుము."

"రాత్రి కన్నము వేసినది ఎవరో దొంగలు కారు."

"మ రెవ్వరు వేసిరి?"

"ఇంటిదొంగయే కాని బయటివాడు కాడు."

"ఎవరైన నౌకరులా?"

"కాదమ్మా! కాదు. మన నౌకరులలో అంతవా రెవ్వరు లేరు."

"ఇం కెవ్వరు? స్పష్టముగా చెప్పరాదా? దాపుర మెందుకు?"

"మన కమలాచరణబాబు అనుకొందును. ఈడ్చి చీపురుతో కొట్టినదెబ్బ తలపై బాగుగా తగిలెను. అందుకనియే ఈనాడు ఆయన తల వాచియున్నది."

వినుటతోడనే వ్రజరాణి బొమలుముడివైచెను. ఆమె ముఖ మెఱ్ఱవడెను. కోపముతో వంటమనిషిని చూచి "ఇప్పటినుండి కొంచెము పదిలముగా మాట్లాడుట నేర్చుకొనుము. నాయెదుటకు వచ్చి ఇట్టి పనికిమాలినమాట లనుటకు నీకు కొంచెమైన సిగ్గులేదా? ప్రత్యక్షముగా నాయెదుటనే సాహసించి ఇట్టి కళంకములు ఆయన కాపాదించుచుంటివా? నీవు పెద్దదానివని జాలిపడి ఊరకుంటిని. కాకున్న చో ఇప్పుడిప్పుడే నిన్ను వెలుపలికి గెంటించివేయుదును! ఇట్టి ప్రాయశ్చిత్త మొకసారి జరిగినగాని ఎవరియొద్ద నేవిధమున మాట్లాడవలయునో ఆ పద్ధతు లన్నియు నీకు పట్టుబడవు. ఛీ, ఇక్కడినుండి లేచి పొమ్మా. నీ ముఖము చూచిన ఒడలు మండుకొనిపోవుచున్నది. ఆయనకు భగవంతు డేమి తక్కువ చేసినాడు? ఈ యిల్లు, వాకిలి, నా పితార్జితము, నేను అందఱము ఆయన వశవర్తులమే. అర్ధరాత్రి వేళ దొంగగా వచ్చి కన్నము వేయు దుర్గతి ఆయన కేలపట్టినది? పో, పాపిష్ఠురాలా!" అనెను.

వ్రజరాణి కోపించి వంటమనిషిని చీవాట్లు పెట్టెనుగాని ఇంటిలోని

వారందఱికి విశ్వాసమే కలిగెను. శ్యామాచరణునకు తెలిసి "వీ డింత కన్న ఎక్కువపనులు చేయవలసినవాడేకాని ఎందువలననో ఊర కొన్నాడు" అనుకొనెను. మున్ముందు కోడలి యొంటిమీఁది నగలను కూడ నిలువనీయడేమోయను భయము తోఁచి, హాస్టలులో నుంచిన బాగుగా నుండునని నిశ్చయించుకొనెను. కమలాచరణున కీసంగతి తెలిసి, యెంతో తన్నుకొనెను. కాని విధిలేక అచ్చటగూడ తన పను లకు భంగము కలుగకుండవలయునని యోజించి హాస్టలుకు వెళ్ళి పోయెను. కోడలు రాకముందే వాని తండ్రి, కుమారుని హాస్టలు లోనే యుంచవలయునని యనుకొనెను, కాని వాని పట్టుదలచేతనే యింతవఱ కాయభిమతము కొనసాగక; నేఁడు సంపూర్తి యాయెను. ఆతఁడును తన్ను భార్య ఎక్కడ పరీక్షించునో యను భయమున మెల్లగా తప్పుకొనెను.

## ౧౨

కమలాచరణుఁడు హాస్టలులో ఎట్లో ప్రథమదినమున నిద్రపోవుచు బలవంతముగ గడపెను. "నేఁడు మైదానమున రెండు జట్లు చాలపౌరుషముతో తమ పావురములజోళ్ళను విడిచెదరు. పందెము చాల ఉద్రేకముగ నుండుటచేత వేలకొలది చూడవచ్చెదరు. అది చూడవలయునేకాని లేకున్న జన్మవ్యర్థము!" అని రెండవరోజున తలపోసెను. "అయ్యో! మిత్రులందఱు కలసి పరస్పరము మాటలాడుచు, నవ్వుకొనుచుండ నే నీవిధమున జైలులో నుంటినే" అని తలఁచి యతఁడు మెల్లగా మైదానములోని కెగిరిపోయెను.

నే డిక్కడ జనులు ఇసుక వేసినను రాలకుండునట్లు తండోపతండము

లుగా కూడియుండిరి. సోడావాండ్రు "టుప్పున" బుడ్లనుకొట్టి యిచ్చు చుండిరి. సిగరెట్లు, బీడీలు, చుట్టలు, తములపాకులు అమ్మువారందఱు తమతమ దుకాణములు చిత్రవిచిత్రములుగా నలంకరించి ప్రదర్శించి యుండిరి. చదువు సంధ్యలులేక దిరిగెడు శుంఠయువకు లందఱు వివిధ వేషములు గల పావురములకు బటాణీలు మున్నగునవి తినుపించుచు కూర్చుండి యుండిరి. కమలాచరణుని మిత్రు లందఱు అచ్చట ప్రత్యక్షు మైరి. వా రూరకుండుట చూచి యితరులు "మీవంటి మహారాజులు కూడ నే డూరకుంటి రేల!" అని పలుకరింప, అమిత సురాపానముచే మత్తిలిన ఆజట్టు నట్టున జేబులలో నుండి సిగరెట్లపెట్టెలు లాగి యగ్ని హోత్రమున కాహుతి గావించుచుండిరి. అట్టి సమయమునందే కమలా చరణుఁడు దూరమునుండి వచ్చుచుండుట వారికి కనుపించెను. వెంటనే యందఱు చప్పట్లు కొట్టుచు పరుగిడి వానిని గట్టిగా కౌఁగిలించు కొనిరి.

హామీదు—అరే దోస్త్! ఈరో జెక్కడ అదృశ్యమైతివిరా? దేవునితోడు, నీకొఱకు మీ యింటిచుట్టు తిరిగి తిరిగి కాళ్ళు పడి పోయినవి.

మియామనీదు—ప్రస్తుతము చాల ఆనందింపవలసిన రోజులురా యివి. బాగుగా కై పెక్కి కన్ను లెఱ్ఱపడినవో లేవో చూడు.

రామసేవకలాలు—వానికి మనజోలి యెందుకురా? చక్కని చుక్కవంటి భార్య వచ్చినది మొదలు బొత్తుగా మనకు మొగమే చూపించుటలేదు. ఎప్పుడు ఇంటిలో నుండుటే. ఏమిరా, కమలా! నీదే పట్టురా. భలే.

కమలా—పట్టులేదు పాడులేదు. మూడురోజులనుండి చెఱసాలలో వలె హాస్టలులో పడి మొత్తుకొనుచున్నాను.

హామీదు—యాఖుదా! ఎంతగతి పట్టినదిరా నీకు!

కమలా—మీయెదుట యథార్థము చెప్పుచున్నాను. మొన్నటి నుండి హాస్టలులో నాపుఠము వేయుచున్నారు. ఈరోజు ఎట్లో తప్పించుకొని మెల్లగా బయటపడితిని.

చందూలాలు—భలే పక్కాపని చేసితివి. కాని ఆకంకోష్టుహాస్టలు సూపరింటెండుకు తెలిసిన ఊరుకొనునా?

కమలా—కాకపోయిన ఇట్టి ఆటపాటలు, ముచ్చటలు వదలి బండెడు పుస్తకములు ముందు తగులవేసికొని ఎవడు శ్రమపడగలడు?

హామీదు—అరే, నీ పుణ్యమువల్ల ఎట్లో తప్పించుకొని వచ్చితివి కాని ఇంక వెళ్లకు. నీకు తెలియునో లేదో, ఆరోజు కారోజు క్రొత్త క్రొత్తలు బయలుదేఱుచున్నవిరా! ఇదుగో, రేపు గాలిపటముల పందెము. ఎల్లుండి గుఱ్ఱపుపందెములు. ఆవలెల్లుండి దొమ్మరివాండ్ర ఆటలు. ఎన్నని వర్ణింతును? నీవు పోతివా? ఇవన్నియు చూచు భాగ్యము లభింపదు.

కమలా—అటు సూర్యుడిటు పొడిచినను రేపు తప్పక ఉండి చూచి తీరెదను.

రామసేవకలాలు—అరే పతంగుల పందెము చూడకపోతే కండ్లున్న లాభము లేదురా. ఉండు.

మూండవజామున కమలాచరణుఁడు మిత్రులయొద్ద సెలవు పుచ్చుకొని మ్లానవదనముతో హాస్టలుకు వెళ్ళెను. సూపరింటెండెంటు లేకున్న తటాలున గదిలో జొరబడవచ్చునని ద్వారముకడనుండి మెల్లగా తొంగి తొంగి చూచుచుండెను. కాని ఆయన యేదో పని మీఁద వెలుపలికే వచ్చుచుండెను. మనస్సు చిక్కబట్టి కమల లోపలికి పోవుచుండెను. సూపరింటెండెంటు—

"ఇంతవర కెక్కడ నుంటివి?" అని వాని నడిగెను.

"పనిమీఁద బజారు వెళ్ళితిని."

"ఇది బజారు వెళ్లవలసినవేళ కాదే."

"నా కాసంగతి తెలియదు. ఇక జాగ్రతగా నుందును"

సూపరింటెండెంటు వెళ్ళిపోయెను.

రాత్రిపూట మంచముపై పరుండి "ఎట్లో ఈసారి తప్పుకొంటిని. రేపు కూడ భగవంతుడు కటాక్షించిన బ్రతికిపోదును. ఎల్లుండి ఎటు లనో వాని కన్నులలో దుమ్ముకొట్టి పోదునులే. రేపు జరుగు పతంగుల పందెములు అవశ్యము చూడవలసినవే. ఆహా! పతంగులన్నియు ఆకసమున కెగిరి చుక్కల జూచుచు, ఆడుచు పెద్దపెద్ద పందెములు గెలుచుచుండుట ఎంతో చూడదగినది'' అని తలపోయగనే నిదుర పట్టెను. రెండవనాడుకూడ ఆతఁడు మరల హాస్టలునుండి తప్పించు కొని పోయెను. మిత్రులు అద్దెమోటారునందుండి వీనికొఱకు ప్రతీ క్షించుచుండిరి. కమలాచరణుఁడు కనుపడినతోడనే కౌఁగిలించుకొని వీపు చరచిరి.

కొంతసేపటివఱకు కమలాచరణుఁడు అచ్చటి దృశ్యమును చూచు చుండి "పరుల కౌశలముల నెంతచూచినను లాభమేమి ? నా హస్త కౌశలమును పదిమందికి చూపి ,భలే, భలే' అనుపించుకొనిన మేలు కదా'' అని తోడివారలకు తన యభిప్రాయమును వెల్లడించెను. వారందఱు "అరే, నీవు పోకున్న నీ రెండఱున్నను లాభములేదు. ఒక్కపెట్టున పందెము లన్నియు నీవే గెలువగలవు. త్వరగా నీ గాలి పటమును గూడ ఇంటినుండి తెప్పించుము. అవసరమైనయెడల కావలసి నంత డబ్బు మేమే పెట్టుబడి పెట్టెదము'' అని ప్రోత్సాహపఱచిరి. వెంటనే యతఁడు గాలిపటమునకై ఒక మనుష్యుని ఇంటికి పంపెను. కాని వాఁడు రిక్తహస్తములతో ఇంటినుండి వచ్చుట కాంచి శరీర మునకు నిప్పంటించినంత వేదన పొందెను. ఆతఁడే యింటికి వెళ్ళి, లోపలికి పోవుటతోడనే బడిత తీసుకొని చాకిరివాండ్రఁడందఱిని ఎము

కలు విరుగఁ బొడిచెను. పాపము, ఏ మెఱుఁగక చుట్టలు కాల్చుకొనుచు ఏమఱుపాటున గూర్చున్నవా రందఱు ఈవిధమున చావుదెబ్బలు తగులుటచే పే టంతయు ప్రతిధ్వనించులాగున గొల్లున నేడ్చిరి. చుట్టు పట్ల నుండువా రందఱు గుమిగూడిరి. కాని, తమ దోష మేమిటో యెవరికిని తోఁచినది కాదు. చాకిరివాండ్రను ఈవిధముగా దండించి తన పరికరము లున్న గదిలోని కేగెను. అచ్చట జరిగియున్న దుఃస్థితిని చూచుటతో డనే యతఁడు కోపోద్దీప్తుఁ డయ్యెను. వెదురుబద్దలు తుత్తునియలై యుండెను. కాగితములు, దారము మున్నగు అంగము లన్నియు వికలములై గదియంతట వ్యాపించి యుండెను. దీని కంతకు కారణము తల్లియే యని భావించి రోషకషాయితనేత్రుఁడై యామె యొద్ద కేగి భీకరస్వరమున,

"అమ్మా! నీవు నా ప్రాణమునకు దాపురించితి వెందుకు? మూడు రోజులుక్రిందట చెఱసాలలో త్రోయించి, అంతటనైన తృప్తిపడక నా ఆటవస్తువులను కూడ ఛిన్నాభిన్నము చేసితి వెందుకు?" అనెను.

"ఏమిటిరా? నీ వస్తు వేదియు నేను ముట్టుకొననైన లేదే"

కోపముతో "అబద్ధమాడిన నోటిలో పురుగులు పడును. నీవే నా వస్తువులు ముట్టుకొనకున్న ఇతరుల కెవ్వరికైన నాగదిలో ప్రవేశించి కాగితములు చించి దారములు త్రెంపి, బద్దలు త్రుంచి, పాఱవేయుటకు సాహస ముండునా? ఇదంతయు నీకు తెలియదా!" అనెను.

"దైవముతోడురా, నీ గదిలో నే నడుగైన బెట్టలేదు. ఏమేమి వస్తువులు చెడినవో చూతము పద" అని తల్లి గదివైపు వెళ్ళెను. కమలాచరణుఁడు మొగము జేవురింప తలవాకిట నిలువఁబడియుండెను. మాధవి వ్రజరాణి గదిలో నుండి వచ్చి ఉత్తర మిచ్చి వెళ్ళి పోయెను.

"నాథా !

ఈ తప్పు నేనే చేసితిని. తోచినటుల నన్ను శిక్షింపుడు.

అపరాధిని

ప్ర జ రా ణి."

ఉత్తరము చూచినతోడనే కమలాచరణుఁడు పిల్లివలె మాఱి సేవకులను బెదరించుచున్న తల్లి నాపి, తాను గదిలోనికి వెళ్లెను. అచ్చట వికలములై పడియున్న వెదురుబద్దలు, చక్రములు, దారము మున్నగు వానిని ఒక్కచోట చేర్చి నిప్పు ముట్టించెను. "దేనికి వీడిట్లు తగుల బెట్టుచున్నాడో" అని తల్లి నిర్ఘాంతపోయెను. "చాకిరివాండ్రతో పాటు ఈ పనిముట్లు ఏ యపరాధము కావించెనో" అని అనుకొని పుత్రుని అడ్డగింపఁబోయెను, కాని వాని ముఖమందు కోపచిహ్నము లేమియు తోపక విరక్తిభావము తోఁచుచుండెను. తన పని కాటంకము కలిగింపవచ్చిన తల్లితో "నా కేమియు కోపములేదు. ఈ పాడు వస్తువులవల్లనే నేను ఒడలెఱుఁగని కోపముచే ఎంతో దుష్కార్య మొనరించితిని. కాన ఇక నీ పతంగములను ఆడనని శపథము చేయు చున్నాను" అనెను.

తరువాత ఆత డొంటరిగానుండి "నిజముగా నే నిట్లు పతంగము లాడుట ఆమె కిష్టములేదు కాబోలు! హృదయమునం దిట్టి విరుద్ధ భావమే లేకుండిన ఆమె నే డిట్టిపని ఏల చేయును? 'నీయిష్టమేమి' అని అడుగుదునా? కాని దానియెదుట కేమొగము పెట్టుకొనిపోగలను? మహామూర్ఖుడనై చాలసారులు నా తెలివితక్కువ బయటపెట్టు కొంటిని. కన్నము వేసిననాటిసంగతి తప్పక ఆమెకు తెలిసియే యుండును. ఇట్టి సమయమందు ఏ యోగ్యతతో తగుదునని దాని మొగము చూతును? ఛీ, ఛీ, ఇక దుస్సహావాసముల మానుకొని దానికి మొగము చూపక బుద్ధికలిగి చదువుకొందును. అది దేవలోక

మునుండి ఊడిపడిన అప్సరసకాని సామాన్య మానవకాంత కాదు. అట్టి సుందరాంగి పావనహృదయముతో నా తప్పులు క్షమించదా? అధరముమాత్రము ప్రవాళద్యుతుల నీనుచున్నది, కాని హృదయ మత్యంత కఠోరముగా తోచుచున్నది. దాని హృదయమున దయా రస మేకొంచెమున్నను 'ఇష్టమువచ్చినట్లు శిక్షింపుము' అనునా? ఏమి శిక్ష వేయుదును? దానిని గలిసినపుడు గాఢాలింగన మొనరించు కొందును. సరే. ఇ వన్నియు ఏల ? నేటినుండితప్పక విద్యాభ్యాసము చేయవలసినదే అని తలంచి గూటియొద్ద కేగి తలుపు తెఱచి యొకటి వెంబడి యొకటి పావురముల నన్నింటిని పైకి విడువ నారంభించెను. అ వన్నియు అసాధారణప్రజ్ఞకలవి. ఒక్కొక్కటే బయలుదేఱి పట్టణ ములోని పావురముల నన్నిటి నోడించి యవలీలగా పందెము గెలువ గలవి. ఎగురవేసిన మూఁడురాత్రులు, మూఁడుపగలులైన క్రిందికి రాక ఆకసమునందే విహరింపగలవి. కాని వాని నన్నింటిని వదలి వేయగా అవి నక్షత్రములవలె నభోమండలమున గుడుగుడుశబ్దము లతో పరిభ్రమించుచుండెను. గూడు ఖాళీయగుటతోడనే "దీనిని తీసుకొనివెళ్ళి తగులబెట్టుడు" అని చాకిరివాండ్రకు ఆజ్ఞయిచ్చి "అవి యుండుటకై యేర్పరుపబడిన మచ్చునుగూడ పడగొట్టుడు, లేకున్న మరల వచ్చి వ్రాలును" అని కమలాచరణుఁడు చెప్పెను.

తరువాత క్రమముగా చిలుకలు, గోరువంకలు, కౌజులు, మున్నగు వానినిగూడ చెఱసాలనుండి విముక్తి గావించెను.

వెలుప లానాటకము జరుగుచుండ లోపల ప్రేమవతి అొమ్మ్మ బాదుకొనుచు "అయ్యో! ఎట్టి దౌర్భాగ్యపుపని చేయుచున్నాడే వీఁడు" అని విచారపడి, వ్రజరాణిని పిలిచి "అమ్మా వాని కీవేళ ఏదో దయ్యము పట్టినట్లున్నది. ఎటులైన ఆపుదు" అని ఏడువనారం భించెను. వ్రజరాణికూడ దరి దోచక "ఇట్లేల చేయుచుండెనా?" అని

యోజింపఁదొడఁగెను.

కమలాచరణుఁ డెంత యుద్ధతుఁడైనను, దుర్వ్యసనముల పాలఁ బడి పరితపించుచు, సకలసదుర్గుణోపేతుఁడైనను, భార్యకు విరుద్ధముగా ప్రవర్తింపని సుగుణ మొక్కటిమాత్రము కలదు. చాటున ఆమె భర్తతో తరుచుగా మాట్లాడుచుండు చనువుచే మరల నొక కాగితము తీసి ఉత్తరము వ్రాసి పంపెను.

"హృదయేశ్వరా !

నేను మూఁడునాలుగు వెదురుబద్దలు విరిచిపారవైచినందులకే మీ రింత కోపము నాపై వహించితిరా? ఈ స్వల్పకార్యమునకే మీ రింత ఆర్భాటము చేయుదురన్న సంగతి ప్రథమమున తెలిసినచో మీ పనిముట్లపై చేయినైన వేయకుండెడిదాననే. కాని, ఏమి చేయ గలను? పొరపాటున జరిగినది. ఇది నా ప్రథమాపరాధము కాన పరిపూర్ణకటాక్షముంచి క్షమింపవలయును.

మీ అర్ధాంగి

వ్రజ రా ణి."

ఉత్తర మందినవెంటనే కమలాచరణుఁడు త్రిలోకాధిపత్యము తన చేతిలోనికి వచ్చినట్లు భావించెను. ప్రత్యుత్తరము వ్రాయవలయునని యోజించెను, కాని కల మాఁడుటలేదు. ఏమాటలతో ప్రారంభించ వలయునో దేనితో పూర్తిచేయవలయునో ఎట్టి భావగాంభీర్యము నందు చొప్పింపవలయునో అతనికి తెలియనే తెలియదు. వ్రజరాణి కన్న ఎక్కువ క్రొత్తనడకలతో హావభావవిజృంభణములతో వ్రాయ నుప్పొంగుచుండెను. కాని యతని తల మట్టిబుఱ్ఱ యగుటచే ఏమాత్ర మాలోచనపోవుటయేలేదు. ఎన్నడిట్టి యుత్తరము వ్రాయక నేఁ డారంభింపఁబోవ ఒక యక్షరమైనను సాగనందున ఎంతో యేడ్చి తన యేడ్పుగొట్టుమొగము ఎవ్వరైన చూచి పరిహాసింతురేమో

యని తలుపు బిగించుకొని లోపల పరుండెను.

మూఁడుజాములవేళ శ్యామాచరణుఁడు ఇంటికి రాగా, ముందుగా ఆయనకు బూడిదకుప్ప కనుపడెను. వెంటనే యాశ్చర్యపడి "ఈ కుప్ప యెక్కడిది?" అని సేవకుల నడిగెను. పావురములమచ్చు తగులబడినదని వారు చెప్పిరి.

శ్యామా—(అదరిపడి) దాని నేల తగులబెట్టితిరి? పావురములిక నెక్కడుండును?" అనెను.

"చిన్నబాబుగారే తగులబెట్టుమనిరి."

"పావురము లెక్కడ ఉన్నవి?"

"అన్నియు యెగిరిపోయినవి. గాలిపటముల సామగ్రిని కూడ కాల్చివేసిరి."

అదివఱకు వారి యెముకలు విరుగగొట్టుటచే కసి దీర్చుకొనుటకీవిధమున చెప్పి, యింక దీనివలన తండ్రి కుమారుని బాగుగా చీవాట్లు పెట్టునని వారు తలఁచిరి.

"నిద్దుర లేచినదిమొదలు ఈ వస్తువులతోడనే ప్రొద్దుపుచ్చువాడిట్లు వీని నేల తగులబెట్టించెనా" అని తండ్రి చాలసేపు యోజించి ఏదో హేతువుండు ననుకొని "వాని నిక్కడకు తీసికొనిరండు" అనెను. నిముషములో నౌకరువెళ్ళి వచ్చి "అయ్యా! బాబుగారు లోపల గడియ వేసుకొన్నారు. ఎంత పిలచినను తీసినారుకారు" అనెను.

వెంటనే శ్యామాచరణుఁడు "కొడుకేమైన విషము తిని పడియుండెనేమో" యని స్థంభితుఁడాయెను. ఆనాఁడే విషము తిని మరణించిన ఒక కేసు విచారించి వచ్చుటచే చాల ఆవేదనపడి గదియొద్దకు పరుగిడెను. తలుపు గట్టిగా తన్ని గద్గదస్వరముతో "అబ్బాయీ! అబ్బాయీ!" అని యతఁడు పిలిచెను. తండ్రి గొంతును గుఱుతించి కమలాచరణుఁడు కన్నీళ్లు తుడుచుకొని వచ్చి తలుపు తెఱచెను.

అప్పుడు తండ్రి కుమారుని ముఖము చూచినతోడనే నోటికి వచ్చి నటుల తిట్టుటకు మారు కౌఁగిలించుకొని వ్యాకులముతో "తండ్రీ! నీ వేమియు తినలేదుగదా?" అని యడిగెను. తండ్రి ఈప్రశ్న నేల వేసెనా యని గ్రహింపజాలక సజలనయనుఁడై కుమారుఁడు ఆయన మొగమువైపు చూచుచుండెను. కుమారుని వదనము చూచి "వీడు నే డేదో చేసినాడు" అని నిశ్చయించి నౌకరును పిలచి "వెళ్లి డాక్టరు నిప్పుడే పిలుచుకురమ్ము" అనెను. ఇప్పటికి కమలాచరణుఁడు తండ్రి భావము గ్రహించి పరుగిడి కౌఁగిలించుకొని "నాన్నా! మీ కీభ్రమ ఏల కలిగెను? మీతోడు, నే నేమియు తినలేదు" అనెను.

కాని, "ఎట్టులైన కాలవిలంబము చేసి ప్రాణములు విడువ జూచు చున్నాడేమో" అని తలచి శ్యామాచరణుఁడు ఆదరముతో "నాయనా! పెట్టెలోనుండి ఏదైన మాత్ర తెచ్చి యిచ్చెదను. నన్ను విడువుము. ఊరక హాస్టలులోనుండి చదువుకొనుచుంటి వని నమ్మితిని గాని ఇట్లు చేయుదు వని కలనైన తలచనైతిని" అనెను.

"దైవసాక్షిగా నేను బాగుగా నున్నాను. నా శరీరము నాకు తెలియదా? వ్యర్థముగా డాక్టరుగారి నేల పిలువపంపితిరి."

"నీ వేమియు తినకున్న తలుపు బిగించుకొని యేల యుంటివి?" అనెను.

"లోపలినుండి ఉత్తరము రాగా జవాబు వ్రాయుచుంటిని."

"పావురముల మచ్చు, పంజరములను తగులబెట్టించితి వెందుకు?"

"అవన్ని యున్నందున కాల మంతయు వ్యర్థముగా పోవుచుండుటయే గాక, మనస్సుకు శాంతి కలుగకపోవుటచే వాని నన్నిటిని అంతము చేసితిని. ఇకముం దెంత చులుకుగా నుందునో చూడుడు."

ఇప్పటికి శ్యామాచరణుని హృదయము కుదటపడెను. లోపలికి వచ్చి ప్రేమవతిని నడుగ జరిగిన కథ యంతయు పూసగ్రుచ్చినట్లు

ఆమె వివరించెను. ఆవిధమున ప్రజరాణి కోపముచే గాలిపటములు, మొదలగువానిని పాడుచేసి భర్త వినోదవస్తువులను విధ్వంసము చేసిన దని విని "క్రొత్తకోడలు మగనిని బాగుగ లొంగదీయగలిగినదే" అని భార్యతో పలికి నవ్వెను.

౧౩

ప్రజరాణి అత్తవారింటికి వెళ్ళినమీాదట సుచామ గృహము చిలుకలేని పంజరమువలె నుండెను. ఆమెయే యీా గృహదీపికగా నుండుటచే పూర్వపు గృహమే యైనను, నలుదిశలు వెలవెల పోవుచుండెను. పూదోఁట వెనుకటిదే యైనను ఋతువు ఆకులు రాలునది కదా! ఆమె కాపురమునకు వెళ్ళిన నెలరోజులకే సజీవనలాలు తీర్థయాత్రకు బయలు దేఱెను. ఆస్తి యంతయు చంద్రున కప్పగించి తాను కృష్ణాజినము, భగవద్గీత మాత్రము వెంట తీసికొని వెళ్ళెను.

చంద్రుఁ డత్యంత ప్రేమోద్రేకముకలవాఁ డైనను వీలుకానపుడు దానిని అణచుకొను శక్తి కూడ కలవాఁడు. ఇంటియందలి ప్రతివస్తువు నందును ప్రజరాణి స్వరూపమే తాండవించుచున్నందున "ఆహా! నా కామె భార్యగా లభించిన ఎంత సౌఖ్యముగా ఉండెడివారము" అను భావన నిముషనిముషము మనసులో మెలగుచున్నను, అతఁడు వెంటనే దాని నణచుకొనుటకు ప్రయత్నించుచుండును. పుస్తకము తెఱచి కూర్చుండును కాని యతని దృష్టి పరాయత్తమై యుండును. విస్తరిముందు కూర్చుండగనే ప్రజరాణి దివ్యసుందరవిగ్రహము నేత్రానందకరముగా కనబడుచుండును. హృత్కుహరమున జాజ్వల్యమానముగా ప్రజ్వరిల్లు ప్రేమానలమును అణచుకొనుచు నతఁడు చాల శోచ

ఆమె వివరించెను. ఆవిధమున ప్రజరాణి కోపముచే గాలిపటములు, మొదలగువానిని పాడుచేసి భర్త వినోదవస్తువులను విధ్వంసము చేసినదని విని "క్రొత్తకోడలు మగనిని బాగుగ లొంగదీయగలిగినదే" అని భార్యతో పలికి నవ్వెను.

## ౧౩

ప్రజరాణి అత్తవారింటికి వెళ్ళినమీాదట సుధామ గృహము చిలుకలేని పంజరమువలె నుండెను. ఆమెయే యీా గృహదీపికగా నుండుటచే పూర్వపు గృహమే యైనను, నలుదిశలు వెలవెల పోవుచుండెను. పూదోఁట వెనుకటిదే యైనను ఋతువు ఆకులు రాలునది కదా! ఆమె కాపురమునకు వెళ్ళిన నెలరోజులకే సజీవనలాలు తీర్థయాత్రకు బయలుదేఱెను. ఆస్తియంతయు చంద్రున కప్పగించి తాను కృష్ణాజినము, భగవద్గీత మాత్రము వెంట తీసికొని వెళ్ళెను.

చంద్రుఁ డత్యంత ప్రేమోద్రేకముకలవాఁ డైనను వీలుకానపుడు దానిని అణచుకొను శక్తి కూడ కలవాఁడు. ఇంటియందలి ప్రతివస్తువు నందును ప్రజరాణి స్వరూపమే తాండవించుచున్నందున "ఆహా! నా కామె భార్యగా లభించిన ఎంత సౌఖ్యముగా ఉండెడివారము" అను భావన నిముషనిముషము మనసులో మెలగుచున్నను, అతఁడు వెంటనే దాని నణచుకొనుటకు ప్రయత్నించుచుండును. పుస్తకము తెఱచి కూర్చుండును కాని యతని దృష్టి పరాయత్తమై యుండును. విస్తరిముందు కూర్చుండగనే ప్రజరాణి దివ్యసుందరవిగ్రహము నేత్రానందకరముగా కనబడుచుండును. హృత్కుహరమున జాజ్వల్యమానముగా ప్రజ్వరిల్లు ప్రేమానలమును అణచుకొనుచు నతఁడు చాల శోచ

కొనుటకు అవకాశమే లభింపకుండెను.

అట్టి దురవస్థలో రాత్రింబగళ్ళు వ్యథ నొందుచుండుటచే అతని ముఖము దినదినము కాంతివిహీనమై పోవుచుండెను. కుమారుని స్థితి చూచి తల్లి చాల దిగులుపడి "నీచదువు విచ్చట సాగుటకు ఏమైన ఆటంకము లున్న ప్రయాగ వెళ్ళుము" అనెను. ఆ యుద్దేశము చంద్రునకు మొదటినుండియు ఉన్నను వృద్ధురాలగు తల్లిని ఒక్కతెను విడిచి ఎట్లు వెళ్లుదునా యని వెనుకాడుచుండెను. వెదుకబోయిన తీగ కాలికి తగిలినట్లు తల్లి తనంతట తానే పొమ్మని చెప్పినందున అతఁడును పోవుటకు నిశ్చయించుకొనెను. ప్రయాణసౌకర్యమునకు కావలసిన సామగ్రులు సమకూర్చుకొని మంచిరోజు నిర్ణయించుకొనెను. ఇప్పటి నుండియే సువామ చంద్రునకు క్రొత్తచోటులందు ప్రవర్తించువిధము బోధింప జొచ్చెను. "నాయనా! ఎవ్వరితోడను జగడము పెట్టుకొన వలదు. నీ కాతలంపు లేకున్నను, నేను చెప్పుచున్నాను. ఇల్లు వదలుచుంటివి కావున చాల జాగ్రతగా సంచరింపుము. అన్నపానములందు మితముగా నుండుము. పగటివేళ నిద్రించు దురభ్యాసము నీకు కలదు. దానిని మానుకొనుము. నీ కంత తప్పనిసరియైన మధ్యాహ్నమున ఒక ఘడియసేపు పండుకొనుము" అని అవకాశము చిక్కినప్పుడెల్ల చిలుకకు చెప్పినటుల బోధించుచుండెను.

తుద కాతఁడు పోవలసిన సమయము వచ్చెను. రైలు పగలు పది గంటలకు వచ్చును. "వ్రజరాణితో కొంత మాటాడివెళ్లిన మంచిది. గ్రామాంతరము వెళ్ళుచున్నందున మరల వచ్చి చూచుయోగ మున్నదో లేదో" అని యతఁ డనుకొనఁగనే హృదయమునందు అమితోత్సాహము కలిగెను. తల్లికీవార్త తెలుపగా, ఆమె సరేయని ఒక పళ్ళెములో మిఠాయి, మఱొకదానిలో పండ్లు మొదలయినవి ఉంచి, దాసియగు రాధనుపిలచి "వీనిని తీసికొని బాబువెంటపొమ్ము

అని చెప్పెను. చంద్రుఁడు క్షౌరముచేయించుకొని, ఉతికినబట్టలు కట్టుకొనెను. సంసిద్ధుఁడై అడుగు ముందఱకు వేయుచుండెనుకాని కాలు సాగుటలేదు. ఆతనికెన్నో ఊహలు తోఁచుచుండెను. "వ్రజరాణి నన్నుగూర్చి ఏమనుకొనునో! నాలుగునెలలు గడచినను నాకొక ఉత్తరమైన వ్రాయలేదు. అట్టియెడ నేనచ్చటికి పోయినను ఆమెనన్ను చూచి సంతసించునా? వెఱ్ఱివాఁడనుకాని నేనింకను ఆమెకు జ్ఞాపకముంటినా? నేను చచ్చిపోయినను ఆమెకంటతడి బెట్టునా? అవసరమేమి? పుట్టింటి సందర్భము వేఱు; అత్తింటిసందర్భము వేఱు; ఈనాఁడు నాకేమిపుట్టెనోకాని బట్టలన్నియు మార్చివచ్చితిని. నేను కొంచెము షోకుగా నుండుటచూచి, ఈతఁడు నన్ను భ్రమపెట్టుటకే వచ్చినాఁడని అనుకొనునేమో!'' అని పరిపరివిధముల తలచుచు వచ్చుచుండ శ్యామాచరణుని భవనము కనుపించెను.

కమలాచరణుఁడు మైదానమున విహరించుచుండెను. వానిని చూచినవెంటనే, ఇంటివానిని చూచినదొంగవలె చంద్రుఁడు గిరుక్కున ఒకయింటిచాటునకు తిరిగిపోయి, రాధనుపిలచి "అవసరమైన పనిమీఁద బజారు వెళ్ళుచున్నాను. తిరిగి వచ్చునపుడు వారింటి మీఁదుగా వెళ్లెదను. నీవు ఈవస్తువులను ఆమెకిమ్ము" అని బజారు వైపుతిరిగి, పది అడుగులువేసి మరల వెనుకకువచ్చి దాసినిపిలిచి "నాకచ్చట ఆలస్యమైన వచ్చుటకు వీలుకాకపోవచ్చును. వారేమైన అడిగిన ఈయుత్తరమిమ్ము" అని జేబులోనుండి యొకకాగితము తీసి పెన్సలుతో తన హృదయగతిని ఈవిధమున వెలువరచుచు వ్రాసెను.

"వ్రజరాణీ!

నేను చదువుకొనుటకు నేఁడు ప్రయాగవెళ్లుచున్నాను. అవసరమైన పను లున్నందున వచ్చి నిన్నుచూచుటకు అవకాశము చిక్కలేదు. ఈశ్వరానుగ్రహమున బ్రతికియున్న మరల ఎన్నడైన నిన్నుచూడ

గలను. అప్పుడప్పుడు నీక్షేమ సమాచారములు నాకు తెలుపు చుండుము.

చంద్రుఁడు"

చందుర్రు ఉత్తరమిచ్చి పోవగనే, రాధమెల్లగా వ్రజరాణి గృహముచేరెను. దానిని చూచినవెంటనే రాణి పరుగిడివచ్చి, క్షేమ మడిగి "నాన్నగారియొద్దనుండి ఏమైనఉత్తరమువచ్చినదా?" అనిప్రశ్నించెను.

"పోయినప్పటినుండీ ఉత్తరమే రాయలేదమ్మగారూ."

"పిన్ని బాగుగాఉన్నదా?"

"బాబుగారు ప్రయాగ పోతున్నారు. మొగము మహాచిన్న బోయిఉంది."

వ్రజరాణి ఉలికిపడి "బాబుప్రయాగ వెళ్ళుచున్నాడా?" అని అడిగెను.

"అవునమ్మగారూ! పరాయిచోటికి పోవద్దని మే మెంత మొత్తుకున్నా యిన్నారుకారు."

"ఎప్పుడు వెళ్లును?"

"ఈరోజు పదిగంటల బండికే యెల్తున్నారు. మిమ్మ చూడ్డానికి ఇక్కడిదాకవచ్చి ఎందుకో యెనక్కు పోయ్యారు."

"ఇక్కడిదాకవచ్చికూడ తిరిగిపోయెనా? ద్వారమువద్ద ఎవ్వరైన నుండిరా?"

"అందాకకూడ రాలేదమ్మగారూ! అవతలి రోడ్డుకాడినుంచే యెళ్ళారు."

"ఎందుకు వెళ్ళెనో నీకు తెలియునా?"

"నాతో ఏమీచెప్పలేదు. కాని బండి తప్పిపోతుంది. త్వరగా ఎళ్ళాలని అన్నారు."

వ్రజరాణి గడియారమువైపు చూడగనే ఎనిమిది గంటలు కావ

చ్చెను. అప్పుడామె ప్రేమవతి యొద్దకువెళ్ళి "అత్తయ్యా! మాబాబు నేడు ప్రయాగ వెళ్లుచున్నాడట. మీరుపొమ్మనిన చూచివచ్చెదను. మరల ఎన్నడు చూపులుందునో తెలియదు. మన యింటిదాక వచ్చికూడ ఏలనో తిరిగి వెళ్ళెనని దాసి చెప్పుచున్నది" అనిపలికెను.

"ఇంకను తల దువ్వుకొనలేదు. బొట్టు పెట్టుకొనలేదు. చీరైనకట్టుకొనలేదే, ఎట్లుపోవుదును?"

"తల దువ్వుకొనుటకు కూర్చుండిన ఇక్కడనే పది గంటలగును. అక్కడికిపోయి చూడమనదేమి?"

"సరే, నీమనను. సాయంకాలమునకు మరల తిరిగిరమ్ము. బండివానిని బండితోలుకు రమ్మను. మీపిన్నిని చాలచాల అడిగినానను."

వ్రజరాణి చీరెకట్టుకొని, బండికై మాధవిని పంపి, ఏదియో తటాలున తోచగా "రాధా! ఆయన పోవునప్పుడేదైన ఉత్తరమిచ్చెనా?" అని అడిగెను. రాధ ఉత్తరము తీసి యిచ్చెను. వ్రజరాణి చాల ఆనందముతో తీసికొనెను. కాని దానిని చదివిన తోడనే నవనవలాడు ఆమె ముఖ వికాసము వాడిపోయెను. "ద్వారమువరకు వచ్చినవాడేల మరలిపోయెను? పోయిన, వ్రాసిన ఉత్తరమింత అడ్డదిడ్డముగా ఏలఉండెను! త్వరగా వెళ్లవలయునన్న అవసర మేమంత వచ్చినది? బండి తప్పిపోయిన ఇంక బండ్లులేవా? ఒకటికి పది పోవుచున్నవే. నాకై ఆతడు రెండుగంటలు ఆగలేడా? కాదు, కాదు. ఇందేదో మర్మమున్నది. నావలన ఆతనికేమి నష్టముకలిగెను?" అని తర్కించుకొనుచుండ, "చంద్రుడూ! నేనెట్లు సహింతునురా?" అని వ్యాకులముగా ఆతని యొద్దకుపోయి యడిగిన సమయము స్ఫురణకు వచ్చెను. "ఛీ! నే నిప్పుడు వాని కొఱకు వెళ్లుటకూడ చాల అనుచితము. వానికి నేసంత చులకనగా కనుపడుచున్నప్పుడు, నేను వానికై కలవరించుట వెఱ్ఱితనముకాని వేఱుకాదు. నా ఆదరమును ఆతడు

పాటింపకున్న, నాకీ జంజాటమేల?" అని నిట్టూర్పువిడిచి కూర్చుండి, మాధవినిపిలచి "నేనిపుడు ఎక్కడికినిపోను. బండివద్దని చెప్పుము" అనెను.

## ౧౪

## ౧

అత్తవారింటికి వెళ్లుటకుముందు వ్రజరాణికి సనాతన పతివ్రతా రత్నములకున్న సౌశీల్యము, లక్ష్యశుద్ధి అబ్బలేదు. పతిభక్తికి సంబంధించిన కొన్ని పుస్తకములు పుట్టింటచదివినను, అందలి భావములు ఆమె మనసులో గాఢముగా నాటుకొనలేదు. అక్కడనున్నంతకాలము, "ఈ ఇల్లు నాదికాదు, ఒకనాడు దీనిని విడిచి అత్తవారింటికి వెళ్లవలసిన దానవే" అను తలంపే ఆమెకు లేకుండెను. కాని భర్త గృహమున అడుగుపెట్టి ఆయనను ప్రతినిముషము కన్నులయెదుట కాంచుచుండినహేతువుచే, దినదినము ఆమె చిత్తవృత్తులుమాఱి కలుగవలసిన పరివర్తనములు కలుగుచునే యుండెను. "నాధర్మమేమి? నేనెట్లు ప్రవర్తింపవలయును?" అను విషయములు విచారించి తెలిసికొనిన తక్షణమే ఆమెకు పూర్వావస్థయందలి సమస్తవిషయములు స్వప్నతుల్యములగుచుండెను. తనజన్మలో బుద్ధిపూర్వకముగా చేసిన గొప్ప తప్పిదమును తలంచుకొని 'అయ్యో! నేను బ్రతికినన్నాళ్లు సత్కార్యము లాచరించినను తొలగిపోని మహాదోషము చేసితిని. ఆవిషయమును ఒకింత తలచగనే నాతల అణచుకొనుచున్నట్లున్నదే" అని చింతించి, ఎన్నోవిధముల తనను తానే నిందించుకొనుచు "బాబు ఎదుటకు బోవ నా కాసాహస మెట్లు వచ్చెనా?" యని ఆశ్చర్యపడును. ఆ చెడుతలంపునుకూడ మఱచిపోవుటకు ఎన్నడైన ప్రయత్నము చేసినచో

చంద్రుని సౌమ్యమూర్తి ఆమె కన్నులకు కట్టినట్లు కాన్పించుచు. తక్షణమే ఆమె మనఃపూర్వకముగా నమస్కరించును. కాని, "నేడు కఠినహృదయుడగు చంద్రుఁడు చిన్ననాటిప్రేమను మఱచి నన్ను ఆద రించుట మానుకొనెనా ?'' అని పరీక్షించుటకు మొదలిడి విచార పడుచుండ "వాడు నాముఖముకూడ చూడనొల్లక వ్యతిరేకభావ మును కనపఱచినాడే'' అని తోఁచుటతోడనే, అంతులేని వైమ ఖ్యము హృదయమునం దుద్భవించెను. చంద్రునిమీఁది అనురాగము, గౌరవము మున్నగునవి అంతరించి నిముషములో గాలి కెగిరి పోయెను. స్త్రీల హృదయము లెంత చంచలములు! ఏచంద్రునికై తన ధర్మమునుకూడ నీట గలుపుట కామె యుద్యుక్తురాలయ్యెనో, ఆ చంద్రుఁ డొక్కమాఱు వైముఖ్యము చూపినంతమాత్రమున వ్రజ రాణి క్షమింపజాలకుండెనుగదా! "వాని కిట్టి సంకుచితబుద్ధి ఏల కలి గెనో !'' అను విషయము ఆమె హృదయమునకు కంటకముగా నుండెను.

నేటినుండి రాణికి ఉత్సాహము తరిగి మాంద్య మేర్పడెను. "చంద్రుడు నన్ను మఱచి లేశమాత్రమైన ఆదరించుట కిష్టపడకున్న దిగులుపడి నే నేల శరీరమును కృశింపజేసికొనవలయును? వారికి వీ రెంత దూరమో, వీరును వారి కంతేదూరము. ఈర్ష్యచే నా మొగము చూడనొల్లక భీష్మించి కూర్చుండ నేనుమాత్రము వాని ముఖ మేల చూడవలయును?' అని అనుకొనుచు "నే నికెన్నడు వాని పేరైన నెత్తను. వాని గాలియే నాకు సోకగూడదు'' అని తనపై తానే క్రోధించుకొనుచుండెను. కాని నిముషములోనే ఆమె మనసు వానిపై మరలి వివశ యగుచుండును. హృదయతాపమును, కలుషభారమును పరిమార్చుటకు కమలాచరణుని మిక్కిలి ప్రేమింపఁదొడఁగెను. అతఁ డెక్కడికైన పోయి నిముష మాలస్యముగా వచ్చినను, తప్పుపట్టును.

చాలకాలమునుండి తాను కూర్చియున్న ధనమంతయు నిచ్చి, బంగారుగడియారము, గొలుసు తెప్పించుకొనుడని ఆతనిని ప్రార్థించెను. కాని ఆత డామెమాట వినకపోవుటచే ఆమె మౌనము వహించెను. తనపై వర్షించు ప్రేమామృతమును గాంచి కమలాచరణుడు అచ్చెరువంది ప్రజరాణి పరిచర్యయై చాల ఆదరముతో ప్రవర్తించుచుండెను. ఆతనిమిత్రు లంత ఆశ్చర్యలు గాంచి శంకానలిరి. హామీదుఖాను, ముస్న గుహారు "నీభార్యవంటి ప్రేమకలవారు మాకు లభించలేదు. నీవు అడుగకున్నను ప్రతిదినము కావలసినంత ధనమిచ్చుచుందును. కాని మేము ఇంటికి పోయినవెంటనే మమ్ము వారు వేదించి వేపుకొనితిందురు. మాచేతిలో గుడ్డిగవ్వ లేకున్నను, వారడిగినది తెచ్చి తీరవలసినదే. లేకున్న ప్రాణముమీదికి తెచ్చిపెట్టుదురు. ఎప్పుడైన కొంచెము విశ్రాంతి తీసుకొనుటకు కొంపలోనికి పోవగనే నోటికి వచ్చినట్లు అనరానిమాట లందురు. భగవంతుడు నీ భార్యవంటిదానిని మా కనుగ్రహింపక గయ్యాళిగంపలను కట్టిపెట్టెనురా" అని తమ దైన్యమును వెలిపుచ్చుచుందురు.

భార్యాభర్త లిరువురు దృఢతరప్రేమపాశబద్ధులై మెలగుచుండిరి. కాని, ఉభయులు కలియునపుడు కన్పింపవలసిన హర్షచిహ్నము లేమియు ప్రజరాణిముఖమండలమున కాన్పించుటలేదు. ఆనాటి కానాడు ఆమె పాలిపోయి ఫుల్లయగుచుండెను. కమలాచరణుడు ఎంతో బలవంతముచేసి "నీ వేల చిక్కిపోవుచున్నావు!" అని యడుగుచు ఆమెను ప్రసన్నురాలుగా చేసికొనుటకై యెన్నో ఉపాయములు స్వయముగా యోజించుచు తనకు తోచకున్న యుగంధరతుల్యులగు తనమిత్రుల యుపదేశములుకూడ తీసుకొనుచుండెను. కాని, అన్నియు నిష్ఫలము లగుచుండెను. అవన్నియు చూచి ప్రజరాణి చిఱునవ్వుతో "మీరు శాంతముగా నుండుడు. నేను బాగుగానే ఉన్నాను"

అని పలుకుచు దువ్వెనతో ఆతని తల దువ్వును. లేదా, వీవనతో విసరును. ఆ యుపచారములకు కమలాచరణుఁడు ఉబ్బి తబ్బిబ్బు లగుచుండును. కొయ్యకు రాచినతారు పురుగులను రానీయక క్రమముగా కొయ్యనే తాను తినివేయునట్లు "చంద్రుఁడు నన్ను మఱచి అణుమాత్రము పరిగణించుటలేదు" అను విచారము ఆమె హృదయమును వేధించుచుండ రోజురోజు ఆమె యవస్థ చాల విచారకరముగా నుండెను. ఆమె మంచముపైనుండి లేచుటకూడ కష్టముగా నుండుటచే డాక్టరు వచ్చి చికిత్స చేయుచుండెను.

పూర్ణచంద్రుఁడు ప్రయాగలో శ్రద్ధతో చదువుచుండెను. వ్యాయామక్రీడలం దాతనికి ప్రావీణ్యముండుటచే పట్టణమున ఆతఁడన్న నెక్కుడ అభిమానము కలదు. మనఃక్లేశమును నివారించుటకు శరీరపరిశ్రమకన్న మహౌషధము మఱియొకటి లేదు. అందువలన చంద్రుఁడు కసరత్తు చేయుచు, సాయంకాలమున క్రికెట్టు, ఫుట్ బాల్, చెడుగుడు మున్నగునవి చాలసేపటివఱకు ఆడుచునే యుండును. తరువాత ఒకగంట ఉద్యానవనములో విహరించును. అంతటి గాఢపరిశ్రమ చేసి మంచముపై వ్రాలగనే వెంటనే నిద్రపట్టి ఉదయము సూర్యోదయానంతరము మేల్కొనును. అట్లాఱుమాసములు అభ్యాసము చేయగనే ఆతఁడు క్రికెట్టు, ఫుట్ బాల్ మున్నగు ఆటలందు మొనగాఁడయ్యెను. రెండు మూఁడు పోటీపందెములు గెలిచి నగరములో చాల ప్రసిద్ధి చెందెను.

నేఁడు నిపుణులగు అలీఘరు క్రికెట్టుజట్టువారితో పోటీపడెను. వారు భారతవర్షమునందు ప్రసిద్ధిచెందిన ఆటకాండ్రను ఓడించి విజయధ్వజమును చేబూని ప్రయాగ కూడ వచ్చి పందెమువేసి తప్పక గెలుతుమని మైమఱచి యుండిరి. కాని ప్రయాగవారును వెనుకాడుచుండుటలేదు. "అఱగంటకాలము రంగస్థలమున నిలువబడిన ఎన్నో

రన్నులు చేయును" అని అందఱు చంద్రునిపై ఆశపెట్టుకొని యుండిరి. చంద్రుఁ డింతవఱకెన్నఁడు నిట్టి గొప్పపోటీకి తలపడియుండలేదు. అందుచేత నది యేమగునో యని అతని హృదయము దడదడలాడు చుండెను. సరిగా పదిగంటలకు ఆట ప్రారంభమయ్యెను. మొదట అలీఘరువారి వంతు వచ్చెను. రెండున్నఱగంటలవఱకు వారు తమ నైపుణ్యము చూపిరి. ఒంటిగంట యగుటతోడనే సగమాట యయ్యెను. అప్పటికి వారు నాలుగువందలు రన్నులు చేసిరి. తరువాత ప్రయాగవారి వంతు వచ్చెను. కాని ప్రత్యర్థుల నైపుణ్యమును చూచి వారి కాళ్లు చేతులు గడగడ లాడెను. తా మిక గెల్వలేమని సంపూర్ణముగా వారు అధైర్యపడిరి. ఇక పోటీచేయుట యసంభవముగా నుండెను. మనుష్యమాత్రుఁ డెవ్వఁడైన ఇంతకాలములో ఇన్ని రన్నులు చేయగలఁడా? చంద్రుఁ డొక్కఁడు చాకచక్యము కలవాఁడైనంత మాత్రమున నేమగును? మొదట ఒక యాటగాఁడు వచ్చి మూఁడు విసరులలో సెలవుపుచ్చుకొనెను. రెండవవాఁడు వచ్చెను. ఆతఁడును నిక్కి నీలిగి ఐదుసారులు వేసెను. మూఁడవవాఁడు వచ్చి మొదటి పర్యాయమే కూర్చుండెను. నాల్గవవాఁడు మూఁడు హిట్లు కొట్టి తరువాత నిలువజాలకపోయెను. ఐదవవాఁడు కాలేజి దొర. కాని ఆయన యాటలు సాగలేదు. అందుచే గప్పున బంతి విసరి వెళ్లెను. చివరకు చంద్రుఁడు బ్యాటు త్రిప్పుకొనుచు ఆటలోని కడుగిడెను. ఇరుకక్షుల యోధు లందఱు మహోత్సాహముతో కరతాళధ్వనులు చేసిరి. ప్రయాగయోధు లందఱు చంద్రునిమీఁద ఆశలు పెట్టుకొని యుండిరి. అచ్చట చేరినవారి మనస్సులలో ఆందోళన తీవ్రము కాఁజొచ్చెను. నలుదిశలందును చీమ చిటుకు మనుటలేదు. కొందఱు దూరముగా కూర్చుండి "చంద్రునకు విజయము లభించుగాక!" యని భగవంతుని ప్రార్థించుచుండిరి. మొదటిబంతి వచ్చుటతోడనే చంద్రుఁడు దానిని

పోనిచ్చెను. అందువలన ప్రయాగవారి హృదయములు చల్లపడెను. రెండవబంతి వచ్చెను. దానిని అట్టులే పోనిచ్చెను. అపుడు చాలమంది గొడుగులు ముడుచుకొని యిండ్లదోవ బట్టిరి. ఇంతలో మూడవబంతి వచ్చెను. 'తాక్' అను గగనభేదకమగు శబ్దముతో బంతి 'హిట్' యందున్న ఆటగానికి నూఱుగజముల దూరమున బడెను. నలుదిశలనుండి కరతాళధ్వనులు మ్రోగెను. కృశించు పైరునకు వర్ష మబ్బినట్లుండ పోవువా రందఱు వెనుకకు మరలి యానందముతో చూడసాగిరి. నిరాశాపూరిత హృదయక్షేత్రములందు ఆశాంకురములు చిగిర్చెను. రెండవబంతి వచ్చెను. మొదటిదానికన్న నది యిరువదిగజముల దూరమున పడెను. 'ఫీల్డరులు' ఉలికిపడి 'హిట్' నకు సాయము చేసిరి. ఐదవబంతి వచ్చెను. కాని యది ఎలపై పడెను. ఇంతలోనే 'ఓవరు' అయ్యెను. బౌలరులు మాఱిరి. క్రొత్తవారు ప్రత్యక్షఘాతకులే. ప్రత్యర్థులు బంతి విసరుచుండిరి, కాని చంద్రుఁడు వారి తొలిబంతినే పైకి ఎగురుకొట్టి సూర్యునితో పరిచయము చేసెను. మఱియొకబంతి వచ్చెను. దానిగతియు నదేవిధ మయ్యెను. బంతి వచ్చి వచ్చి బ్యాటుకు తగిలి వచ్చినత్రోవను చెవులు జాడించుకొనుచు ఒకప్పుడు పడమరకు, మరొకప్పుడుత్తర దక్షిణములకు పోవుచుండెను. పరుగిడ పరుగిడ 'ఫీల్డరులకు' ఎగరొప్పు కలిగెను. ప్రయాగవారు వార్షోత్ఫుల్లచిత్తులై తాండవించుచు 'జయజయ' ధ్వనులు చేయుచుండిరి. టోపీలు పైకి ఎగురుచుండెను. ఒకఁడు రూపాయలు, మరొకఁడు గడియారఫు బంగారుగొలుసు పైకెగురవేసిరి. విపక్షులు దుర్గతి పట్టి 'దేవుడా' యని లోలోపల కుళ్లుచుండిరి. వారప్పుడప్పుడు మండిపడుచు ఆటలోని విధానములను, బౌరులను మార్చుచు ఆగ్రహమును వెళ్లబోసికొనుచుండిరి. కాని వారి చాతుర్యము, క్రీడాకౌశల మంతయు నిరుపయోగ మగుచుండెను. బంతికి బ్యాటుకు చాల మైత్రి చేకూరినట్లు

మాటిమాటికి అన్యోన్యాలింగనములు జరుగుచుండెను. చంద్రుఁడు నడుము కట్టుకొని యొంటరిగా ఒక్కపెట్టున రెండుగంటలవఱకు బాంబులను, ఫిరంగులను, తుపాకులను వదలినట్లు 'ఠాప్ ఠాప్' అని బంతిని కొట్టుచునే యుండెను. చంద్రబింబమునకై దూకెడు బాలుర వలె ఫీల్డరులు బంతిపైకి దూకుచుండిరి. రన్నులు మూఁడువందలకు మించుచుండ, విపక్షుల నడుములు పడిపోయెను. గుండెలు దడదడలాడుచున్నందున ఒకసారియైన బంతి తిన్నగా రాకుండెను. ఇట్లుండ చంద్రుఁడు మఱి యేబదిరన్నులు చేసెను. చాల అలసియుండుటచే "కొంత విశ్రాంతి ఇండు" అని చంద్రుఁడు మధ్యవర్తి నడిగి యీవలకు వచ్చుచుండుట చూచి జను లందఱు ఆతనిని సమీపించి వంతుల ప్రకారము ఎత్తుకొనిరి. నలుదిశలందును కోలాహలము వ్యాపించెను. వేలకొలఁది గొడుగులు, బెత్తములు, టోపీలు, పాదరక్షలు పైకెగిరి పోయెను. అవియును ఉత్సాహము పట్టజాలక పైకెగురుచున్నవాని వలె కనుపడెను. అట్టి యుత్సవసమయమున తంతిసేవకుఁడు తొక్కుడు బండిపై వచ్చి "అయ్యా! మీలో ప్రతాపచంద్రుఁడు ఎవ్వరు?" అని యడిగెను. చంద్రుఁ డులికిపడి వానివైపు చూడ ఆతడు చంద్రునకు కవరు నిచ్చెను. దానిని విప్పి చదువుటతోడనే చంద్రుని ముఖము పాలిపోయెను. నిట్టూర్పు విడిచి కుర్చీపై కూలఁబడి "మిత్రులారా! ఇక ఈ పోటీని ముగించు భారము మీమీఁదనే యున్నది. నేను ఈ మెయిలులో ఇంటికి పోయెదను" అని బయలుదేఱెను. ఎందఱో మనుష్యులు దీనవదనములతో "ఏమి", "ఏమి", అని వితర్కించుకొనుచుండిరి, కాని యతని నడుగుట కొక్కనికిని అవకాశము చిక్కకుండెను. వెంటనే చంద్రుఁడు ట్రాములో నెక్కి రయిలుదగ్గఱకు పోయెను. దారిలో లేసిపోని తర్కవితర్కములు వాని మనస్సులో బయలుదేఱెను. ఇంటిదాకను వెళ్లి యామెను చూచి రాక తాను

చేసిన క్రూరకృత్యమునకు పలుమారు తన్ను నిందించుకొనెను. "ఇప్పుడు నా కామె దర్శనము అబ్బునో అబ్బదో! భగవంతుడా! నన్ను అట్టి చిన్నచూపు చూడవలదు. ఒకవేళ అట్లే జరిగిన ఏదైన విషము పుచ్చుకొని ప్రాణములు విడిచెదను. కాని ఈ శరీరముతో ప్రపంచములో సంచరింపజాలను" అని మిక్కిలి దుఃఖించెను. రాత్రి తొమ్మిదిగంటలకు బండి కాశీ చేరెను. ఎక్కడ నిలువక యకాయకిని శ్యామాచరణుని ఇంటికి పోవుచుండ ఉత్తుంగచింతాతరంగములచే నతని కన్నుల వెంట అశ్రుబిందువులు పుంఖానుపుంఖముగా పరతెంచుచుండెను. హృదయము దడదడ కొట్టుకొనసాగెను. శ్యామాచరణుడు పడకకుర్చీలో జారగిల పడియుండ కమలాచరణుడు డాక్టరుకొరకు పోవనుండెను. చంద్రుని చూచినతోడనే ఆతడు కౌగిలించుకొనెను. శ్యామాచరణుడు కూడ చంద్రుని కౌగిలించుకొని "ఇప్పుడే ప్రయాగనుంచి వచ్చుచుంటివా?" అనెను.

"అవును. ప్రజరాణి జబ్బుగా ఉన్న"దని అమ్మ నేడే తంతిఇచ్చినది. ఇప్పుడును అట్లే ఉన్నదా? ఏమైన కొంచెము తగ్గినదా?"

"ఏమి చెప్పుదును? ఇప్పటికి రెండుమూడు మాసములనుండి ఆనాటి కానాడు దిగనాశిల్లుచున్నది. మందుమ్రాకు లెన్ని ఇప్పించినను కొంచెమైన లాభము కనుపడుటలేదు. ఇంతకు భగవదిచ్ఛ యెట్లున్నదో తెలియదు. డాక్టరులు క్షయరోగ మనుచున్నారు. నాటు వైద్యులు అదేమియు కాదు కాని హృదయదౌర్బల్యము మాత్రమే అనుచున్నారు."

చంద్రుడు వచ్చినాడని విన్నతోడనే ప్రజరాణి హృదయములో భయము, ఆశ రెండును ఒకటిపై నొకటి స్వారిచేయుచుండెను. "ఇంటికి పోవ పిన్ని మారాముచేసి పంపగా ఇచ్చటికివచ్చినాడేమో! లేకున్న నాదురవస్థవిని అనురాగము లేనివాడైనను కొంచె ముద్విగ్నత

చెంది వచ్చినాడేమో! కాదు కాదు. నా అవస్థ చెవినిపడగనే యింత ఆర్భాటముగా వచ్చుటకు వాని పుట్టెమి మునిగినది ? లేకపోయినను మరణించుటకు సిద్ధముగా ఉన్నదని తలచి లోకములో అందరితో పాటు ఒకసారి నామకార్థము చూచి పోవలయునని వచ్చెనేమో ? అట్లనుకొనుటకు నేను మరణించినను, జీవించినను వానికేమి ? వాని వలెనే వెనుకముందాడక, జంకక, అనవలసిన నాలుగుమాటలు ఎదుటనే అనితీరెదను—ఛీ, మాటలవలన ప్రయోజనమేమి ? అతఁడు వచ్చి మాట్లాడక నిలువబడిన నే నేల పలుకరింతును? ‘బాగుగానే ఉంటిని. నీ క్షేమమే కోరుచుంటిని’ అని మాత్రము పలుకగలను. అటుమీద నోరు తెఱువనైన తెఱువక మంచములో పరుందును. చినిగి మాసిన చీరె కట్టుకొంటి నెందుకు? నామీఁది అనురాగమును విధ్వంసముచేసిన పాషాణహృదయుఁడు, విశ్వాసఘాతకుడు నగు వానియెదుట శృంగారముగానుండ నాకేమి అవసరము వచ్చినది ? ఆతడు అతిథిగా వచ్చినపుడు నేనును అదేవిధమున సత్కరింతును !” అనుకొనుచుండెను. మానవహృదయ మెంత చంచలమైనది! ఏమానవుడు దయాదాక్షిణ్య రహితమగు విషబుద్ధిచే ప్రజరాణి కిట్టి దురవస్థ కల్పించెనో అట్టి వానిని నొప్పించుట కామె ఎట్టి పన్నాగములు పన్నుచున్నది ! !

పదిగంటలు కొట్టిరి. మాధవి పక్కలో కూర్చుండి విసనకఱ్ఱతో విసరుచుండెను. మందుసీసాలు చిందరవందరగా పడియుండెను. ప్రజరాణి మంచముపై పరుండి “చంద్రుఁడు ఇంటిలోనికి వచ్చెనోలేదో” అని విచారించుచుండెను. ఇంతలో మాధవి తటాలున లేచి “అక్కయ్యా! వచ్చిరి లెమ్మ” అనెను. వెంటనే ప్రజరాణి మంచముపైనుండి లేవబోయి తూలి పడిపోయెను. చంద్రుఁడు పావనహస్తములతో ఆమెను లేవదీసి మంచముపై చక్కగా కూర్చుండబెట్టెను. నేఁటికి కొన్ని మాసములక్రిందటివఱకు బంగారుబొమ్మవంటి శరీరము,

ముఖలావణ్యము, చిఱునగవు, కోకిలస్వరము, మధురవాక్కులు కలిగి ఆనందదాయకముగా నుండిన వ్రజరాణి నేడు ఎముకలు బయటపడి గుర్తించుటకు సాధ్యము కాకుండెను. ఇట్టి విపరీతావస్థయందున్న రాణిని చూచి చంద్రుడు కన్నీరు నించెను. కుశలప్రశ్న వేయ బోయెను కాని నోటినుండి "వ్రజరాణీ" అను మాటమాత్రమే వెలువడెను. అశ్రువులు క్రింద రాలెను. అనురాగభరితములగు కన్నులు మనోభావములకు అద్దములవంటివి. వ్రజరాణి కన్నులెత్తి చంద్రుని కన్నులనుండి దొరలెడి బాష్పములు చూచినతోడనే, ఆమె మనోమాలిన్య మంతయు తొలగిపోయెను. శత్రుసైన్య మేకమై యుద్ధ సన్నాహముతో నెత్తిమీదికి వచ్చినపుడు ఊపిరాడక కర్తవ్యమును మఱచి నిశ్చేష్టితుడై యుండు సేనాపతివలె, వ్రజరాణికూడ చంద్రుని ఎట్టయెదుట చూచినప్పటికి తా నంతవఱ కాలోచించి యుంచుకొనిన యూహ లన్నియు మఱచిపోయెను. చంద్రుడు విచారపడుచు తన యవస్థను చూచి వాపోవుచున్నాడని తలచి వ్రజరాణి మనస్సులోని ఈర్ష్య విడిచి మంచముపైనుండి లేచి పైటచెఱగుతో ఆతని కన్నీళ్లు తుడిచెను. విశ్వాసఘాతకుడని, అపరాధియని యెంచిన చంద్రుడు పరమాప్తుడై ప్రవర్తించినాడు. తన్ను శల్యముగా కృశింపజేసి మంచముపాలు చేసినవానినిచూచి వ్రజరాణి యేడ్చుచు "చంద్రుడూ! ఏడువకు. నేను క్షేమముగా ఉన్నాను" అనెను. కాని, ఆమె యీదురవస్థలో నుండుటకు కారణ మతడు కాడని తలచెకాబోలు! స్త్రీల గ్రహణశక్తి యెంత కోమలము! చంద్రుడు చేసిన యొక చిన్ని పొరపాటువలన వ్రజరాణి మంచముపట్టి ప్రాణములు విడచుటకు సిద్ధపడెను. చాలరోజులనుండి రక్తనాళములందును హృదయమందును చరచరలాడెడు క్రోధాగ్ని, సంతాపము, వేదన మున్నగునవి నేడు కొన్ని యశ్రుబిందువులను కాంచిన వెంటనే స్వయముగా ఉపశ

మించెను. యోగ్యతాపత్రములందిన డాక్టరులు, సమస్తగ్రంథములు తిరుగవైచిన వైద్యులు నయము చేయజాలని రోగమును కేవల మొకటి రెండశ్రుబిందువు లాశ్చర్యకరముగా కుదిర్చెను. అవి సాధారణమైన అశ్రుబిందువులా ? కావు కావు. దేవలోకమునుండి తొణికి వచ్చిన అమృతబిందువులు ! చంద్రుడు ధైర్యము వహించి

"ప్రజారాణీ ! నీ విట్టి దురవస్థ నేల తెచ్చిపెట్టుకొంటివి ?" అని యడిగెను.

రాణి నవ్వి "నేను తెచ్చిపెట్టుకొనలేదు. నీవే తెచ్చిపెట్టితివి" అనెను.

"అమ్మ యిచ్చిన తంతి ముట్టకున్న నా కీసంగతి అసలు తెలియనిదే !"

"తెలియవలసిన అవసరమేమి ? ఎట్లైన మఱచిపోవ సంకల్పించుకొనియే ప్రయాగ వెళ్లిపోయిన నీకు నాచావుబ్రతుకులవలన ఏమి చింత కలుగును ?"

"నీకు నీ వట్లనుకొనేవు కాని ఒక యుత్తరమైన వ్రాసినపాపమున బోతివా ? పరాయివాడనను ఉపేక్షయేకదా కారణము ?"

"నీ వంతదూరమునుండి నావద్దకు ఆతురతతో వచ్చెదనను సంగతి నాకేమి తెలియును ? ఇంటిముంగటకు వచ్చి మొగమైన చూపక చీటిముక్క పంపినవానికి ఉత్తరములు వ్రాసినను లాభమేమి ?"

"అప్పుడావిధమున ఎంత దుఃఖముతో ఏల తిరిగిపోతినో నీకేమి తెలియును ? అప్పటికిని నీయొద్దనుండి ఒక యుత్తరమైన రాకుండుట చేత నన్ను పూర్తిగా మఱచియుందువనియే తలచితిని."

"నీవు చెప్పిన దంతయు సత్యము కావచ్చును."

"ఏమైన అనుకొనుము. ఇంతకుగత జలసేతుబంధన మెందుకు ? ప్రస్తుతము నీ శరీరములో ఎట్లున్నదో చెప్పుము. నేను వచ్చుట

తోడనే గుర్తింపజాలని అవస్థలో నుంటివేల ?"

"తగిన ఔషధము లభించినది. ఇక బాగగును."

చంద్రుఁడీసంకేతమును గమనించి "నేను రవ్వంతలోపము చేయుగనే ఎట్టి ప్రళయము సంభవించినది" అని తలఁచి చాలసేపు ఆమెను బుజ్జగించుచు కూర్చుండెను. ఉదయమున నతఁడు ఇంటికి బయలు దేఱగనే ప్రజరాణివదనము వికసించియుండెను. చంద్రుఁడు తన్ను మఱువక తలఁచుకొనుచు, మొదటివలె ఆదరించుచున్నట్లు నమ్మెను. చాలదినములనుండి బాధించుచు ఇట్టి దురవస్థ కల్పించిన కంటకమును ఆతఁడామె హృదయమునుండి తొలగించెను. వారమురోజులకే ప్రజరాణి బంగారు మేనికాంతితో నిండు సొబగున హాయిలు గుల్కుచు ఎన్నఁడు జబ్బు పడనిదానివలె వెలుఁగొందుచుండెను.

౧౫

రోగి జబ్బుగా నున్నంతవఱకు ఎవ్వరు "నా బాధ మానిపి తప్పింతురా? ఎవ్వరు నాయగచాట్లు చూడవత్తురా" యని వాపోవుచు మఱేవిషయము పట్టించుకొనక అవస్థపడుచుండును. కాని, వ్యాధి యుపశమించినపిదప తన కుపచారము చేసినవారిని, మందు ప్రమాకు లిచ్చి సాయపడినవారిని అనేకవిధముల కొనియాడుచు వారిపై చాల ప్రీతితో నుండును. అట్లే ప్రజరాణి మంచముపట్టి యవస్థ పడుచు కమలాచరణుని పేరైన ఎత్తకుండెను. కాని కర్త నిర్వాహణమనుకొనుఁడు, నిష్కపట ప్రేమ యనుకొనుఁడు, పతిసేవయందామె లేశమైన లోపము చేయుటలేదు. పడిలేచినది మొదలు ఆమె హృదయేశ్వరుని సపర్యలు చేయుచు, ఆతని పరిచర్యానుగుణముగనే సంచరించుచుండెను. కాని "సాటి

లేని యుపకారముచేసి నాప్రాణము నిలిపినవాని కేవిధమున ప్రత్యుప కారము చేయుదును?—భక్తి శ్రద్ధలవలన ఆయనను సుఖపెట్టుటే నా పరమ ధర్మము. కాని ఎట్లు? సుఖపెట్టుటకు మారు ఆయన ప్రాణాంతకు రాలనగుదునేమో? ఆయన నన్ను మనఃపూర్వకముగా ప్రేమించును. నేనో, నాధర్మము నిర్వర్తించుటలో అన్నివిధముల చేతకాని దాననగుదును. పైన ఈశ్వరుడున్నాడు. ఆతనికి నా మొగమెట్లు చూపుదు?" అని యామె దిగులుపడెను. రూపయౌవనములు, ధన సంపదలు, ప్రభుత్వము మున్నగునవి స్వాభావిక ప్రేమబీజముల నాటుటకు అసమర్థములగుచున్నచోట తరుచుగా ఉపకారమే తనప్రభావమును కొనసాగించు కొనగలదు.

కమలాచరణుని ప్రేమ అనుదినము అభివృద్ధినొందజొచ్చెను. ప్రేమ కొరకును, ధర్మమున కొరకును దాస్యము చేయుచుండిరి. ప్రజరాణి యేమాటచెప్పినను కమలాచరణుఁడు నిమిషమయినను ఆలస్యముచేయఁడు. ఆతఁడు తనకార్యతత్పరతయు, కౌశలమును పత్నీ సౌకర్యములందే వినియోగించుచుండెను. తల్లిదండ్రుల కన్నీళ్లు తుడుచుటకు ఏదోకొంచెము పుస్తకములంటుకొనుచు భార్యనోటినుండి యేవేళ కేమాట వెలికివచ్చునో దానిని నెరవేర్చుటకు సర్వదా నడుముకట్టుకొని యుండును. వారియింటివెనుక ఉద్యానవనములో మాధవి పూలు కోయుచుండుట ఆతడు చూచెను. ఆతోట ఇంటిలోనివారి కెవ్వరికిని శ్రద్ధలేకుండుటచే నీళ్లులేక పూలచెట్లన్నియు ఎండియుండెను. ప్రజరాణికి పూలమీఁద చాల మక్కువయుండుటచే వానికి కొంచెము నీరు పోయుచుండవలసినదిగా మాధవిని సైగచేసెను. కొన్నాళ్లకు తోట నవనవలాడుచు చెట్లన్నియు వివిధపుష్పములతో శోభిల్లసాగెను దీనికంతకు కారణము కమలాచరణుఁడే. ఆతనికి 'ఈపనిచేయు'మని వేరే చెప్పనవసరములేదు. ఇట్టి సైగచేతనే ఉద్యానమునకు తన

శరీరప్రాణము లర్పించి శోభిల్ల జేసెను. ప్రత్యేకముగా దానికి నేర్పరులగు నిరువురు మాలీల నుంచెను. రకరకముల మొక్కలు తెప్పించి నాటించెను. రంగురంగుల గడ్డి, ఆకులు, తెప్పించి యలంక రింపజేసెను. మడులు, తొట్లు, కాల్వలు, మున్నగునవి చక్కగా నుంచెను. అడుగడుగున లేదీగెలు దట్టముగా అల్లుకొని చలువపందిళ్ల వలెనుండెను. కమలాచరణుఁడు చేతపుస్తకము పట్టుకొని రోజంతయు ఉద్యానవనములో విహరించుచు దానిశోభ నింకను వృద్ధిచేయుటకు మాలీలను హెచ్చరించుచుండును. ఇట్లుచేయుటకు హేతువేమి? భార్య ప్రేమామృతమును తనివితీర ఆస్వాదించుటకే! ఒకనాఁడు కమలాచరణుఁడు "తోటలో షికారు చేయించెదరమ్ము" అని వ్రజ రాణిని తీసికొనివెళ్ళెను. అపుడు చంద్రోదయ మగుచుండెను. వనము లోని పుష్పవృక్షములన్నియు ఆ ధవళకాంతిలో విలీనమై తళతళ లాడుచుండెను. చల్లగాలి మెల్లగా వీచుచుండెను. తెల్లనిమల్లెలు పరి మళమును వెదజల్లుచుండెను. అట్టిమనోహర సమయమున వ్రజరాణి పట్టుచీరె కట్టుకొని కాలికి స్లిప్పరులు తొడుగుకొని గట్లపై విహరిం చుచు గోచరించెను. ఆమె వదనవిలాసము పుష్పసౌరభమును సిగ్గిల చేయుచుండ వనదేవతవలె ఆమెపొడకట్టుచుండెను. అప్పుడు కమలాచర ణుఁడు 'ఆహా, నేటికి నాశ్రమయంతయు ఫలించినది' అనెను. కుసుమ ములందు పరాగము తాండవించునట్లు ఆమె నయనములందు ఆనందబాష్పములు తాండవించుచుండ నామె దరహసిత వదనయై యేమియు పలుకక మిన్నకుండెను.

కమలాచరణుఁడు "నావంటి యదృష్టవంతు డీప్రపంచములో నెవ్వడైన కలడా" అనెను.

"నావంటిదో"

కమలాచరణుఁడు ఆనందోన్మత్తుడై భార్యను గట్టిగా ఆలింగనమ్ము

చేసికొనెను. కొన్నాళ్లవఱకు వీరి కిదే నియమముగానుండెను. కాని ఇంతలోనే మనోరంజన సామగ్రులుకూడ లభించెను. రాధాచరణుఁడు కొన్ని ఫొటోల ఆల్బములు ప్రజరాణికి బహుమానముగాపంపెను. అందు చాలఫొటోలు చంద్రవే. దగ్గఱ కూర్చుండి బిడ్డచేత పాఠములు చదివించుచున్నట్లు ఒకటి, ఉత్తరము వ్రాయుచున్నట్లు మఱొకటి, పురుషవేషమున ఇంకొకటి; ఇట్లెన్నోయుండెను. రాధాచరణుఁడు ఫొటోతీయుటయందు చాలనేర్పరి యగుటచే అవన్నియు స్వయముగా తీసిపంపెను. వానిని ప్రజరాణిచూచి చాల ఆనందించెను. నేనుకూడ ఈకళ నభ్యసించి యిట్లే ప్రజరాణి ఫొటోలను తయారుచేసిన బాగుగా నుండునుగదా! "ఆలస్యం అమృతంవిషం" అనుకొని "కెమెరా" మొదలయిన పనిముట్లు పంపవలసినదిగా అన్నకు కమలాచరణుఁడుత్తరమువ్రాసెను. తానుమెల్లగా ఫొటోలు తీయుట అభ్యసింప నారంభించెను. ఇంటినుండి "బడికివెళ్లుచున్నాను" అని బయలుదేఱి దోవలోని పారసీవాని ఫొటోగ్రాఫు దుకాణములో కూర్చుండును. అట్లు మూఁడునాలుగు మాసములు గడువగనే ఆతడీవిద్య కొంతనేర్చుకొనెను. కాని యీసంగతి యింట నెవ్వరికి తెలియదు. అనేక పర్యాయములు ప్రజరాణి "సెలవులలోకూడ ఇంటిలో పగటివేళనయిన నుండక ఎక్కడికి పోవుచున్నారు" అని యడుగగా ఏదియో జవాబుచెప్పి యతడు వెళ్లుచుండెను.

ఒకనాఁడు కమలాచరణుఁ డెక్కడికోపోయెను. చంద్రునకు ఉత్తరము వ్రాయవలయుననుకొని ప్రజరాణి కాగితమునకై పెట్టెతెరచెను. కాని కాగితములేదు. మాధవిని పిలిచి "బావగారి పెట్టెలో కాగితమున్న పట్టుకొనిరమ్మ" అనిచెప్పెను. మాధవి పరుగెత్తి పోవగనే యక్కడ డస్కుపై ఫొటోల ఆల్బముండెను. వానిని తీసుకవచ్చి ప్రజరాణితో "అక్కయ్యా! ఈ బొమ్మలుచూడు. ఎంతఅందముగా

ఉన్నవో" అని యిచ్చెను.

వ్రజరాణి సావధానముగా మొదటి ఫొటోను చూచెను. అది తనఫొటోవలె నున్నందున చాల ఆశ్చర్యపడెను. అందు ఆమె పందిరిమంచముపై దుప్పటికప్పుకొని గాఢనిద్రపోవుచుండెను. ముంగురులు లలాటమున చిందరవందరగా పడియుండెను. పెదవులపై మందహాసరేఖ యంకురించియుండ ఏదో ఉత్సాహకరమగు స్వప్నము చూచుచున్నట్లుండెను. ఫొటోక్రింద "ప్రేమస్వప్నము" అని వ్రాయబడి యుండెను. "ఇట్టిఫొటో ఎట్లు ఎవరిచేత తీయించెను? ఫొటోగ్రాఫరు నేమైన లోపలికి తీసుకొనివచ్చెనేమో? కాదుకాదు. వారట్లేల చేయుదురు? స్వయముగా తీసెనేమో, అందుకనియే పరిశ్రమ చాల గోప్యముగా చేయుచుండిరి" అని అనుకొని యామె రెండవపుట త్రిప్పెను. అందుకూడ ఆమె ఫొటో యుండెను. చీరె కట్టుకొని కుడిచేతితో పయిటకొంగును నెత్తిమీదనెత్తిపట్టుకొని యుద్యానవనమందు విహరించుచుండెను. దానిక్రింద "ఉద్యానవన విహారము" అని వ్రాసి యుండెను. మూడవపుట త్రిప్పెను. అదియు ఆమెదే. అందు ఉద్యానవనములో కూర్చుండి గుసుమమాల గ్రుచ్చుచుండెను. అది మొదటి మూడుఫొటోలకన్న చాల అందముగా నుండెను. ఫొటోగ్రాఫరు తన కళాకౌశలమును నిరూపించి సహజవర్ణములు నింపియుండెను. దానిక్రింద "ముగ్ధమాలిని" అని వ్రాసి యుండెను. ఎన్నడో వ్రజరాణి కూర్చుండి పూలదండను గ్రుచ్చుచుండ దగ్గఱనున్న నీలకుంజమందుండి కమలాచరణుడు మందహాసము చేయుచు కానుపించెను. ఆనాడే యీ ఫొటోతీసి యుండుననుకొని నాల్గవపుట తీసెను. వెంటనే యందుండి మహాసమ్మోహనకరమగు అద్భుతదృశ్యము కానుపించెను. స్నిగ్ధతరంగములు రేచుచున్న సరోవరము ఒడ్డున చూపుమేర వఱకు గులాబిమొక్కల బారులు కన్నుల పండుగగా నున్నవి. అదేదియో

పాశ్చాత్య అనుకరణముగా నుండెను. ఆల్బమందింకెన్నో యుండెను. కాని ప్రజరాణి వానిని చూడలేదు.

తన ఫొటోలు మఱియొకసారి చూచి తన చక్కదనమునకు తానే సంతోషించు అంగనవలె ఆమె దర్పముతో ఆనందించుచు ఫొటోల ఆల్బమును దాచిపెట్టెను. సాయంకాలమునకు కమలాచరణుఁడు వచ్చి చూడగా ఫొటోలు కనబడలేదు. ఎన్నో నెలలనుండి కఠినవిద్య నభ్యసించి ఫొటోలు సిద్ధపఱచి ప్రజరాణిని బహూకరించి యనురాగమందగ్రస్థానము వహింపనున్న కమలాచరణునకు అపుడు ప్రాణములేపోయినట్లుండి చాల వ్యాకులపడెను. లోపలికి పోయి ప్రజరాణి నడుగగా ఆమె విదలించి కొట్టెను. పాప మాతఁడు ఎంతో గాబరాపడి తన మిత్రు లెవ్వరైన తీసికొనిపోయిరేమో యని వారిని కూడ అడిగెను. కాని వారును లేదనిరి. నిరాశ చేసికొని సాయంకాలమునకు కొంప చేరగనే "నేనే ఫొటోలు తీసితిని" అని ప్రజరాణి యనెను. ఆవిధమున వా రిద్దరు ఎన్నో వింతవింతలగు పనులు చేయుచు రోజులు గడుపుచుండిరి. ప్రేమక్షేత్రమున "నేను ముందు, నేను ముందు" అని పందెములు వేసి పరుగెత్తుచుండిరి. కాని ఇరువుర ప్రేమకు చాల తారతమ్యము కలదు. కమలాచరణుఁడు ప్రేమోన్మాదమున తనను కూడ మఱచుచుండెను. ప్రజరాణి తన ధర్మములు నిర్వహించుచుండెను.

తరువాత మూఁడు సంవత్సరములు సుఖప్రదముగా గడచినవి. అనంతరము ఆపదలు ప్రారంభమాయెను. చలికాలమయినందున ఈదురుగాలి తోలుచుండెను. బావులలో నీరంతయు గడ్డకట్టుచుండెను. అప్పుడే ప్లేగురోగము ప్రారంభించెను. వేలకొలఁది జనులు దాని కాహుతి యగుచుండిరి. ఈ వ్యాధికి మొదటిరోజు తీవ్రముగా జ్వరము తగిలి బొబ్బ పొక్కును. బొబ్బ కాన్పించినవాఁడు మృత్యుమందిరమునకు అతిథి కావలసినదే. ఆపుదల లేదు. డాక్టరుల యాటలు

సాగవు. ఎన్నో యిండ్లలోని దీపము లారెను. ఎందరో బాలకులు యువతులు అనాధలయి పోయిరి. త్రోవ చిక్కినవాం డెల్ల తప్పించుక పోవలసినదే కాని ఇతరులతో సంబంధము పెట్టుకొనుటలేదు. ఎవరి గతి వారిదే. సానుభూతి చూపువారు లేరు. తల్లి దండ్రులు బిడ్డలను విడచిరి. స్త్రీలుపురుషసంబంధము త్రెంపుకొనిరి. సందుగొందుల లోను, ఇండ్లయం దెక్కడ చూచినను పీనుగలు కుప్పలుకుప్పలుగా పడియుండెను. అంగళ్ళు మూసిరి. తలుపులకు తాళములు వేసిరి. నలు దిక్కులందు కావిరి క్రమ్మెను. ఎక్కడను మనుష్యసంచారమే లేదు. ఇల్లు బయలుదేఱినవానికి తిరిగి యింటికి వచ్చునందాక ప్రాణములపై నాశ లేకుండెను. ఎక్కడ చూచిన దోపిళ్ళు జరుగుచుండెను. పట్టపగలే తాళములు పగులుచుండెను. కన్నములు పడుచుండెను.

శ్యామాచరణుఁడు చాల మనఃస్థైర్యము కలవాఁడు. ఇరుగుపొరుగు వా రందఱు లేచిపోయి తమ యిండ్లను కుక్కల నక్కలపాలు చేసినను ఆయన కదలక యుండెను. కాని వారి గుజ్జుపువాఁడు చావఁగనే యింటిలో ఆందోళన కలిగెను. వారు పల్లెలకు పోవ సిద్ధపడిరి. అంతకు ముందే శ్యామాచరణుఁడు కొన్ని గ్రామములు కొనియుండెను. అందు మధ్యపురమను దానిలో స్వగృహము కలదు. పెన్షను పుచ్చుకొనిన మీఁదట పోయి యా గ్రామములోనే నివసింపవలయునను అభిప్రాయ మాయనకు మొదటినుండి కలదు. వ్రజరాణి వారి యభిప్రాయము తెలిసికొని చాల సంతసించెను. పల్లెలలోని జీవితసౌఖ్యము ఆమె కన్నులయెదుట తాండవించుచుండెను. పచ్చని ఆకులతో నిండిన వృక్షజాతులు, కలకలలాడు పొలములు, హరిణార్భకముల వినోద క్రీడలు, పక్షులకలరవధ్వనులు చూచుటకు ఆమెమనస్సు ఎప్పుడెప్పుడా యనుచుండెను. కమలాచరణుఁడు కూడ వేఁటకు కావలసిన పరికర ములు ముందుగనే సమకూర్ప సాగెను. కాని శ్యామాచరణుఁడు

వానిని పిలిచి "చంద్రుడునీకు చేదోడు వాదోడుగా ఉండును. కావున ప్రయాగ వెళ్లి చదువుకొనుము. పల్లెలందు ఊరక గాలికి తిరిగిన లాభ మేమి?" అని పిడుగు పడినట్లనెను.

కమలాచరణుని కోర్కెలపయి అగ్నివర్షము కురిసినట్లుండుటచే ప్రయాగ పోవుటకు నిరాకరించెను. ఎంతోసేపు శ్యామాచరణుఁడు వానికి బోధించెను. కాని యతఁడు ససేమిరా యనెను. చివరకు ఆయన "నీ ముఖమున చదువుగీత లేకున్న నే నెంత ఏడ్చినను లాభ మేమి" అని విసుగుకొనెను,

వ్రజరాణి యీ వార్త విని చాల విచారపడెను. పతికి చదువుపై ధ్యానము లేదను విషయ మామెకు తెలిసినను "తనతో సరససల్లాపము లాడుచు, ఎదురుగా కూర్చుండి అమృతవర్షము కురిపించుచుండ పులకితాంగియై "ఈయన బడికి పోవక నాయెదుటనే కూర్చున్న బాగుండును" అని యామె తలచుచుండెడిది. కాని "ప్రయాగ వెళ్లుము" అని తండ్రి చెప్పినమాట నతఁడు మీరుట చూచినందున ఆమె యెంతో నొచ్చుకొనెను. "తాను కొంతకాలము భర్తృవియోగ మనుభవించుట యుచితమే కాని కమలాచరణుఁడు తండ్రి మాట మీరుట చాల అనుచితము" అని తలఁచి మాధవితో "మీ బావ గారిని పిలుచుకరమ్మ" అని చెప్పెను. కాని కమలాచరణుఁడు కూర్చున్న ప్రదేశమునుండి కదలక, లోపలికి పోయిన భార్య ప్రయాగ పొమ్మని ఎక్కడ చెప్పునో యని భయపడుచుండెను. కమలాచరణుని హృదయ మెట్లున్నదో ఆమె కేమి తెలియును? మాటలు మాత్ర మెన్నియైన మధురముగా చెప్పవచ్చును కాని రంగములో అందరు ముఖము తప్పింతురు.

ఎంతసే పయినను కమలాచరణుఁడు తన గదిలో నుండి బయటకు రాకుండుట చూచి వ్రజరాణియే యతని గదిలోనికి వెళ్ళి,

"ఈవేళ ఇంటిలోనికి రాకూడ దనుకొంటిరా? వచ్చెదరేమో యని చూచి చూచి కన్నులు కాయలు కాచెను" అనెను.

"లోపలికి వచ్చుటకు చాల భయము వేయుచున్నది."

"నేను తోడు వచ్చెదను. నిర్భయముగా లోపలికి రండు."

"ఇక్కడ తోడు వచ్చెదవు కాని ఇంకొకచోటనో?"

"అక్కడికిని వచ్చెదను."

అని యామె కమలాచరణునిమీఁద దృష్టి సారించెను. అందు ఆణిముత్తియములు తాండవించుచుండుటచే ఆతని పట్టుదల తిరిగెను. మోహినీనేత్రములం దశ్రులునిండ జూచి పంతముకయి పెనుగులాడువాఁ డెవఁ డుండును? కమలాచరణుఁడు భార్యను గట్టిగా కౌఁగిలించుకొని "నీవు నన్ను జయింతువని తెలిసియే లోపలికి రాకుంటిని" అనెను. రాత్రి యంతయు రానున్న తమయెడబాటును గూర్చి వారు సంభాషించుచుండిరి. మాటిమాటికి వారి కన్నులు మరలకలిసికొనమేమో యని భ్రాంతి చెందినట్లు పరస్పరాలింగనము చేసుకొనుచుండెను.

## ౧౬

### [౧]

"హృదయేశ్వరా! మధ్యపురము

మీ ఉత్తర మందినది. దానిని కన్నుల కద్దుకొంటిని. ఇకముం దెన్నడు మీ రట్టి ఉత్తరములు వ్రాయవద్దు. వ్రాసిన దానివలన నాగుండె చెదరినది. అతిశయోక్తి కాదు. చిత్తము విచారాయత్తమైనది. అవయవములు దుర్బలముగా నున్నవి. ఇచ్చట జీర్ణమై సూర్యచం

డ్రులు నివాసముచేయు పూరికొంపలు, మట్టిగోడలు, ఇండ్లలోనే కొండలుగా పడియున్న పెంటదిబ్బలు, బురదలో పొర్లాడి ఒడలు గర పొడిచెడి గేదెలు, చచ్చుటకు సిద్ధమైన ఆవులు, వీని నన్నిటిని చూచి ఎచ్చటికైన లేచిపోవలయు నను బుద్ధి పుట్టుచున్నది ! ఇక మనుష్యుల సంగతి ఏమి చెప్పను ! వారి యెముకలు బయటపడి తిండిలేక అన్నమో రామచంద్రా యని మలమల మాడుచున్నారు. ఎవని యొడలిపై చూచినను చినుగని బట్ట లేదు. హా రెంత దౌర్భాగ్యులో కాని రాత్రింబగళ్ళు చెమట యూడ్చి నడుములు విఱుచుకొన్నను కడుపు నిండ కూడు దొరకుటలేదు. మన యింటివెనుక గుంటయొడ్డున ఆడు కొనుచు మాధవి కాలు జారి అందులో పడినది. దానిలో శక్తులున్న వనియు, అవి త్రోవను వెళ్లువారిని వదలక బాధపెట్టుననియు కిం వదంతి కలదు. అటువంటిదే రావిచెట్టు మన ఇంటిముందఱ కలదు. అది భూతప్రేతములకు నివాసము. చెట్టుమీది భూతములకు, గుంట లోని శక్తులకు పరస్పరసంబంధమున్నదని అందఱు అనుకొనుచున్నారు. గుంటవల్ల ఏమంతభయము లేదు కాని రావిచెట్టువల్లనే అందఱు భయపడి ప్రొద్దుక్రుంకినమీఁదట దాని దగ్గఱగా బోవుట బొత్తుగా మానివేతురు. ఆడువాండ్రు, పిల్లలు ఆ చెట్టుదగ్గఱకు పోనైన పోరు. కాని కొందఱు మోటువాండ్రు మాత్రము గజగజలాడుచు అప్పు డప్పుడు ఒంటరిగా పోవుచుందురు. ఇవే కాక భిన్నభిన్న ప్రదేశము లందు పిశాచములు సంచారముచేయుచునే యున్నవి. ప్రజ లందఱకు వాని సంగతిబాగుగా తెలియును. అందొక దయ్యము నెలల తరబడి వదలదని చెప్పుకొందురు. మఱికొన్ని పూజాపురస్కారములు చేయిం చుకొని వదలునట. ఊరిలోనివా రందఱు వానిని ప్రత్యక్షముగా చూచినట్లు గుంపులు కూడి చెప్పుకొనుచున్నారు.

శక్తులు అన్నము అడుగుకొనుటకు కూడ వచ్చునట. వాని

చీరెలు కొంగరెక్కలువలె తళతళ లాడుచుండును. అవినుక్కలతో మాట్లాడునట. సొమ్ములన్న వానికి అభిలాష ఎక్కువట. నగలు నాణెములు ధరించి రంగురంగుల బట్టలుకట్టి కొంచెము పచ్చపచ్చగా ఒంటరిగా తిరుగుచుండినవారిని అవివచ్చి తప్పక పట్టునట. పూల వాసన వానికి సరిపడునట. అందుకని ఎవ్వరు పూలుపెట్టుకొనకయే నిద్రించుచున్నారు.

భూతములను ఇక్కడి వారెంతో జాగ్రతగా కనిపెట్టుచుందురు. యోగులు నడిజామున నీలవస్త్రము కప్పుకొని పావుకోళ్లు తొడుగుకొని ఊరికి నలువైపుల తిరుగుచు దోవతప్పినవారికి దోవ చూపుచున్నారు. వారినిప్రతిసంవత్సరము గ్రామస్థులు పూజింతురు. అందఱు వారిని దేవతలని తలచుచున్నారు. వారు శక్తికొలది ప్రయత్నించి భూతములు గ్రామములో అడుగిడుకుండ చేయుచున్నారు. చాకలి వానిని చూచినను అందఱు భయపడుదురు. దయ్యములున్న చెట్టు క్రిందికి దీపాలుపెట్టిన తరువాత ఎవరైన పోయిన వారిప్రాణములు పోయినవనుకొనవలసినదే. వానిని ఉచ్చాటనచేయుటకు రెండుబుడ్ల సారాయిచాలును. పూజారులు మంగళవారమునాడు వాని చెట్లక్రింద గంజాయి, పొగాకు ఉంచి వత్తురు. ఇదివఱకు కరిణీకము చేసిన ఒకానొకడు వచ్చి దయ్యమాయెనట. ఆతడు రయితులను చాల బాధించుటచే విసుగెత్తి వారతనిని చంపివేసిరి. ఆదయ్యముపట్టినచో, ప్రాణములుతీయక విడువదు.ఏకరణముకూడ ఇక్కడొక సంవత్సరముకన్న ఎక్కువ రోజులు మనాయించడు. గ్రామ కంఠములో ఒకచెట్టు ఉన్నది. దానిమీాద ఖాజీసాహేబు నివసించును. ప్రతిగురువారము నాడు పూజ జరుపనిచో ఆయన పిల్లలను బ్రతుకనీయడు.

ఇవన్నియు వజ్రములతో ఛేదించుటకు వీలులేకుండ వీరి హృదయములందు పాదుకొని యున్నవి. పిల్లవాని ఒళ్లు వెచ్చగానున్న భూత

పూజ. గేదె పాలివ్వకున్నను భూతపూజ. పొలములందు, కళ్లము లందు, పెండ్లిండ్లయందు, ఎక్కడ ఎప్పుడు చూచిన భూతపూజ! కాని నిజమైన దైవభక్తిలేదు. ఇచ్చట భూత సామ్రాజ్యమే కొనసాగు చున్నది. యమధర్మరాజు ఇచ్చటకు వచ్చుటమాని తనపని భూతము లకే అప్పగించెనట.

చిత్తగించవలెను

మీ ప్రజరాణి."

[౨]

"మనోహరా! మధ్యపురము

చాలరోజులకు ప్రేమతో మీరు వ్రాసిన ఉత్తరమందినది. దానిని పరికించిచూడగా మీకు బొత్తుగా తీరుబాటులేక నిలువబడియే వ్రాసి నట్లు తోచుచున్నది. అక్కడికి పోయినమీదట మీబుద్ధి మారి నట్లున్నది. మీరిక్కడినుండి వెళ్లి రెండుమాసములుగడిచినను ఉత్త రములు వ్రాయుటేకాని వచ్చుమాట లేనేలేదు. నాతోడు, మీరు హోళీపండుగ సెలవులలో ఇచ్చటికి తప్పక రావలయును. అశ్రద్ధ చేసిన నేను ఊరుకోను.

ఇప్పుడు నేనేదో నూతన ప్రపంచములోనికి వచ్చినట్లున్నది. రాత్రులందు నిద్రించుటకు పరుండగనే ఉండియుండి 'ఆహో హూ హూ' అను కేకలు వినవచ్చుచున్నందున, అదరిపడి కూర్చుందును. 'కారణమేమూ' యని ఆరాతీయగా జనులు హోళీకొఱకు పిడకలు, కట్టెలు ప్రోగుచేయుటకు ఇంటింటికి తిరుగుచున్నారని తెలిసినది. ఈ దురాచారము గ్రామములందు వ్యాపించుటచే కట్టెలు కఱవైనవి. పెద్ద కట్టెలదొడ్డియొకటి మటుమాయమయ్యెను. ఒకరయితుకు పదు నాఱు దూలముల కొట్టముకలదు. ఒకరాత్రివేళః ఆతడులేచి చూచు కొన అక్కడ నేమియు కనబడలేదు. పాపము ఎఱుకలవాని ఇంటిలో

పిడుకలుండగా ఇంటితో సహా పిడుకలు ఎత్తుకొనిపోయిరి. ఈభయముపడలేక అందఱు తమతమ కట్టెలు వంటింటిలో పెట్టి టంగున తాళము వేసుకొనుచున్నారు. మఱొకసంగతి జరిగినది. మీ నాన్నగారు వంటచెఱకుకై ఒకచెట్టుకొట్టించి మఱునాడు వెళ్ళిచూడగా ఒక ఆకైన అక్కడలేదు. రెండుమూడు కొంపలలోని తలుపులు ద్వారబంధములుకూడ ఊడ దీసికొని వెళ్లిరి. కరణము వాకిలి కడ్డముగా పండుకొని నిద్రించుచుండ ఆతనిని క్రిందపడవేసి మంచము ఈడ్చుకొని పోయి తగులబెట్టిరి. ఎక్కడచూచినను కట్టెల దోపిడే జరుగుచున్నది. కరణము కోపించి "జమాబంది పాడుచేయుదును. అక్రమణలువ్రాసి రెట్లుకట్టింతును" అని గొంతు చించుకొని బెదరించెను. కాని ఆతనిరోదన మరణ్యా రోదనమయ్యెను. యువకులు తల్లిదండ్రులు చూడకుండ ఇంటిలోని వస్తువులు తీసికొనివచ్చి అగ్ని కాహుతి చేయుచున్నారు. వారట్లుచేయకున్న తోడివారు పరాభవింతురట.

పంటలన్నియు పండి రెండువారములలో కోతకువచ్చును. మన వాకిటి ముందఱ కూలివాండ్రు తిరుణాలగా మూగుచున్నారు. జొన్న, సజ్జ, గోధుమ మొదలగు పైరులు ముచ్చటగా, సహజశోభను వెల్లడించుచున్నవి. కాకులు, చిలుకలు, మొదలయిన పక్షులు నలువంకల కోలాహలము చేయుచువచ్చి పంటచేలలోపడి పాడు చేయుచున్నవి.

మాధవికి ఇచ్చట చాలమంది చెలికత్తెలు ఏర్పడినారు. మన యింటిపక్కన రాధారాముడను గొల్లవాడున్నాడు. నిరుడు వాని తల్లి దండ్రులు ప్లేగులో చచ్చిపోయిరి. సంసారభారమంతయు వాని మీద పడినది. అతని భార్య తులసి తరుచుగా మన ఇంటికి వచ్చుచుండును. అది చాల చక్కనిది. చూచుటకెంతో ముచ్చటగానుండి కబురులు చెప్పుచున్న రాత్రిం బగళ్లు విన్నను విసుకుపుట్టదు. మాధవి దానితో అక్క వరుస కల్పించుకొన్నది. రేపు వారిబొమ్మల పెండ్లి.

పాపము తులసి చాల పేదరాలు. కాని అది ముఖమందు ఆ భావము కనుపడ నీయదు "పిడుకలు అమ్మి రెండురూపాయలు సంపాదించు కొంటిని. అందులో ఒకటి కట్నమిచ్చి రెండవదానితో పెండ్లివారి భోజనాలకు కర్చుపెట్టుతాను" అని అదిచెప్పుచున్నది. బొమ్మలకు పట్టుబట్టలు, నగలఖర్చు రాధారాముని నెత్తిపై బడినవి. చూచితిరా ఎంత సరళజీవితమో.

ఇక సెలవు పుచ్చుకొందును. మీకు చాల విసుగు పుట్టించితిని. క్షమింపుడు. మీకు ఉత్తరములు వ్రాయ కూర్చుండగనే కలము ఆగక శరపరంపరగా పోవుచుండును. ఇంకెన్నో సంగతులు వ్రాయవలసి యున్నవి. కాని విస్తరభీతిచే వ్రాయలేదు. ప్రతాపచంద్రుని అడిగి నానని చెప్పుడు.

మీ వ్రజరాణి."

[3]

"ప్రాణేశ్వరా ! మధ్యపురము

మీఉత్తర మందినది. మీరిచ్చటకు రాకుండుటకు సాకులు కల్పించుచుంటిరా? మంచిఎత్తులు వేయుచున్నారు! మిమ్ము చూచుటకు నాప్రాణ మెంతకొట్టుకులాడుచున్నదో తెలుపజాలను. దిగులు పడి పొగకట్టినట్లై స్పృహతప్పి అప్పుడప్పుడు పడిపోవుచున్నాను. మీరిక్కడినుండి వెళ్లినమీదట ఇట్లు చేయుదురని మొదట నేనను కొనలేదు. సరే, కానిండు. ఏమి చేయుదును! ఆడుదానను. నామాట లక్కఱకు రావుకదా! నేనువ్రాసిన రెండుజాబులు మీకు నచ్చినందుకు ఎంతో సంతోషపడుచున్నాను. కాని మీరు వానిని చంద్రునకు నిష్కారణముగా చూపితిరి. అశ్రద్ధగా వ్రాసినందున వానిలో చాల తప్పులుండ వచ్చును. అట్టివానిని చూచినంతనే చంద్రునకు చాల సంతోషము కలిగెనని మీరు వ్రాసితిరి కాని నాకు నమ్మకము

లేదు. ఒకవేళ నా ఉత్తరము లాయనకు నచ్చినయెడల ఆయన సలహా తీసికొని పల్లెటూరి జీవితమందు ఆసక్తి కలుగుటకు కొన్ని సదుపాయములు నాకు తెలిపిన ఎంతో ధన్యురాల నగుదును.

నిన్న ఇక్కడ దేవీపూజ జరిగినది. అరకలు, వంటలు ఆగినవి. ఇట్లు చేయుటకు అమ్మవారి యాజ్ఞయట! ఆమె యాజ్ఞాభంగము చేయజాలక అందఱు చుట్టలు త్రాగుటకూడ మానివేసిరి. సంవత్సరమునకు ఒకనాడే ఆమెపూజ జరుగును. మేకపోతును బలియిచ్చిరి. ఉండ్రాళ్లు పోసిరి. చద్ది పెట్టిరి. ఆబాలగోపాలము ఇక ప్లేగురాదని తలచుచున్నారు. ఈవేడుక లన్నిటిని చూచి వచ్చితిని. పండ్రెండు ఘంటలు కాగానే చాలమంది మనుష్యులు కాగడాలు పట్టుకొని గోలచేయుచు బయలుదేఱి ఊరిచుట్టు ప్రదక్షిణము చేసిరి. దీనివలన ప్లేగుదేవత పొలిమేరదాటి ఊరిలోనికి రాదట. ప్రదక్షిణమైన మీదట పొలిమేరలందు పూలు, ఆకులు, వక్కలు, పాతి వచ్చిరి. ఈ యూరిపీడ పరాయి ఊరికి పోవలయునని దీని అర్థమట. మనఊరివారు తమపనులు ముగించుకొని, అక్కడనుండి బయలుదేఱగనే చుట్టుపట్ల గ్రామములవారు ఈ విషయము తెలిసికొని గుంపులు గుంపులుగా కూడి బడితెలతో వచ్చిరి. అప్పుడిరుతెగలవారికి రామ రావణయుద్ధము జరిగి చాలమంది గాయపడిరి.

మరునాటి యుదయమున గందరగోళము సర్దుకొనెను. మఱియొక చిత్రము! మనయింటి కెదురుగా ఒకబట్టీ కట్టించి దానిమీాద పాలు పోసిన కళాయి పెట్టిరి. అప్పుడే కాశీరాముడు అనువాడు ఒడలంత విభూతి పులుముకొని వచ్చెను. పెద్దలందఱు పరజాపట్టుపై కూర్చుండిరి. శంఖములు, కొమ్ములు భీకరధ్వనులు చేయుచుండ కళాయికి నాలుగువైపులు తోరణములు కట్టిరి. కళాయిలోని పాలు మసలగనే కాశీరాముడు లేచి "కాళీదేవికి జయ్" అని కెవ్వున కేకవేసి గభీలున

అందులో దుమికెను. ఏమి చెప్పుదును? ఇకవీడు బ్రతుకడనుకొంటిని. కాని నిముషములోనే ఒళ్ళు చలిచుకొనుచు వాడు బయటికి వచ్చెను. వాడే మాత్రము కమలక మొదటివలెనే ఉండెను. ప్రజలా తని మెడలో పూలదండలు వేసి చేతులు కట్టుకొని "స్వామీ! ఈయేడు పంట లక్కలకు వచ్చునా? ప్రజలందఱు సుఖముగా ఉందురా? వానలు కురియునా? జబ్బులు రావుకదా? ధర లెట్లుండును?" అని యడిగిరి. అతడు అడిగిన ప్రశ్న లన్నిటికి స్పష్టముగా ప్రత్యుత్తర మిచ్చెను. సభ చాలించిరి. ఇట్టిసభ ప్రతియేడు జరుగును. కాశీరాముడు చెప్పిన ప్రతిమాట అందఱు నమ్మెదరు. ప్రత్యక్షముగా కొన్ని జరుగును. ఒకటి అర జరుగకున్నను ఏమంత పట్టింపులేదు. ఆతడు చాల భవిష్యద్వాణి కలవాడు. ఊరిలో ఏదొంగతనము జరిగి నను ఆతడంతు తీయును. పోలీసువాండ్రకు కూడ ఆరా దొరకని కేసులు ఆతడు పట్టి యిచ్చును. పుట్టుక కాతడు మాలవాడైనను వానిని అందఱు బాగుగా సత్కరింతురు. వాడు ఇతరుల కెన్ని ఉప కారములు చేసినను వారిని రెండుపావుల సారాయి తప్ప మరేమియు కోరడు. తలచుకొని ఒకబుడ్డి యిచ్చిన చాలును. ఎవరి కేసు లయిన కోర్టులో జరుగుచున్న అవి గెలుచుటకు కాశీరాముడు జపము చేయుమన్న చేయును.

హోలీపండుగ దగ్గఱకు వచ్చుచున్నది. వారము రోజులైన లేదు. నాయొడలెంతో ఉప్పొంగు చున్నది. మనస్సులో ఎన్నో కోర్కులు పుట్టుచున్నవి. కన్నులు మీ దివ్యసుందర విగ్రహము చూచుటకు ఎదురుచూచుచున్నవి. నాధా! ఈవారము రోజులు ఎట్లో గడపి మీరువచ్చిన తరువాత మిమ్ముచూచి ఆనందించెదను.

మీ ప్రజరాణి."

"ప్రాణనాథా! మధ్యపురము.

మీరు పాషాణ హృదయులు. కృత్రిమ బుద్ధులు. ఇంక ఏమనవలయును? ఈక్షణమున నాయెదుటనే ఉండిన మిమ్మేమి చేసియుందునో! మీరు ద్రోహులని ఖండితముగా చెప్పగలను. మీరు నన్నేమి చేయగలరు? రాకుందురు. ఏడ్పింతురు. నాప్రాణములు తీయుదురు! ఇంతేనా? ఇంతకన్న ఏమైన ఉన్నదా? నాదగ్గఱకు వచ్చుటకు పట్టుమని పది గడియలైన పట్టవే. "కొంచెము దానిని చూచివచ్చిన మ్రొక్కుతీరు" నను ఆలోచన మీకున్న నే నింతగా ఏడ్వనేల?

"ఉత్తరము చించి ముక్కలుచేసి నలిపి పాఱవేసి మరి మాట్లాడకుండవలయును" అను క్రోధము పొంగుచున్నది.

అయ్యో, నామనస్సులో పుట్టిన ఎటువంటి కోర్కెలు మీరు విధ్వంసము చేసినారు. అందరి నోళ్లనుండి 'హోళీ' 'హోళీ' అను మాటవిని ఎంతో సంతోషించితిని. కాని అది దాటిపోయినది. నే నెప్పటివలె దేబిరికొట్టునై ఉన్నాను. మొదట ఈ పండుగమాట వినిన ఎంతో ఆనందము కలుగుచుండెడిది. ఇప్పుడు దానిపై రొత్తినంతనే ఏమి వ్రాయుదును; అదేదైన వస్తువైన యెడల ఏమిచేసియుందునో నాకు తెలియదు. అంతయు వారివారి అదృష్టము ననుసరించియే యుండును. కూడుకుమ్మ, బట్టపాతలు లేక ఊరిలోని అలగాజనమంత గోచిపాతలు పెట్టుకొని పండుగనాడు సంతోషపడుచు, వసంతము చల్లుకొనుచుండ నష్టజాతకురాలనగు నేను ముఱికిబట్ట కట్టుకొని కుక్కిమంచములో ఒంటరిగా ఉసూరున పరుండవలసి వచ్చెను. మీ పాదములాన, నేను వసంతము తాకనైన తాకక దానిని హాలాహలమువలె చూచితిని. మీరు వత్తురని అత్తరుచల్లిన చీరెలు, అక్షతలు, కాగులోకలిపి సిద్ధముగా ఉంచిన వసంతము,

చక్కగా ఈనెలుతీసి చుట్టిన తమలపాకులు, అన్నియు మీనిర్దయకు నాతోపాటు అఘోరించుచున్నవి. మాధవి ఏడ్చిఏడ్చి ఎఱ్ఱమన్ను చేయు, దాని ముఖమున రవ్వంతబొట్టు బెట్టితిని. ఇక మీరు రాలే దేమని అడుగను. ఎప్పుడైన నాలుక ఆవిషయమెత్తిన లాగి తునా తునకలు చేసివేసెదను.

మొన్నటి సాయంకాలము నుండియే గ్రామములో వేడుకలు ప్రారంభించినవి. కొందఱు పడుచువాండ్రు గుమికూడి డప్పులు వాయించుచు మోటుపాటలు పాడుచు ఇండ్లచుట్టు తిరిగిరి. ఇక్కడ ఇన్ని తిట్లు తిందురను సంగతి నాకు తెలియదు. ప్రతివాని నోటినుండి తెంపులేక అశ్లీలములు వచ్చుచున్నవి. వారికి సిగ్గుశరము లేదు. తండ్రి కొడుకును కొడుకు తండ్రిని తిట్టుటే తిట్టుట! మామ కోడలతో "ఈరోజు హోళీపండుగ ఏమందువు" అనును. కోడలు సిగ్గుతో ఇంటిలో జొరబడి ముసిముసి నవ్వులు నవ్వెను. ఈయూరి కరణము తప్ప త్రాగి ముఱికిటోపీ పెట్టుకొని ముతాదా రయ్యెను. కూతుళ్ళు కోడండ్రు ఆయన ముతకమాటలు వినలేక నవ్వుచుండిరి. ఎవ్వడైన కొంచెము ఒడలు మురికియైన దనుకొన్నయెడల ఆతడు నరకమునకు పోవునట!

ఇట్టి చర్యలతో ఆ గుంపు రాత్రి మూడుగంటలకు హోళీమాత సన్నిధికి చేరెను. పిల్లలందఱు అగ్నిక్రీడాతత్పరులై యుండిరి. నేను కూడ కొంద ఱాడువారివెంట చని చూడ అక్కడి వారందఱు ఒకచోట కూడి పాటలు పాడుచుండిరి. కొంతసేపటికి హోళీ వెలిగెను. కట్టెలు రాజగనే గప్పుని జ్వాల బయలుదేఱెను. ఆకాశ మంతయు బంగారురంగుగా మాఱెను. దూరమందలి చెట్లు చేమలు మెఱయ సాగెను. అప్పుడు అగ్నిదగ్గఱకు నలుదిక్కులనుండి జను లందఱు 'హోళీమాతకు జయ్' అని పరుగెత్తి వచ్చిరి. చేత పట్టుకువచ్చిన గోధుమ, జొన్న మొదలైన కంకులు అందులో పడవేసిరి.

జ్వాల లంతకంతకు చెలరేగినమీాదట ప్రజ లందఱు ఒక దిక్కున నుండి ‘కబీర్’ అనిరి. ఇట్లు ఆఱుగంటలవఱకు ఈవిధమున నుండ అగ్నిలో వేసిన మొద్దులలో నుండి ‘టపటప’ శబ్దములు వినవచ్చెను. పశువులు కట్టుకొయ్యలు ఊడబెఱుకుగొని అంబా యని అఱవ జొచ్చెను. అప్పుడు తులసి నన్ను చూచి “అమ్మా! హోళీమంట వంకరగా నున్నది. ఇక క్షేమము లేదు. మంట వంకరలేక నిట్టనిలువుగా నున్న కాలము చక్కగా ఉండును. లేకున్న అశుభము కలుగును” అని చెప్పెను. క్రమముగా మిణుగురులు తగ్గెను. మంట సన్నగిల్లెను. అప్పుడు జను లందఱు దగ్గఱకు పోయి ఏదో వస్తువు పాఱవేసికొనినట్లు వెదకుచుండిరి. అప్పుడు తులసి నాతో “హోళీపండుగ మొదలుపెట్టినపుడు అక్కడ మూలను ఒక ఆముదపుమొక్క నాటి దానిపై పిడుకలు, కట్టెలు కుప్పగా పడవేయుదురు. ఇప్పు డాకుప్పలో నాటిన మొక్కనే అందఱు వెదకుచున్నారు. దానిని కనిపెట్టి గుఱి చూచి ముక్కలుముక్కలయి ఆవల పడులాగున కఱ్ఱతో కొట్టినవాడు వీరు డందురు” అని చెప్పెను. అందఱికన్న మొదట కరణము చేతులు ఊపుకొనుచు వచ్చి పదిగజముల దూరమం దుండియే తొంగిచూచి వెనుకకు మళ్లెను. తరువాత రాధారాముడు బడిత తీసుకొని ఎక్కడ లేని ధైర్యసాహసములతో మూర్ఖించి నిప్పులో జొరబడి మొక్క ముక్కలుముక్కలై ఆవల పడునట్లు కొట్టెను. విరిగిన ముక్కలు జనులు ఒకరిపై బడి ఒకరు ఏరుకొనిరి. ఆ ముక్కలు చాది ముఖమున బెట్టుకొనిన చాల మంచిదట!

ఇక్కడి పని ముగించుకొని మగవా రందఱు అమ్మవారి అరుగు దగ్గఱకు వెళ్లిరి. అక్కడ నేమైన పూజాపురస్కారములు జరిగిన వను కొంటిరా? స్సున్న. ఈరోజు ఆమె తిట్లు తినుట చాల ఇష్టమట. చిన్నలు పెద్దలు అందఱు కలిసి ఆమెను నోట అనరాని మాట లనిరి.

చక్కగా ఈనెలుతీసి చుట్టిన తమలపాకులు, అన్నియు మీనిర్దయకు నాతోపాటు అఘోరించుచున్నవి. మాధవి ఏడ్చిఏడ్చి ఎఱ్ఱమన్ను చేయు, దాని ముఖమున రవ్వంతబొట్టు బెట్టితిని. ఇక మీరు రాలే దేమని అడుగను. ఎవ్వారైన నాలుక ఆవిషయమెత్తిన లాగి తునా తునకలు చేసివేసెదను.

మొన్నటి సాయంకాలము నుండియే గ్రామములో వేడుకలు ప్రారంభించినవి. కొందఱు పడుచువాండ్రు గుమికూడి డప్పులు వాయించుచు మోటుపాటలు పాడుచు ఇండ్లచుట్టు తిరిగిరి. ఇక్కడ ఇన్నితిట్లు తిందురను సంగతి నాకు తెలియదు. ప్రతివాని నోటినుండి తెంపులేక అశ్లీలములు వచ్చుచున్నవి. వారికి సిగ్గుశరము లేదు. తండ్రి కొడుకును కొడుకు తండ్రిని తిట్టుటే తిట్టుట! మామ కోడలతో "ఈరోజు హోలీపండుగ ఏమందువు" అనును. కోడలు సిగ్గుతో ఇంటిలో జొరబడి ముసిముసి నవ్వులు నవ్వును. ఈయూరి కరణము తప్ప ద్రాగి ముఱికిటోపీ పెట్టుకొని ముతాదా రయ్యెను. కూతుళ్ళు కోడండ్రు ఆయన ముతకమాటలు వినలేక నవ్వుచుండిరి. ఎవ్వారైన కొంచెము ఒడలు మురికియైన దనుకొన్న యెడల ఆతడు నరకమునకు పోవునట!

ఇట్టి చర్యలతో ఆ గుంపు రాత్రి మూడుగంటలకు హోలీమాత సన్నిధికి చేరెను. పిల్లలందఱు అగ్నిక్రీడాతత్పరులై యుండిరి. నేను కూడ కొంద ఱాడువారివెంట చని చూడ అక్కడి వారందఱు ఒకచోట కూడి పాటలు పాడుచుండిరి. కొంతసేపటికి హోలీ వెలిగెను. కట్టెలు రాజగనే గప్పని జ్వాల బయలుదేఱెను. ఆకాశ మంతయు బంగారురంగుగా మాఱెను. దూరమందలి చెట్లు చేమలు మెఱయ సాగెను. అప్పుడు అగ్నిదగ్గఱకు నలుదిక్కులనుండి జను లందఱు 'హోలీమాతకు జయ్' అని పరుగెత్తి వచ్చిరి. చేత పట్టుకువచ్చిన గోధుమ, జొన్న మొదలైన కంకులు అందులో పడవేసిరి.

జ్వాల లంతకంతకు చెలరేగినమీాదట ప్రజ లందఱు ఒక దిక్కున నుండి ‘ కబీర్ ’ అనిరి. ఇట్లు ఆఱుగంటలవఱకు ఈవిధమున నుండ, అగ్నిలో వేసిన మొద్దులలో నుండి ‘ టపటప ’ శబ్దములు వినవచ్చెను. పశువులు కట్టుకొయ్యలు ఊడబెఱుకుగొని అంబా యని అఱవ జొచ్చెను. అప్పుడు తులసి నన్ను చూచి “అమ్మా! హోళీమంట వంకరగా నున్నది. ఇక క్షేమము లేదు. మంట వంకరలేక నిట్టనిలువుగా నున్న కాలము చక్కగా ఉండును. లేకున్న అశుభము కలుగును” అని చెప్పెను. క్రమముగా మిణుగురులు తగ్గెను. మంట సన్నగిల్లెను. అప్పుడు జను లందఱు దగ్గఱకు పోయి ఏదో వస్తువు పాఱవేసికొనినట్లు వెదకుచుండిరి. అప్పుడు తులసి నాతో “హోళీపండుగ మొదలుపెట్టినపుడు అక్కడ మూలను ఒక ఆముదపు మొక్క నాటి దానిపై పిడుకలు, కట్టెలు కుప్పగా పడవేయుదురు. ఇప్పు డాకుప్పలో నాటిన మొక్కనే అందఱు వెదకుచున్నారు. దానిని కనిపెట్టి గుఱిచూచి ముక్కలుముక్కలయి ఆవల పడులాగున కఱ్ఱతో కొట్టినవాడు వీరు డందురు” అని చెప్పెను. అందఱికన్న మొదట కరణము చేతులు ఊపుకొనుచు వచ్చి పదిగజముల దూరమం దుండియే తొంగిచూచి వెనుకకు మళ్లెను. తరువాత రాధారాముడు బడిత తీసుకొని ఎక్కడ లేని ధైర్యసాహసములతో మూర్ఖించి నిప్పులో జొరబడి మొక్క ముక్కలుముక్కలై ఆవల పడునట్లు కొట్టెను. విరిగిన ముక్కలు జనులు ఒకరిపై బడి ఒకరు ఏరుకొనిరి. ఆ ముక్కలు చాది ముఖమున బెట్టుకొనిన చాల మంచిదట!

ఇక్కడి పని ముగించుకొని మగవా రందఱు అమ్మవారి అరుగు దగ్గఱకు వెళ్లిరి. అక్కడ నేమైన పూజాపురస్కారములు జరిగిన వను కొంటిరా? సున్న. ఈరోజు ఆమె తిట్లు తినుట చాల ఇష్టమట. చిన్నలు పెద్దలు అందఱు కలిసి ఆమెను నోట అనరాని మాట లనిరి.

ఇప్పటికి కొన్ని రోజులక్రిందట ఆమె కొలుపులు చేసిరి. నేడు దిట్టుచుండిరి. దేవతలనే లక్ష్యపెట్టనపుడు తల్లులను అక్కచెల్లెండ్రను మన్నింతురా?

ఉదయమగుటతోడనే మామగారు పురోహితుని పిలిచి "ఈరోజు రెండు సేరుల భంగు కొంత చప్పనిది, కొంత తీయనిది నూరించు" డనిరి. వెంటనే ఆతడు కొందఱు యువకులను తోట్టుకొని వచ్చి భంగు నూర నియమించెను. చాల పిడతలు తెప్పించి వరుసగా పెట్టిరి. రెండు కుండలందు రెండురకముల భంగు ఉంచిరి. ఇకేమి చెప్పుదును? మూడునాలుగు గంటలవఱకు త్రాగుబోతుల బాఱులు ఎడతెగకుండెను. అందఱు తలలాడించుచు పురోహితుని నైపుణ్యమునకు మెచ్చుకొనుచు సంతోషపడు చుండిరి. ఒకడు 'భలే బాగున్నది' అని వర్ణింపగనే పురోహితుడు పిడత తీసుకొనివచ్చి ఇది చప్పనిది. కొంచెము రుచిచూడు. అన్నప్పుడెల్ల "మనమిచ్చుటికి రాబోవుదుమా? ఈరోజే కదా, బాగుగా పుచ్చుకొనుడు" అనెను. రయితు లీమాటలు విని దానిని అమృతముగా భావించి ఒక్కొక్కరు మూడునాలుగు పిడతలు ఖాళీచేసిరి. కరణముగారి యల్లుడు క్రొత్తగా వచ్చి పురోహితుని మాటలు నమ్మి తప్పత్రాగి కైపెక్కి తైతక్కలాడ దొడగెను. ఊరందఱు ఆతనితో పరియాచకమునకు దిగిరి. ఒకకాపు వచ్చి ఆతనిని చూచి నవ్వుచు "పంతులూ! నీవిక్క డెందుకుంటివి? ఇంటికిపోయి అన్నమువండు. మే మందరము వచ్చెదము" అనెను. అప్పుడందఱు పకపక నవ్విరి. కాశీరాముడు కైపెక్కి తూలుచు లేనికోపముతో బడితె బుజాన ఉంచుకొని సభాస్థలమును చూచి 'హా హా హా' అని గర్జించి "పంతులూ, నీవు మాక్రొత్త కోడలితో పరాచక మాడుతుంటివా?" అని ఆతనిపై బడెను. పాపము పంతులు చాల పొట్టి. ఆతడు భారీ. ఇద్దఱు పడుచు లేచుచు మధ్యాహ్నము వఱకు పెనగులాడుచుండిరి. అంతవఱకును తులసి కూర్చుండియే యున్నది.

అప్పుడు నేను దానిని చూచి "ఓసీ! ఈరోజు మాయింటికి భోజనము నకు రమ్మా. నలుగురము పచ్చపచ్చగా కూర్చుండి తిందము." అని యంటిని. వెంటనే వంటమనిషి రెండు కంచములలో వడ్డించుకొని తెచ్చెను. అప్పుడు తులసి కిటికీవైపు ముఖము త్రిప్పుకొనియుండ నేను చేయిపట్టి లాగగనే దానికన్నులనుండి ముత్యములు రాలుచుం డుట చూచి "ఏడ్చెద వెందుకే? చెప్పుము" అంటిని. అది ఇంకను ఎక్కువగా ఏడువ నారంభించెను. నే నెంతో సముదాయించి గుచ్చి గుచ్చి అడిగిన మీదట "ఏమిచెప్పుదు నమ్మా! ఆయన ప్రొద్దుటి నుండి ఎట్లున్నాడో" అని అది ఏడువజొచ్చెను. బాగుగా విచా రించ నాకు తరువాత తెలిసెను. రాధారాముడు ఎప్పుడో అప్పు తీసికొని ఇంతవఱకు తీర్చలేదట. ఇతనిని పోలీసువారికి అప్పచెప్పిన గాని డబ్బురాదని అప్పులవారు తలచిరట. పాపము, రాధా రాముడు కన్నులు నలుపుకొనుచు బజారులవెంట తిరుగుచుండెను. ఈరోజు ద్వేషులకు అదను చిక్కినందున తమ పంతము తీర్చుకొనిరి. అసలు ఇరువయి రూపాయలే అట. నాకీసంగతి మొదటనే తెలిసిన పాపము పండుగపూట వానికట్టి భంగపాటు కలుగకుండెడిదే. నేను రహస్యముగా పురోహితుని పిలిచి ఇరువదిరూపాయలిచ్చి వానిని విడుపించుకు రమ్మని పంపితిని.

అప్పుడు మన యింటిముందర పరజాపట్ట పరచిరి. మామగారు దానిమధ్య ఉన్న తివాచీపై కూర్చుండిరి. గ్రామస్థు లందఱు బట్టలు ఎగదోపుకొని, మోచేతులవఱకే చిల్లులచొక్కాలు తొడుగుకొని తలగుడ్డలు పెట్టుకొని, రా నారంభించిరి. వచ్చినవా రందఱు మామ గారి పాదములమీద అక్షతలు ఉంచుచుండిరి. మామగారును పళ్ళె ములోని అక్షతలు తీసి వారినొసట బెట్టి ఏదో నవ్వు వచ్చుమాట అనగా అందఱు కడుపుబ్బ నవ్వుచుండిరి. బొట్టు పెట్టించుకొనినవాడు

సంతృప్తితో నమస్కారముచేసి పెన్నిధి గన్న పేదవలె సంతోషించు చుండెను. ఇట్టి ఎద్దుమొద్దుస్వభావులును, నిరక్షరకుక్షులు నగు మోటు వారితో మామగారింత చనువుగా మెలగుదురని నేను కలనైన తల చలేదు. ఇంతలోనే కాశీరాముడు అక్షతల పళ్ళెము పట్టుకొని వచ్చెను. వాడు ఇతరులవలెగాక గడుచుతనముతో పిడికెడు అక్షతలు తీసి మామగారినోట గ్రుక్కెను. మామగారెక్కడ కోపపడుదురో అనినేను చాల భయపడితిని. కాని అట్లుకాక మామగారుకూడ నవ్వుచు అందరికివలె బొట్టుపెట్టుటకు మారు రెండుచేతులతో కుంకుమ తీసికొని వాని ముఖమున పూసిరి. ఇట్లుండ ఆకస్మికముగా మామగారు "అందఱు ఉండిరికాని, మన రాధారాముడు లేడే, ఇంటిలోనున్నాడేమో ఎవరైనవెళ్ళి పిలుచుకురండు" అనిరి. అప్పుడు కరణమల్లుడు తన ప్రైవేటు చాకచక్యము వెల్లడించుటకు ఇదే సమయమని తలచి, "అయ్యా! ౧౩ సెక్షను అలీఫ్ ఆక్టును అనుసరించి వానిని పట్టుకొనిరి" అనెను. పోలీసువారికి పట్టిచ్చిన రామదాసుకూడ సమయానికి అక్కడనే ఉండెను. మామగారాతనిని క్రోధదృష్టితో చూచి "దాసూ! అటువంటి కూటికిలేని వానిని పట్టిచ్చిన నీకేమి ఒరు గును నీవు మనుష్యుడవేనా? పండుగనాడు వానిని పిల్లజెల్లల కడనుండ నీయక వేఱుచేసి అగచాట్లు పెట్టుటకు నీమనస్సెట్లొప్పెను? నీవే మైన అనుకో. నేనే రాధారాముడైన జెయిలులోనుండి బయటికి వచ్చి నిన్ను ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువులనీరు త్రాగించి మఱి చూచెదను. గొప్ప షావుకారువై ఇరువయి రూపాయలకు వానిని అగచాట్లుపెట్టి వచ్చి పదిమందిలో ఏమని కూర్చుంటివి? ఈపాడు బుద్ధితో బ్రతుకుటకన్న నిలివెడు నీళ్లలో మునిగి చచ్చుటమేలు". అనిరి. రామదాసు సిగ్గుపడి మఱి మాట్లాడక ఠాణావైపు వెళ్ళెను. రైతులందఱు అతనిని ఉరిమిచూచిరి. మామగారపుడు ఆపకుండు

రేని రామదాసు ఎముకలుపోడి కావలసినవే.

తరువాత అందఱు పాడనారంభించిరి. మత్తుతో తూలిపడుచున్నం దున చాల తమాషాగా ఉండెను. డోళ్ళు పగిలిపోవునట్లు మ్రోగుటచే కరణమల్లునకు మత్తు రెట్టింపాయెను. స్వాభావికముగా ఆతడు కొంచెము పై త్యశరీరి. దానికితోడు దగ్గఱనున్నవారందఱు ప్రోత్సా హపఱుప ఆతడు ఉన్మత్తుడై సభామధ్యమున నిలువబడి బోగము దానివలె ఆడెను. నాజన్మములో ఎన్నడు ఆవిధమున అరచొక్కా, టోపీ, మోకాళ్లవఱకు ధోవతి, బుఱ్ఱమీసములుకల మగవాడాడు చుండ చూడనేలేదు. ఆతడు అరగంటవఱకు కోతివలె ఆడుచునే యుండెను. క్రమముగా తూలి ఆతడు నేలమీద పండుకొనెను. తరు వాత ఒకగొల్లవాడు లేచి గుంపులోనుండి ఒక గొల్లపడుచును లేవ దీయ ఇరువురు చెమ్మచెక్క ఆడిరి. ఇద్దఱు కుఱ్ఱతనములో నున్నం దున చాల పసందుగా ఉండెను.

ఇక్కడ నాట్యము జరుగుచుండగనే, చాలమంది మనుష్యులు పొడుగాటి కఱ్ఱలు భుజముమీఁద పెట్టుకొని వచ్చిరి. వారివెంట తప్పెటలుకూడ ఉండెను. పాడుకొనుచువచ్చి మనవాకిలి ముందఱ నిలుపబడిరి. ఆకస్మికముగా ముగ్గురువచ్చి ఒక్కపెట్టున ఆకాశము బ్రద్దలగునట్లు 'అరరే కబీర్' అని ఇల్లుకూలునట్లు అఱచిరి. అప్పుడు మామగారు బయటికివచ్చిరి. వీరెవరో తెలియునా? ఇదివఱకు మన యూరివారితో రామరావణయుద్ధముచేసిన పరాయి ఊరివారే! మామగారిని చూచి చాలమంది వారిముఖమున అక్షతలుపెట్టిరి. మామగారును వారికి తగిన జవాబుచెప్పిరి. తరువాత అందఱు పరజాపట్టపై కూర్చుండిరి. తాంబూల మివ్వగనే పాడుచు వెళ్ళి పోయిరి.

ఆపాట ఎంత బాగున్నదనుకొన్నారు! నేను దానిని ఎప్పుడు

పాడుకొనుచున్నాను. హోలీపండుగ పరస్పరానురాగముల నభివృద్ధి చేయుటకే ఏర్పడినదని తలచెదను. కాకున్న అదివఱకు కత్తులతో పోరినవారు తిరిగి ఇల్లేలవచ్చిరి? నేడు హోలీ అయినందున అందఱి కిని స్వరాజ్యము. ప్రోషితభర్తృకలును, అనాథలును తప్ప మఱె వ్వరు ఏడ్చుటలేదు. అందఱు ఆనంద మదోన్మత్తులగువారే. సాయం కాలమున ఆడువారందఱు హోలీపాట పాడుటకు మన ఇంటికి వచ్చిరి. అత్తగారు అందఱిని సత్కరించిరి. వసంతము చల్లుకొని తాంబూలము అందుకొనిరి. కాని నేను బయటికికూడ రాలేదు. మధ్యాహ్నమునకు మాధవి అగుపడనందున ఉత్సవములో మునిగి యున్నదని తలచితిని. తులసి అప్పటికిని కిటికీవైపు చూచుచునే యుండెను. అది ఆకస్మికముగాలేచివచ్చి నాకాళ్లమీదపడి ఏడ్చెను. ఇదేమియని కిటికీవైపుచూడ ముందు పురోహితుడు వెనుక రాధా రాముడు, అందఱికన్న వెనుక రామదాసు వచ్చుచుండిరి. ఊరివా రందఱు వారివెంటనే యుండిరి. రాధారాముని ముఖము వాడి యుండెను. ఈకబురు తెలియగనే మామగారు బయటికి పరుగిడి వచ్చి వానిని కౌగిలించుకొనిరి. తులసి క్రిందికి దిగివచ్చి మామగారి కాళ్లమీద పడెను. అప్పుడు ఆపుకొనినను నాకు కన్నీళ్ళు ఆగ లేదు. మామగారును మాతోపాటు కంటతడిపెట్టిరి. మామగారి కెన్నడు కన్నీళ్ళు చూచియుండలేదు. రామదాసు గోహత్యచేసిన వానివలె తలవంచుకొని నిలువబడియుండి "నాడబ్బుముట్టినది. కాని దీనితో తులసికి ఆవునుకొని యివ్వదలచుకొంటిని" అనెను.

తరువాత రాధారాముడు తులసి ఇంటికిపోయిరి. కాని కొంత సేపటికే తులసి మాధవిచేయిపట్టుకొని నవ్వుచు మనయింటికివచ్చి "ఈమె యింతవఱకు ఎక్కడఉన్నదో అడుగుము" అనెను.

నేను—"మధ్యాహ్నమునుండి కనుపడలేదు. ఎక్కడుంటివి?" అని

యుంటిని.

మాధ—ఇక్కడేఉంటిని.

నేను—ఇక్కడెక్కడ ఉంటివి? నాకు మధ్యాహ్నమునుండి కనుపడలేదే. కోపపడను. నిజముచెప్పు.

మాధవి—తులసి ఇంటికివెళ్ళితిని.

నేను—తులసి ఇక్కడనే ఉండ అక్కడ ఒక్కతెవే నిద్రపోవుచుంటివా ?

తులసి—లేదు. అంట్లుతోమి అన్నమువండుచున్నది.

మాధవి—నిజమే.

రాముని విడిపించుటకు పురోహితుని పంపినప్పటి నుండియు మాధవి తులసి ఇంట్లో పనిచేయుటకువెళ్ళి మనఇంటినుండి బియ్యము పప్పు తీసుకుపోయి వంటచేసెను. "ఇంతచేసి ఊరకే ఏల వెళ్ళవలయును. రాధారాముడు తులసివెళ్ళి, 'ఎవరుచేసిరి?' అని యాశ్చర్యపడుదురు. అప్పుడు నేను వారిని కానకుండ పోదును" అని యామె తలచెను. కాని వంట ఆలస్యమైనందున ఇంతలో వారువచ్చి చూచిరి. దొంగచిక్కెను. చూచితిరా? ఎంతమంచిపిల్లయో?

ఇక ముగించుచున్నాను. తప్పులు క్షమియింపుడు. నేనుమీయిష్టప్రకారము నడతును. ఇవిగో అక్షతలు పంపుచున్నాను. ఇవి దాసురాలికానుకలు. నాతోడు. నవనాగరకతలో చిక్కి వీనిని పాఱవేయవద్దు. అట్లుచేసిన నేను ఊరుకోను!

ఇట్లు,

మీ వ్రజరాణి."

[౫]

"నాథా! మధ్యపురము

మీ ఉత్తరము నన్ను చాల ఏడ్పించినది. ఇక్కడ నిక ఉండ

పాడుకొనుచున్నాను. హోళీపండుగ వసన్తరాగముల నభివృద్ధి చేయుటకే ఏర్పడినదని తెలిసెను. కాకున్న అదివఱకు కష్టాలతో పోరినవారు తిరిగి ఇళ్లకువచ్చిరి? నేడు హోళీ అయినందున అందఱికిని స్వరాజ్యము. ప్రోషితభర్తృకలును, అనాథలును తప్ప మఱెవ్వరు ఏడ్చుటలేదు. అందఱు ఆనంద సుదోన్మత్తులగువారే. సాయంకాలమున ఆడువారందఱు హోళీపాట పాడుటకు మన ఇంటికి వచ్చిరి. అత్తగారు అందఱిని సత్కరించిరి. వసంతము చల్లుకొని తాంబూలము అందుకొనిరి. కాని నేను బయటికికూడ రాలేదు. మధ్యాహ్నమునకు మాధవి అగుపడనందున ఉత్సవములో మునిగి యున్నదని తలచితిని. తులసి అప్పటికని కిటికీవైపు చూచుచునే యుండెను. అది ఆకస్మికముగాలేచివచ్చి నాకాళ్ళమీదపడి ఏడ్చెను. ఇదేమియని కిటికీవైపుచూడ ముందు పురోహితుడు వెనుక రాధారాముడు, అందఱికన్న వెనుక రామదాసు వచ్చుచుండిరి. ఊరివారందఱు వారివెంటనే యుండిరి. రాధారాముని ముఖము వాడియుండెను. ఈకబురు తెలియగనే మామగారు బయటికి పరుగిడి వచ్చి వానిని కౌగిలించుకొనిరి. తులసి క్రిందికి దిగివచ్చి మామగారి కాళ్లమీద పడెను. అప్పుడు ఆపుకొనినను నాకు కన్నీళ్ళు ఆగలేదు. మామగారును మాతోపాటు కంటతడిపెట్టిరి. మామగారి కెన్నడు కన్నీళ్ళు చూచియుండలేదు. రామదాసు గోహత్యచేసిన వానివలె తలవంచుకొని నిలువబడియుండి "నాడబ్బుముట్టినది. కాని దీనితో తులసికి ఆవునుకొని యివ్వదలచుకొంటిని" అనెను.

తరువాత రాధారాముడు తులసి ఇంటికిపోయిరి. కాని కొంత సేపటికే తులసి మాధవిచేయిపట్టుకొని నవ్వుచు మనయింటికివచ్చి "ఈమె యింతవఱకు ఎక్కడఉన్నదో అడుగుము" అనెను.

నేను—"మధ్యాహ్నమునుండి కనుపడలేదు. ఎక్కడుంటివి?" అని

యుంటిని.

మాధ—ఇక్కడేఉంటిని.

నేను—ఇక్కడెక్కడ ఉంటివి? నాకు మధ్యాహ్నమునుండి కనుపడలేదే. కోపపడను. నిజముచెప్పు.

మాధవి—తులసి ఇంటికివెళ్ళితిని.

నేను—తులసి ఇక్కడనే ఉండ అక్కడ ఒక్కతెవే నిద్రపోవుచుంటివా ?

తులసి—లేదు. అంట్లుతోమి అన్నమువండుచున్నది.

మాధవి—నిజమే.

రాముని విడిపించుటకు పురోహితుని పంపినప్పటి నుండియు మాధవి తులసి ఇంట్లో పనిచేయుటకువెళ్ళి మనఇంటినుండి బియ్యము పప్పు తీసుకుపోయి వంటచేసెను. "ఇంతచేసి ఊరకే ఏల వెళ్ళవలయును. రాధారాముడు తులసివెళ్ళి, 'ఎవరుచేసిరి?' అని యాశ్చర్యపడుదురు. అప్పుడు నేను వారిని కానకుండ పోదును" అని యామె తలచెను. కాని వంట ఆలస్యమైనందున ఇంతలో వారువచ్చి చూచిరి. దొంగచిక్కెను. చూచితిరా? ఎంతమంచిపిల్లయో?

ఇక ముగించుచున్నాను. తప్పులు క్షమియింపుడు. నేనుమీయిష్టప్రకారము నడతును. ఇవిగో అక్షతలు పంపుచున్నాను. ఇవి దాసురాలికానుకలు. నాతోడు. నవనాగరకతలో చిక్కి వీనిని పారవేయవద్దు. అట్లుచేసిన నేను ఉరుకోను!

ఇట్లు,
మీ వ్రజరాణి."

[౫]

"నాధా! మధ్యపురము

మీ ఉత్తరము నన్ను చాల ఏడ్పించినది. ఇక్కడ నిక ఉండ

జాలను. నన్ను అక్కడ కెప్పుడు రమ్మందురు? ఒక్కసారి మిమ్ము చూడవలెనని యున్నది. నిజము చెప్పుడు. నేను మీయొద్దకు వచ్చిన నన్ను గేలిచేయరు కదా? కాని ఎట్లు వత్తును? మామగారికి మీరు ఉత్తరము వ్రాయుడు.

నిన్న మంచములో పడియుంటిని. ఉదయమున చల్లగాలి వీచు చుండెను. ఇంతలో ఎవరో ఆడువాండ్రు పాడుచున్నట్లుండెను. పది మందిచొప్పున జట్లుగా బయలుదేఱి కొడవండ్లు పట్టుకొని వీపులమీఁద మోపులు కట్టు త్రాళ్ళు వేసుకొని తలపైన అన్నపుదుత్తలు ఉంచు కొని పోవుచుండిరి. వారు రాత్రి చీకటిపడిన తరువాతనే కాని ఇల్లు చేరరు.

మధ్యాహ్నమువఱకు బాగుగానే ఉండెను. తరువాత ఆకస్మిక ముగా మబ్బుపట్టెను. పెద్ద వడగండ్లవాన కురిసెను. ఇంత పెద్ద వడ గండ్లు నా జన్మమం దెన్న డింతవఱకు చూచి ఎఱుగను. తుపాకులలో నుండి వచ్చెడు ఉక్కుగుండ్లలాగున, బంగాళాదుంపలవలె పైనుండి 'ఠకా, ఠకా' పడెను. నిమిషములో కోతకువచ్చిన పైరంతయు నేల మట్టమాయెను. రయితులందఱు గుండెలు బాదుకొనుచు కొంపలు చేరు చుండిరి. పాపము తులసి ఎట్లున్నదో యని భయపడి మేడమీఁదినుండి అంతట పారచూచితిని. మైదానముగుండా తులసి, రాధారాముడు, వారి ఆవు కలిసి వచ్చుచుండిరి. ముగ్గురును వడగండ్లబారి పడిరి. తులసి తలమీఁద గంప, రాధారాముని నెత్తిపై చొప్పమోపు ఉం డెను. వారిని చూచి ఇంటికి వచ్చులోపల ఏమి మూడునో యని చాల దిగులుపడితిని. ఆకస్మికముగా గాలిదుమారము రాగా రాధా రాముని తలమీఁది మోపు క్రింద పడెను. వెంటనే తులసి తన తల మీఁది గంప వాని నెత్తిమీఁద పెట్టెను. అప్పుడు అంతులేని వడగండ్లు మీఁద పడుచుండుటచేత, తులసి చేతులతో తడవుకొనుచుండెను.

వెంటనే రాఘారాముడు మోపు చివాలున ఎత్తుకొనెను.

ప్రొద్దున ఆటపాటలతో పొలములకు వెళ్ళిన కూలినారంపలు సాయంకాలమునకు ఏడ్పులు పెడబొబ్బలతో కొంపలు చేరుకొనిరి. పంటచేలు పాడయ్యెను. ధాన్యము బురదపాలయ్యెను. రోగములు ప్రబలెను. ఏయింట చూచిన మంచములే, మూల్గులే. కొలుపులు చేసినపుడు కాశీరాముడు చెప్పిన శకునములు ఇప్పుడు నిరక్షరనము లాయెను. హోలీ నంకరమంట రహస్యము అందఱకు తెలిసెను. పంట లిట్లున్నను పన్ను వసూళ్లు తగ్గలేదు. రైతులెంతో బాధపడు చున్నారు. పైకము వసూలునకు సర్కారువారు కొట్లు, తిట్లు, జప్తులు, వేలములు జరిగించుచున్నారు. ఇట్టి దీనులమీాద ఈశ్వరునకు ఆగ్రహ మేలనో!

ఇట్లు
వ్రజరాణి."

[౬]

"హృదయేశ్వరా!                                        మధ్యపురము

పదునైదు రోజులకు నేను మీాకు జ్ఞాపకము వచ్చితినా? మీా ఉత్తరము ఎన్నోసారులు చదువుకొంటిని. కాని మీా ఉత్తరము లన్నియు నన్ను ఏడ్పించుచునే యున్నవి. రోజు కెన్నిసార్లు మిమ్ము తలచుకొని ఏడ్చుచుంటినో ఈశ్వరునకే తెలియును. మన ఇరువురము కలసి యున్ననాటి సంగతులన్నియు వచ్చి నాకన్నుల యెదుట తాండవించుచున్నవి. వానిని తలచుకొనగనే చెప్పశక్యముగాని ఆవేశము నాకు కలుగుచున్నది. మీారు రారను సంగతి స్పష్టముగా నాకు తెలిసినను ఏలనో కాని వాకిలిదాకా వచ్చి కొంచెముసేపు ప్రతిదినము చూచుచున్నాను.

ఇక్కడ చాకలవాండ్ర నాట్యము జరిగినది. వారిగుంపులో ఒక

17

యువకుడు తెల్లనిబట్ట వల్లెవాటు వేసికొని నడుమునకు గంటలు కట్టుకొని ఆడుచుండెను. ఏమిటో ఇది యని యోజింపగా పండుగ మామూళ్లు అడుగుకొను చున్నారని తెలిసెను. మన కేపని వచ్చినను వారికేపని వచ్చినను మామూళ్లు అని గోలపెట్టుదురు. ఆడునపుడు వారేదో పాటలు పాడుదురు. అప్పటి కప్పుడే కల్పింతురు. వల్లెవాటు వేసికొనినవాడు మద్దెల దగ్గఱకుపోయి ఏదోమాట అనును. వెంటనే రెండవవాడు జవాబు చెప్పును. ఇరువురు అప్పుడే కవిత్వము చెప్పుదురు. ఈజాతికి ధారణా శక్తి చాలకలదు. వీరు పాడెడువానిని జాగ్రత్తగా విన్నచో గంభీర భావములే గోచరించును. వీరు మొదట పాడినపాట భావము:—"ఓయి చాకలిచిన్నవాడా! నీవు ఎవరి వాకిలిదగ్గఱకువచ్చి నిలువబడితివి?" రెండవవాడు అనును. "భోజ మహారాజగారివాకిలి దగ్గఱకు. ఇష్టము వచ్చినదికోరు. ఇత్తురు." రెండవ దానికర్థము. "యాచకులకు మోమోటము యుండరాదు. కనుపడినవారి నెల్ల అడుగుము. ఇవ్వతలచినవారు వెంటనే ఇత్తురు." ఎంతోసేపు ఇవే పాడుదురు. మీకీపాటలయం దనురాగములేదేమో కాని నాకివి యన్నమహాప్రీతి. వీరుత్రాగుబోతులు. మంచినీరు త్రాగినట్లు సారాయి ఉపయోగింతురు. పెండ్లిపేరంటములకు సారాయి, చావు పుట్టుకలకు సారాయి. ఎక్కడెక్కడ అడుక్కొనితీసుకొనివచ్చినది, సారాయికే వెచ్చింతురు. చివరకు వీరు ఇంటినుండి వెళ్ళిపోవునపుడు పాడుపాట ఎంత రమ్యముగా ఉండునని చెప్పుదును? చూడుడు :— "మీపరివారము గంగాతరంగములవలె వృద్ధియగుగాక, మీకు మామిడి పూతవలె సంతు కలుగుగాక, పచ్చిగడ్డివలె అమ్మగారు పచ్చపచ్చగా ఉందురుగాక," ఇందెట్టి భావములున్నవో చూచితిరా?

మీ వ్రజరాణి."

[౭]

,,జీవితేశ్వరా! మధ్యపురము

నేను పారమురోజులనుండి ఉత్తరము వ్రాయనందుకు క్షమింపుము. ఈవారమంతయు మాధవి జబ్బుగా నున్నందున క్షణమైన నాకు తెరపిలేకపోయెను. దానికి మొదట "క్వయినా" వాడితిమి. రోగము నయమగుటకు బదులు మోపయినందున వైద్యుని పిలిపించితిమి. ఆయనకు దాదాపు ఏబది యేండ్లుండును. కాళ్లకు చెప్పులైనలేక కొల్లాయిగుడ్డ పైన వేసుకొనివచ్చి మన అరుగుమీాద కూర్చుండెను. ఆయన ఎన్నడు చొక్కా తొడుగుకొని యుండగా నేను చూడలేదు. చుట్టుపట్లగల గ్రామములలో ఆయనే వైద్యము చేయుచున్నాడు. అందఱు ఆయనను ధన్వంతరిగా చూచుకొందురు. మన డాక్టరులకు వలె బండ్లు గిండ్లు ఆయనకు అక్కఱలేదు. ఎంతదూరమైనను కాలినడకనే వచ్చును. ఆయన చాల పరోపకార బుద్ధికలవాఁడు. ఆయనను చూడగనే సగము రోగము పోవును. ఆయనమందులుకూడ దమ్మిడీ ఖర్చుతో ఎంతో తయారు చేయుటకు సులువైనవి. ఆయన మందివ్వగనే మాధవి మరునాడు లేచి చక్కఁగా తిరిగినది.

ఇక్కడ (ప్రస్తుతము వాయిదా బేరగాండ్ర) దౌర్జన్యము చెప్పనలవి గాకున్నది. చలికాలములో బట్టలు వాయిదాకువేసి చైత్రమాసములో డబ్బుకువత్తురు. ఆడబ్బు వసూలు చేయునప్పుడు వారుచేయు దుర్మార్గములు చెప్ప నలవికాదు. రాధారాముడుకూడ కొన్నిబట్టలు తీసికొనెను. అందువలన వాని వాకిటిలో కూర్చుండి నోటపట్ట రాని మాటలనిరి. తులసి ఆ మాటలు వినలేక తలుపువేసి లోపల గొళ్ళెము పెట్టుకొనెను. అప్పుడు వారు వాకిట కట్టివేసిన ఆవును విప్పుకొని తోలుకపోయిరి. రాధారాముడు ఎక్కడనుండియో వచ్చుచు వారిని చూచి బడితెతో ఈడ్చికొట్టెను. వెంటనే వారిలో ఒకని మణికట్టు

విరిగెను. వారును చేతులు కలిపిరి. రాధారాముడు ప్రాణములమీది యాశవదలుకొని తిరుగబడి ముగ్గురను పరుండబెట్టెను. ఇంతలో కాశీరాముడుకూడవచ్చి వానికి సహాయముచేసెను. వాయిదా బేర గాండ్రయూరివారి కీసంగతి తెలిసి చాలమంది వచ్చిపడిరి. ఇదేసం దనుకొని మన ఊరివారును మోకరించిరి. ఇకెవ్వరు రారనుకొనెదను.

ఇప్పుడు మేనెల గడచినది. మీకింకను సెలవులు ఇవ్వలేదా? రాత్రిం బగళ్లు మీకొఱకు ఎదురుచూచుచున్నాను. ఊరిలో జబ్బులు నెమ్మదించినవి. మేము త్వరలోనే కాశీ చేరెదము. మీరువచ్చి ఇచ్చటిసంగతులు చూడనందుకు చాల విచార పడుచున్నాను.

మీ వ్రజరాణి.''

## ౧౭

ప్రతాపచంద్రుఁడు ప్రయాగ కళాశాలలో చేరి మూఁడు సంవత్స రములాయెను. ఆరోజులలోనే సహపాఠుల యొక్కయు, గురుజనుల యొక్కయు ఆదరమునఁ కతఁడు పాత్రుఁడాయెను. ప్రతివిషయము నందును కళాశాలలోని యందఱికన్న ఆతడే యెక్కువ కౌశలము చూపుచుండెను. ప్రొఫెసరు లందరికి ఆతనిమీఁద చాలఅభిమానము. విద్యార్థులందఱు ఆతని నేనాయకుఁడుగా తలచుచుండిరి.ఆటలందుసాటి లేనిచాకచక్యము కనుపఱచినట్లే ఉపన్యాసములందును వాని వాక్పటు త్వము, సూక్ష్మదర్శిత్వము, వెల్లడియగుచుండెను. కళాశాలయందు ఒక మిత్రమండలియుండెను. నగరములోని పెద్దమనుష్యులు, ప్రొఫె సరులు, విద్యార్థులు అందుసభ్యులు. చంద్రుఁడు సభాఽకాశమునకు చంద్రుఁడే. దానిలో దేశీయ సాంఘికవిషయములపై తీవ్రమగు చర్చలు

జరుగుచుండును. యుక్తియుక్తమగు చంద్రుని యుపన్యాస ధోరణికి ప్రొఫెసరులందరు "వీని కింతటి శక్తి ఎట్లలవడెనా" యని ఆశ్చర్య పడుచుండిరి. ఆతడు మామూలు కుడితినీ తొడుగుకొని గంభీరముగా వేదికను నెక్కగ నే సభాసదులు వానిని రెప్పవాల్పక చూచుచు అతని యుపన్యాసము విన కుతూహలురై యుందురు. వాని వాక్చాతుర్యము, శబ్దపాటవము అందఱు గమనించి "సరస్వతి ఏమైన వచ్చి వీనికిసాయ పడుచున్నదా" యని భ్రమపడుదురు. ఆతఁడు వేదికమీఁద నున్నంతవఱకు సభ్యులు మంత్రముగ్ధులుగా నుందురు. వాని ప్రతి వాక్యము హృదయంగమముగా నుండును. నోటినుండి మాట వెలువడగనే అందఱు హర్షధ్వనులు గావింతురు. అందువలన ఆతని యుపన్యాసము అందఱికన్న చివఱనుండును. వెనుకవచ్చినవారి కాశాభంగము కలుగుననియు ముందువచ్చినవారు శ్రద్ధగా సభాంతము వఱకు ఓపికతో నుండరనియు కార్యక్రమ మావిధముగా ఏర్పఱతురు. సాహిత్యము, చరిత్ర పరిశోధన ఆతని కభిమానవిషయములు. జాతుల యౌన్నత్యము, అవనతి, వాని వలన కలిగినమార్పులు తరుచుగా విమర్శించుచుండును. అట్టి పరిశ్రమకు సమస్యల సాధు నాదము నే తనకు బహుమానముగా భావించును. వాని కట్టి యుత్సాహ ముండుటను చూచి అందఱు "భావికాలమందీ మొలక వృక్షమై ఎట్టిఫలవృక్షములతో విరాజిల్లునో" యని తలఁచుచుందురు. ఇంతవఱ కాతఁడు తన భావికాల మెట్లు గడపుకొనవలయునో నిర్ణయించుకొనక, ఒక ప్పుడు "గొప్ప ప్రొఫెసరునై మంచిమంచి పుస్తకములు వ్రాయుదు" ననియు, మఱొకప్పుడు 'న్యాయవాదిని కావలె' ననియు, ఇంకొక ప్పుడు "విద్యార్థివేతనము లభించిన ఐ. సి. ఎస్. కు పోవలయు" ననియు అనుకొనును. అందుచే నతఁ డేదియు నిర్ధారణచేసుకొనలేదు.

ప్రతాపచంద్రుఁడు కేవలము ఉపన్యాసములతోను, ఆటపాటల

తోను కాలక్షేపము చేయక తీరిక చిక్కినపుడు ప్రజాహితకార్యము లందు పాటుపడు చుండును. ఆతఁడు దారహృదయుఁ డగుటచే సామాన్యులతో కలసి మెలసి సంచరించును. తరచుగా చంద్రుఁడు నిమ్న జాతులవారు అధికముగా నివసించు గూడెములకు, పల్లెలకు పోవు చుండును. ఏమానవులను చూచినంతనే అగ్రవర్ణములవారు అగ్నిని తాకిన ట్లదరిపడుదురో వారి సరసన చంద్రుఁడు తెగి జోలెలుగా వ్రేలాడు కుక్కిమంచములో కూర్చుండి ఎంతో సేపు సంభాషించుచుం డును. అందువలన నా పేటలోనివారు ఆతడన్న ప్రాణములు విడుచు చుండిరి. అశ్రద్ధ యనునది ఏమాత్ర మాతనికి లేనేలేదు. ఎటువంటి యనాథునైనను రక్షించుటకు చంద్రుఁడు సిద్ధపడును. పూరి కొంప లలో మంచముపట్టి మూల్గుచుండెడి రోగుల కాళ్లకట్ట కూర్చుండి, ఎన్నో రాత్రులు కన్నుమూయక ఆతఁడు గడపెను. అట్టి యుదార హృదయు డైనందుననే ఒక సేవాసంఘమును స్థాపించి రెండు సంవత్సరములలో తానుచేసిన నిరంతర సాంఘికసేవ వలన ప్రయాగలోని అందఱ మన్ననలు పొందెను.

కమలాచరణుఁడు ప్రయాగకు వచ్చినపుడు ఆతనిని చంద్రుడు బాగుగా ఆదరించెను. వాని ద్వేషాగ్ని క్రమముగా చల్లారెను. ప్రజ రాణి జబ్బుపడినపుడు ఆవార్తవిని వచ్చి యామెకు తనముఖము చూపినవెంటనే, ఆశ్చర్యముగా రోగము నయమయి యుల్లాసముతో నుండుట చూచి "నామీఁద ప్రజరాణికున్న విశ్వాసములో, అరపాలైన కమలాచరణుని మీాద లేదు" అని చంద్రుడు బాగుగా నిశ్చయించుకొనెను. ములుకులవంటి తన మాటలచే సుశీల చచ్చునంత దాక ఏడ్చిఏడ్చి చివరకు ప్రాణము పోవునపుడు తన యపరాధములు క్షమింపుమని వేడుకొనుట ఆతడు తలచుకొని ప్రాయశ్చిత్తము చేసుకొందునని నిర్ణయించుకొనెను. చంద్రుఁడు కమలాచరణుని ఆదరిం

చుచు ఆతనికి తెలియని పాఠములు చెప్పుచు తమ్మునివలె చూచు కొనుచుండెను.

చంద్రుఁడింతసహాయము చేయుచున్నను, అదేమి పాపమో కాని కమలాచరణుని మనస్సు చాల ఆందోళన చెందుచుండెను. తన హృదయావేదన తెలుపుకొనుటకు హాస్టలులో ఒకడైనను వానికి నచ్చినవాఁడు కాన్పింపకుండెను. చంద్రునితో మనఃపూర్వకముగా మాట్లాడుచున్నను, ఎన్నో సంగతులు గూఢముగా నుంచెను. తనకు తగిన స్నేహితుఁడు లభించనందున ఒంటరిగా ఉండుటచే ఏమియు తోఁచక "నాకీ అవస్థయంతయు వ్రజరాణి వల్లనే లభించెను" అను కొని యామెను దూషించుచుండును. "దానికి నామీఁద ప్రేమలేదు. నోటితోడను కలముతోడను ప్రకటించు ప్రేమ లెక్కలో చేరినదా? నాగుండె పెకలించి చూపినను కేవలము కలముతో చూపవలసినంతే చూపును. కాని అంతకు మించదు. అట్టి పాషాణమూర్తి యెదుట నాతల పగులగొట్టుకొన్నను వచ్చు లాభమేమి?" అనుకొనుచు విముఖత్వము వహించి వ్రజరాణికి ఉత్తరములు వ్రాయుటకూడ మానుకొనెను. పాపమామె తన మనోవేదన ఉత్తరములందెంతవివ రించినను కమలాచరణుఁడు వానిని నలిపి యావల పాఱవేయుచు ప్రత్యుత్తరమిచ్చుట మానుకొనెను. అథవా ఎన్నఁడైన ఇచ్చినను కట్టెవిరిచి పొయిలో పెట్టినట్లుండును. వ్రజరాణి యనురాగ భరితము లగు మాటలు, వియోగకాల మందలి యశ్రుపూరిత నేత్రములు, 'ఉత్తరములు వ్రాయుచుండుఁడు' అని వినయముతో చాచిన కోమల హస్తములు ఆతఁడు తలఁచుకొని అప్పుడప్పుడు మాత్రము కొంచెము మెత్తపడుచుండును.

క్రమముగా కమలాచరణుఁడు తన మనోరంజకమగు విధానము యోజింపదొడఁగెను. ఈడు ముదిరి కొంచెము ప్రయోగనీళ్లొంట

బట్టగనే సుందరోద్యానమున విహరించుట కాతనికి కుతూహల మంకు రించెను. సౌందర్యోపాసనయే ఆతని లక్ష్యమయ్యెను. శరీర సంరక్ష ణకు భోజనము వలెనే మానసిక సంరక్షణకు అది యవసరమని అత నికి దృఢముగా తోఁచెను. హాస్టలు నానుకొనియే యొక పూలతోఁట యుండెను. దానిని కాపాడుటకు యజమాని మాలిని ఉంచెను. అత నికి సరయూదేవి యను పడుచుకూఁతు రున్నది. ఆమె చూచుట కంత చక్కనిది కాకున్నను కమలాచరణుని కాలము గడపుటకు తగియేయుండెను. ఆతఁడు ఆమెను లోపఱచుకొన ప్రయత్నించిసాయం సమయమున ఉద్యానవనములో షికారు చేయసాగెను. పిల్లలందరితో మైదానమున కసరత్తు చేయుచు ఆతడు తోఁటలోనికి తొంగితొంగి చూచును. ఎటులయిన నేమి, కాలక్రమమున నిరువురకు పరిచయము కలిగెను. ఆతఁడు మల్లెపూవులు కొని ఆమెకు నాలుగింతలు వెల యిచ్చును. పండుగలందు మాలికి అందఱికన్న నెక్కువ డబ్బు బహు మతి ఇచ్చును. చివర కాయువతి కమలాచరణుని మోహపాశము లందు చిలుకవలె చిక్కెను. రెండుమూఁడు సారులు అంధకారమున ఆలింగనములు కూడ జరిగెను.

ఒకనాఁటి సాయంకాలమున కమలాచరణుఁడు ఉద్యానవనములో ఒంటరిగా విహరించుచు మాలి యింటివైపు తొంగితొంగి చూచెను. వెంటనే సరయూదేవి గుడిసెలోనికి రమ్మని సైగచేసెను. కమలాచరణుఁడు ఇదే సమయమనుకొని మునివ్రేళ్లమీఁద పోయి గుడిసెలో దూరెను. సరయూదేవికి కమలాచరణుఁడు కొనియిచ్చిన బుక్‌మల్ చీరె కట్టుకొని వాయిలుపూల శిల్కుజాకెట్టు తొడిగికొని యుండెను. నేఁడు ఆతనిదృష్టి కా యువతి జగన్మోహినిగా కానఁ బడెను. లేకున్న అంతటి ధనాఢ్యుఁడు ఈవిధమున ఆమెకు వశవర్తి యగుటకు కారణమేమి? ఆతఁడు బోర్లించినచట్టిపై కూర్చుండి విట

కత్తిచేయు హావభావములు తదేకదృష్టితో చూచు చుండెను. ప్రజ రాణికన్న ఈమె ఏవిషయమందును లోటుగ లేక బాగుగా నచ్చి యుండెను. రంగు కొంచెము జీడిగింజను పోలి యున్నను, అదే మంతగా మోహముస కడ్డునచ్చుట లేదు. ఆమెకు కమలాచరణుఁ డన్న ఎంతో ప్రేమ. ఎప్పుడైన అతడు కాశీ పోవలయునని ప్రయాణమయి నప్పుడు ఆమె వెక్కి వెక్కి యేడ్చుచు వచ్చి యతనిచేయి పట్టుకొని "మిమ్ము విడచి యుండలేను. నన్ను కూడ తీసుకొని పొండు" అని కాళ్ల కడ్డుపడుచున్నందున "స్వభార్యకన్న ఈమెకే నామీద ఎక్కువ ప్రేమకల"దని ఆతఁడు భావించెను. నిదర్శనముగా కంటికి కానిపించు ఈప్రేమ యెక్కడ? ఔదాసీన్యభరితమై నిర్దయతాపూర్ణమైన ప్రజ రాణి అభ్యర్థన లెక్కడ అని యతని భ్రమ.

పాపము కమలాచరణుఁడు ప్రియురాలిని కన్నుల కరవుతీర చూడకుండగనే ఆమెతండ్రి వచ్చి తలుపు తట్టెను. ఏమి చెప్పవలయును! కత్తిగాటు వేసినను కమలాచరణుని ముఖముపై నెత్తురుచుక్క లేదు. ఆతడు చాల చిన్నబోయి ప్రాణములో ప్రాణము లేక సరయూదేవి యొద్దకు వెళ్లి "నేను ఎక్కడికి వెళ్లుదును" అని యడిగెను. ఆందోళనలో చిక్కియుండుటచే సరయూదేవికి నోటమాట రాకుండెను. ఇంతలో మూలి మరల తలుపు తట్టెను. పాపము సరయూదేవి ఏమియు తోఁచక చిత్రప్రతిమవలె నుండెను. కొంతసేపటికి గడగడ వణకుచు మెల్లగా తలుపు తెఱచెను. కమలాచరణుఁడు ఊపిరైన విడువక యొకమూల నక్కెను. కత్తిక్రింది గొఱ్ఱెతలవలె మూలనొదిగి యున్న యాతని హృదయము గిజగిజ కొట్టుకొను చుండెను. ప్రాణములమీఁది యాశ వదలుకొని నిర్మలమనస్సుతో "ఈశ్వరా! బుద్ధి లేక చేసిన ఈ యపచారము క్షమింపుము. ఇఁక ఎన్నడిట్టి పనికిమాలిన పని చేయను" అని యతఁడు ప్రార్థించుచుండెను.

ఇంతలో మాలి దృష్టి యతనిపై బడెను. వాఁడు మొదట కొంచెము తికమకపడి తరువాత దగ్గఱకు పోయి "ఎవడా నిలువబడినది" అని యఱచెను.

ఆమాట వినుటతోడనే కమలాచరణుఁడు గప్పని గంతువేసి బయటికి పరుగెత్తెను. మాలి బడితెతీసుకొని "ఎక్కడికి పోదువు, నిలు నిలు" అని వెంటబడెను. పండుగ పబ్బములకు కోరిన బహుమతి నిచ్చు కమలాచరణుఁడే నేఁడు పరుగెత్తునది. 'దొరగారు' 'దొరగారు' అని చేతులు నలుపుకొనుచు తిరిగెడి మాలియే ఇప్పుడీవిధమున అతనిని కుక్కను తరిమినట్లు తరుముచున్నాఁడు. ఎంతో గౌరవముతో, రాజసముతో తిరుగు సంపన్నునకు ఇట్టి దుర్గతియేల? పాపాగ్నికుండము సమస్తాదరములను, గౌరవములను, సాహసములను, ధైర్యములను, క్షణకాలములో బూడిదచేయును కదా!

కమలాచరణుఁడు చెట్లను తీగెలను చాటుచేసికొని పరుగెత్తి తోఁటలో నుండి బయటపడెను. రోడ్డుమీఁద ట్రాముబండి పోవుచుండ వెళ్లి దానిలో కూర్చుండి రొప్పిరొప్పి సొమ్మసిలి బల్లపై బడెను. మాలి తనయిల్లుదాటి పట్టుమని పదిగజములైన వెంబడి పడలేదు కాని, ప్రపంచమంతయు తోఁటమాలిగా తోఁచుచుండ వచ్చుపోవు వారిని బెదరి బెదరి చూచుచుండెను. వాని మందభాగ్యము మఱియొకచావు తెచ్చిపెట్టెను. స్టేషను చేరుటతోడనే భయోద్వేగముచే వెనుకముందు చూడక బండిలో కూర్చుండెను. "నేనెక్కడికి పోవలయును?" అను విచారమే లేక టిక్కట్టు సహితము తీసుకొనుట మఱచి పోయెను. "ఎక్కడికైననేమి? ఈపట్టణమునుండి దాటిపోయినమాత్రము చాలు దేవుడా!" యని అతఁడు తలఁచెను. బండి కొంచెము దూరము సాగిపోవగనే ఒక తెల్లదొర లాంతరు పట్టుకొని టిక్కెట్లు తనిఖీ చేయుచు వచ్చుచుండెను. ఆతనివెంట ఒక నౌకరుండెను. ఆ నౌకరును

చూచి పోలీసువాఁ డనుకొని కాళ్లుచేతులు గడగడ లాడుచుండ కమలాచరణుని గుండె గుభేలు మనెను. ఆదారిన తన ప్రక్క పెట్టెలో నున్నంతవరకును ఎట్లో ఓపిక తెచ్చుకొని కూర్చుండెను. కాని తన పెట్టెతలుపు తీయగనే వానికి ఒడలు తెలియక పోయెను. కన్నులకు చీకట్లు క్రమ్మెను. ఏమియు తోఁచక రెండవవైపు తలుపుతీసి బండి పోవుచున్నను క్రిందికి గంతువేసెను. ఆతఁడట్లు దుముకుట దొర, నౌకరు చూచిరి. "వీడెవడో అలవాటుపడిన దొంగ నేడు మనకు బహుమానమే గాక వేతనాభివృద్ధి కూడ కలుగును" అని యూనం దము పట్టజాలక దొర వెంటనే ఎఱ్ఱలాంతరు చూపించెను. నిముష ములో బండి ఆగెను. గార్డు మఱికొందఱు దిగి లాంతరులు వేసికొని ఇక్కడ నక్కడ చూడ దొడఁగిరి. "అరే, వాఁడెవడో పక్కాదొంగ, వీరికి దుమ్ముకూడ చిక్కదు. అప్పుడే వాడు పారిపోయినాడు" అని యొకఁ డనెను. "వీరందఱు ఒకటేరా" అని మఱొకఁ డనెను. ఇట్లను కొనుచుండ గార్డు ముందుకు పోయెను. ఆతఁ డట్లేల పోవుచుండెను? వేతనాభివృద్ధి కొఱకే. కమలాచరణుఁడు బండిలో నుండి దూకిన చోటికి ఆతఁడు పోయెను. ఇంతలో జవాను అక్కడ నొకగుంట యుండ దానివైపుచూపి "అదిగో ఆతెల్లని దేమిటో చూడుడు. నాకెవరో మనుష్యునివలె తోఁచుచున్నది" అనెను. తరువాత మఱి కొందఱు చూచి "నిజముగా ఆదొంగ ఇక్కడెక్కడనో దాగినాడు, అందఱువచ్చి కమ్ముకొనుడు" అనిరి. కాని ఒక్కఁడును ముందుకు ప్రొగ్గలేదు. "దొంగ ప్రాణములకు తెగించి వచ్చును" అని తలఁచి గార్డు పిస్తోలు సరిచేసుకొనెను. నౌకరులు లాటీలు తీసికొనిరి. దొంగ కనుపడిన పాఱిపోవుటకు వీలుగా నుండుటకై కొందఱు చెప్పులు చేత బట్టుకొనిరి. దొంగదగ్గఱకు పోవుటకు ఎవరిప్రాణము మీఁదికి కేమంత వచ్చినది? దూరమునుండియే రాళ్లువేసి చంపుదమని యనువుగు పెద్ద

పెద్ద రాళ్లుతీసికొని పూనుకొని నిలువఁబడిరి. కాని దగ్గఱకు వెళ్లి చూడ దొంగలేడు. నవనాగరకుడైన సంపన్న యువకుడు నేల కఱచుకొని పడియుండెను. వాని ముక్కునుండి, నోటినుండి రక్తము ప్రవహించుచుండెను. కమలాచరణుఁడు ఇక్కడ ప్రాణములు విడచెను. ప్రజరాణి అక్కడ పీడకల కనెను!

౧౫

సౌభాగ్యవతియగు స్త్రీకి ప్రంచమందలి సమస్తపదార్థముల కన్న తన పతియే పరమోత్కృష్టము. ఆమె ఆయన కొఱకే బ్రతుకును; ఆయన కొరకే మరణించును. ఆమె దరహాసము, మధురభాషణము నాతని ప్రసన్నుని చేసికొనుటకే. దిన దినము నూతనముగా ధరించెడు మాల్యాంబరంబులు, అమూల్య భూషణములు అతని హర్షింపఁజేయుటకే. అతని సాంగత్యమే ఆమె జీవితము. ఆతని యంతమే ఆమె యంతము!

కమలాచరణుని యకాలమరణము ప్రజరాణికి మృత్యుసమానమే. ఆమె నూతనోద్దేశములు, ఉత్సాహములు భంగములై మట్టిలో కలిసెను. ఆమె యేమను కొనెను? ఏమయ్యెను? ప్రతినిముషము కమలాచరణునిరూప మామెకన్నుల యెదుట పరిభ్రమించుచుండెను. నిముషము కన్నులు మూతపడినచో నాతనిరూపము సాక్షాత్కరించుచుండెను.

ఒకానొక కాలమున సంసార తాపత్రయములు కొందఱు వ్యక్తులకు, కొన్ని కుటుంబములకు ప్రీతికరములుగానే యుండును. కమలాచరణునికై కార్చిన కన్నీళ్లు తుడుచుకొను చుండగనే శ్యామాచర

ణునివంతు వచ్చెను. కేవలము శాఖలు నఱకుటవలన మూలమున కే హానియు జరుగలేదని తలంచి భగవానుఁడు మూలమునకే ముప్పు కల్పించెను. రామదాసు చాల పక్కా మనుష్యుఁడు. శ్యామాచరణుఁడు మధ్యపురమునం దున్నంతకాలము ఆతఁ డొదిగి యొదిగి యుండి, వారు కాశీనగరమువైపు మరలగనే చిక్కులు కల్పింప నారంభించెను. అందుచే నూరంతకు నాతఁడు శత్రువాయెను. పోలీసం డుగనాఁడు రైతులందఱు తనను చూచిన కోరచూపు నాతఁడు మఱువక సమయమున కయి వేచియుండెను.

మధ్యపురము చేరిన పోలీసుస్టేషను సబినస్పెక్టరు చాలకంకుష్టుఁడు, ధూర్తుఁడు, లంచగొండి. వేయిరూపాయ లవచ్చి చేతిలోపడినను చాలు నని తలయూచడు. కేసు మోపుటలో మిగుల నేర్పరి. ఆతఁ డెవరి మీఁదనైన కేసు మోపెనేని యది బ్రహ్మదులు తలక్రిందైనను తొలఁగఁజాలదు. పై యధికారులందఱకు ఆతని చేష్టలు తెలియును. కాని యతని కార్యదక్షతవలన వారిమాటలు బొత్తుగా సాగుటలేదు. రామదా సీరావణాసురుని పట్టుకొని తన హృద్రోగమునకు తగిన మందు కోరెను. తరువాత వారమురోజులకు మధ్యపురమున దోపిడి జరిగెను. ఒక షాహుకా రెచ్చటినుండియో వచ్చుచు నాయూరిలో దిగగా కొందఱు దొంగలు ఆయన డబ్బు దోచుకొనిరి. ఉదయమున ఇనస్పెక్టరు గ్రామములోనివారి నందరిని ఒక త్రాటఁగట్టి తీసికొని వెళ్ళెను.

దైవవశమున ఆ కేసు శ్యామాచరణుని పాలబడెను. మొదటి నుండియు ఆయన ఈసంగతి బాగుగా కనిపెట్టెను. ఇన్స్పెక్టరుపై ఆయన చాలరోజులనుండి కన్ను వేసియుండెను. అప్పుడు జరిగిన తీవ్ర విచారణవలన ఇన్స్పెక్టరు గుట్టు బయటపడెను. ఆఱుమాసముల వఱకు చాల గందరగోళముగా ఈ కేసు జరుగుచునేయుండెను. ప్రభుత్వ

న్యాయవాదు లెన్నో యుపాయములు చేసిరికాని, ఇంటిదొంగ నెవ రెఱుఁగరు? ముద్దాయీల నందఱను విడుదలచేసి, ఇన్‌స్పెక్టరును పని నుండి తొలగించినట్లు తుదకు తీర్పు చెప్పఁబడెను.

డిప్టీకలెక్టరు శ్యామాచరణుఁడు తీర్పుచెప్పి వెళ్లగనే విశ్వాస పాత్రుఁడగు నొక యుద్యోగి "అయ్యా! ఇన్‌స్పెక్టరు చెడ్డసలువ. చాల జాగ్రతగా నుండవలయును. ఈనాడు పట్టరాని కోపముతో నున్నాఁడు. ఇదివఱ కిద్దరు ముగ్గురు ఇతనివలన చాల నష్టపడిరి. మిమ్ముకూడ నూరక వదలడు" అని చెప్పెను. శ్యామాచరణుఁడు విని మందహాసముచేసి యతనికి ధన్యవాద మొనరించెను. కాని తన రక్షణకై కట్టుదిట్ట మేమియు చేసికొనక ఉపేక్షించెను. గొల్ల రాధా రాముఁడు "మీవెంట నుండెదను" అని యెన్నోసారులు నిర్బంధ పెట్టెను. కాశీరాముఁడు వెంటబడెను. కాని యెవరిని దగ్గఱ నుంచు కొనక మామూలుగానే ఆయన యప్రమత్తుఁడై తన పనులు నిర్వ హించు కొనుచుండెను.

జలీమ్‌ఖాను చాల ధనాశకలవాఁడు. వాఁడు తనజీవితముపై నాశ వదలి శ్యామాచరణుని వెంటనంటెను. ఒకనాఁడు ఆయన మధ్య పురమునుండి చీఁకటిపడిన తరువాత వచ్చుచు పిచ్చి యాస్పత్రిని చూచుటకు బగ్గీబండిలోనుండి దిగుచుండ చెట్టుచాటునుండి జలీము ఖాను తుపాకి కాల్చగా ధామ్మని చప్పుడయ్యెను. గుండు శ్యామా చరణుని వక్షస్థలమును దూసికొని యావలికిపోయెను. ఆ స్పత్రిలోని వారందఱు పరుగిడివచ్చి జలీముఖానును పట్టుకొనిరి. ఈ పనిలో గుజ్జువాఁడు చాల తోడ్పడెను.

ఈ దుర్ఘటనమువలన శ్యామాచరణుని కుటుంబము విచ్ఛిన్న మయ్యెను. ప్రేమవతి చాల శాంతస్వభావురాలయినను, అభిమానము కలది. కాని యీ యకాలమరణమువలన ఆమె స్థితిగతులందు చాల

పరివర్తనములు కలిగెను. మాటమాటకు ప్రజారాణిపై మండిపడుచు, దుర్భాషలతో నామెను చాల నేడ్పింపమొదలిడెను. ఈ పాపిష్ఠి కోడలువచ్చి అడుగుపెట్టగనే తన కొంప కింతటి యనర్థము వాటిల్లె నని యామె నమ్మకము. అనేకపర్యాయము లామె యెదుటబడియే "నీ మొఖముమీది తళుకుబెళుకులుచూచి సంతసించితిని కాని నీ అరి కాలిలో ఇట్టి దౌర్భాగ్యరేఖ యున్నదని తెలియనైతిని" అనెను. ఈ మాటలన్నియు పడుచు ప్రజారాణి మనసు రాయిచేసికొని కాలము గడపుచుండెను. "దుర్దినములు వచ్చి నెత్తినకూర్చుండి తాండవించు చున్నపుడు మధురభాషలు నా కెన్నడైన వినబడునా" యని ఆమె యనుకొనుచు ఎనిమిదిజాములు తాపమునొందుచున్నను కన్నీరైన కారుచుండుటలేదు. ఓదార్చువారుండి బుజ్జగించునపుడే అశ్రువులు ప్రవహించును కాని దిక్కులేక అనాధగానున్నపుడు అవి వెలువడక పరాభవాగ్నిచే కన్నులందే యింకిపోవును!

ఒకనాడు ప్రజారాణి యింటిలో నుండియుండి ఏమియు తోచక చికాగుగా నుండుటచే కొంచెము సేపు పూలతోటలోనైన నుండదమని అందులోనికి పోయెను. ఆహా! ఆవాటికయందెట్టి యానంద దిన ములు గతించినవి. అందలి ప్రతిమొక్కయు అంతిమ ప్రేమను వెల్ల డించుచుండెను. ఆపుష్పములను, పత్రములను చూచి హృదయమున కమితానందము తెచ్చుకొని పరిమళ మందమారుతమున శిరమునకు హాయి కల్పించుకొనిన దినములు కలవు. అనేక సాయంకాలములందు భార్యాభర్తలు ప్రేమాలాపముగ్ధులై గడపిన స్థలమే యిది. అప్పుడు పూలమొగ్గలు తమ లేతపెదవులతో నామెకు స్వాగతమిచ్చెను. నేడవి యన్నియు అవనత శిరములతో వదనములు మూసికొని యున్నవి. ఆమె ముగ్ధమాలినిగా పూలదండ సేకరించిన ప్రదేశము కాదా యిది? కాకేమి. కాని యీ స్థానమందే నేడు కన్నులనుండి

న్యాయవాదు లెన్నో యుపాయములు చేసిరికాని, ఇంటిదొంగ నెవ రెఱుఁగరు? ముద్దాయీల నంకఱను విడుదలచేసి, ఇన్‌స్పెక్టరును పని నుండి తొలగించినట్లు తుదకు తీర్పుచెప్పఁబడెను.

డిప్టీకలెక్టరు శ్యామాచరణుఁడు తీర్పుచెప్పి వెళ్లగనే విశ్వాస పాత్రుఁడగు నొక యుద్యోగి "అయ్యా! ఇన్‌స్పెక్టరు చెడ్డసలువ. చాల జాగ్రతగా నుండవలయును. ఈనాడు పట్టరాని కోపముతో నున్నాడు. ఇదివఱ కిద్దరు ముగ్గురు ఇతనివలన చాల నష్టపడిరి. మిమ్ముకూడ నూరక వదలడు" అని చెప్పెను. శ్యామాచరణుఁడు విని మందహాసముచేసి యతనికి ధన్యవాద మొనరించెను. కాని తన రక్షణకై కట్టుదిట్ట మేమియు చేసికొనక ఉపేక్షించెను. గొల్ల రాధా రాముడు "మీవెంట నుండెదను" అని యెన్నోసారులు నిర్బంధ పెట్టెను. కాశీరాముడు వెంటబడెను. కాని యెవరిని దగ్గఱ నుంచు కొనక మామూలుగానే ఆయన యప్రమత్తుఁడై తన పనులు నిర్వ హించు కొనుచుండెను.

జలీమ్‌ఖాను చాల ధనాశకలవాఁడు. వాఁడు తనజీవితముపై నాశ వదలి శ్యామాచరణుని వెంటనంటెను. ఒకనాఁడు ఆయన మధ్య పురమునుండి చీఁకటిపడిన తరువాత వచ్చుచు పిచ్చి యాస్పత్రిని చూచుటకు బగ్గీబండిలోనుండి దిగుచుండ చెట్టుచాటునుండి జలీము ఖాను తుపాకి కాల్చగా ఢామ్మని చప్పుడయ్యెను. గుండు శ్యామా చరణుని వక్షస్థలమును దూసికొని యావలికిపోయెను. ఆస్పత్రిలోని వారందఱు పరుగిడివచ్చి జలీముఖానును పట్టుకొనిరి. ఈ పనిలో గుఱ్ఱపువాఁడు చాల తోడ్పడెను.

ఈ దుర్ఘటనమువలన శ్యామాచరణుని కుటుంబము విచ్ఛిన్న మయ్యెను. ప్రేమవతి చాల శాంతస్వభావురాలయినను, అభిమానము కలది. కాని యీ యకాలమరణమువలన ఆమె స్థితిగతులందు చాల

పరివర్తనములు కలిగెను. మాటమాటకు వ్రజరాణిపై మండిపడుచు, దుర్భాషలతో నామెను చాల నేడ్పింపమొదలిడెను. ఈ పాపిష్ఠి కోడలువచ్చి అడుగుపెట్టగనే తన కొంప కింతటి యనర్థము వాటిల్లె నని యామె నమ్మకము. అనేకపర్యాయము లామె యెదుటబడియే "నీ మొఖముమీది తళుకుబెళుకులుచూచి సంతసించితిని కాని నీ అరి కాలిలో ఇట్టి దౌర్భాగ్యరేఖ యున్నదని తెలియనైతిని" అనెను. ఈ మాటలన్నియు పడుచు వ్రజరాణి మనసు ఱాయిచేసికొని కాలము గడపుచుండెను. "దుర్దినములు వచ్చి నెత్తినకూర్చుండి తాండవించు చున్నపుడు మధురభాషలు నాకెన్నడైన వినబడునా" యని ఆమె యనుకొనుచు ఎనిమిదిజాములు తాపమునొందుచున్నను కన్నీరైన కారుచుండుటలేదు. ఓదార్చువాడుండి బుజ్జగించునపుడే అశ్రువులు ప్రవహించును కాని దిక్కులేక అనాథగానున్నపుడు అవి వెలువడక పరాభవాగ్నిచే కన్నులందే యింకిపోవును!

ఒకనాఁడు వ్రజరాణి యింటిలో నుండియుండి ఏమియు తోఁచక చికాకుగా నుండుటచే కొంచెము సేపు పూలతోఁటలోనైన నుందమని అందులోనికి పోయెను. ఆహా! ఆవాటికయం దెట్టి యానంద దిన ములు గతించినవి. అందలి ప్రతిమొక్కయు అంతిమ ప్రేమను వెల్ల డించుచుండెను. ఆపుష్పములను, పత్రములను చూచి హృదయమున కమితానందము తెచ్చుకొని పరిమళ మందమారుతమున శిరమునకు హాయి కల్పించుకొనిన దినములు కలవు. అనేక సాయంకాలములందు భార్యాభర్తలు ప్రేమాలాపముగ్ధులై గడపిన స్థలమే యిది. అప్పుడు పూలమొగ్గలు తమ లేతపెదవులతో నామెకు స్వాగతమిచ్చెను. నేఁడవి యన్నియు అవనత శిరములతో వదనములు మూసికొని యున్నవి. ఆమె ముగ్ధమాలినిగా పూలుకొండ సేకరించిన ప్రదేశము కాదా యిది? కాకేమి. కాని యీ స్థానమందే నేఁడు కన్నులనుండి

స్రవించెడు ముత్యములను హారముగా సేకరింపవలసి వచ్చునను విష యము ఆముగ్ధబాలికకు తెలియలేదు. ఆసంగతు లన్నియు తలఁ పోయు చుండగనే కమలాచరణుఁడు చిఱునగవుతో వెడలివచ్చిన నీల కుంజముపై నామెదృష్టి పడెను. ఆకులు కదలుచు నామెచీర తళుకును చూచుచున్నటు లుండెను. అప్పుడామె వదనమందు అస్తమించు చున్న సూర్యకిరణముల ప్రతిబింబము గంగాజలమందువలె మంద హాసము ప్రకటమగు చుండెను. అపు డాకస్మికముగా ప్రేమవతి వచ్చి కఠోరముగా "ఇప్పుడు నీకీ షికారులే తక్కువైనవే, మాతల్లీ" అనెను.

ప్రజరాణి నిలువబడియే యేడ్చుచు "అత్తయ్యా! భగవంతుడు ఓర్వలేక నాకీవ్రాత వ్రాసినాడు. మీరుకూడ నిట్లే చూడవలయునా!" అనెను.

* * * *

ప్రేమవతి నెలరోజులకే కాశీలోని తన సామగ్రి నమ్మి మధ్యాహ్న రమునకు వెడలిపోయెను. ప్రజరాణిని వెంట తీసికొని పోలేదు. ఆమె ముఖము చూచుటతోడనే ప్రేమవతి మండిపోవు చుండెను.

విశాలభవనమున ప్రజరాణి యొంటరిగా చిక్కిపోవుచుండెను. మాధవి తప్ప ఆమె హితైషిణు లెవ్వరును లేరు. ఆమె కిట్టియగచాట్ల వ్రాతచూచి సువామ తన కూతురికి కలిగినట్లే తలపోసి యెంతో మొత్తుకొనుచు అప్పుడప్పుడు ఆమెయొద్దకు వచ్చుచు ధైర్యముచెప్పి పోవుచుండెను. ఒక్కొక్కప్పుడు ఆమె ఒంటరిగా అచ్చట దినములు గడపుటకన్న తనయొద్దకు వచ్చియున్న కొంత సుఖముబ్బునేమోయని తలచి సువామ చాలసార్లు ప్రజరాణిని పిలువఁబోయెను. కాని ప్రజ రాణి యిష్టపడక "ఇంటికైనవాఁడు మరణించి ఆఱుమాసములైన్న కాకముందే యింతవేగముగా నీయిల్లు పాడుపెట్టి అత్తకోడండ్రు గ్రుద్దులాడి ఎక్కడివారక్కడ ఎగసిపోయి" రని లోకు లనుకొందు

రనెను. అందువలన సువాము కొంత నొచ్చుకొనెను.

మధ్యపురములో ప్రేమవతివలన చాల కల్లోల ముదయించెను. ఆమె రైతులను అనరానిమాట లనెను. చాకిరివాండ్రను చెప్పులతో పూజించెను. కరణములను వేపుకొని తినెను. రాధారాముని యావును బలవంతముగా లాగుకొనెను. గ్రామస్థులందఱు భయపడి యేకమై రాధాచరణునకు మహాజరుపంపిరి. వెంటనే యతఁడు "సంఘటించిన దుర్ఘటనలవలన అమ్మకు చిత్తచాంచల్యము కలిగినది. ఎటులైన కొంచెము నీవు పోయి ఆమె మనశ్శాంతి చేయుచుండుము" అని సేవతికి ఉత్తరము వ్రాసెను. అప్పుడు సేవతి పసిపిల్ల తల్లి. భర్తకూడ రెండు నెలలు సెలవు తీసికొని యింటికివచ్చి జమీందారుగారి ప్రైవేటు కార్యదర్శిగానుండెను. ఇట్టి సమయమున ఆమెతల్లిదగ్గఱ కెట్లుపోవును? నేఁడు, రేపు, నేఁడు, రేపు, అని యనుకొనుచుండఁగనే కొన్ని నెలలు గడచెను. ప్రయాణమయినపుడెల్ల బిడ్డ జబ్బుపడుటో, అత్తగారు మూతిముక్కు విఱచుకొనుటో, మంచిరోజు కుదురకుండుటో, తట స్థించుచుండ చివరకు ఆఱు నెలలైనమీఁద ఎటులనో అవకాశము చేసికొని యామె ప్రేమవతి దగ్గఱకుపోయెను.

సేవతి వచ్చినను ప్రేమవతి ఆవగింజంత మార్పునైనను చెందలేదు. కౌగలించుకొని యేడ్వలేదు. పసిబిడ్డను కన్నెత్తియైన చూడలేదు. ఆమె హృదయములో ప్రేమలేనేలేదు. అట్టిసమయముననే కృష్ణాష్టమి వచ్చెను. ఊరివారందఱు ఉపవాసముండి చందాలువేయించి ఆట నాడింపవలయునని తలపెట్టిరి. కాని ప్రేమవతి యానాఁడే జన్మకాల ఘడియలకు కృష్ణ విగ్రహమును ఇంటిలోనుండి వెకలించి ఊరిబయట పాఱవేయించెను. ఏకాదశీ ఉపవాసములు పోయెను. దేవతార్చన లంతకుమున్నే అడుగంటెను. వెనుకటి ప్రేమవతి కాదిపుడామె.

సేవతియెట్లో రెండు నెలలు గడపెను. మనసంతయు చాలవ్యాకుల

ముగా నున్నందున ఎవరితోనైన రవ్వంతమాటలాడుచు కాలము గడపుటకు అమ్మలక్కలెవ్వరు ఆమెకు దొరకలేదు. వ్రజరాణికి తులసి దొరకెను. కాని సేవతి స్వభావము సరళముగాదు. తక్కువజాతి స్త్రీలతో కలసిమెలసియుండుట గౌరవహానిగా ఆమెయెంచెను. పాపము తులసి ఒకటి రెండుసారులు సేవతిదగ్గఱకు వచ్చెనుకాని వచ్చినపుడెల్ల ఆమె మనసిచ్చి మాట్లాడక బొత్తుగా పల్కరించుటే కష్టమైనందున అచ్చటికి పోవ మానివేసెను.

మూఁడు నెలలైన తరువాత ఒకనాఁడు సేవతి ప్రొద్దెక్కువఱకు నిద్రించుచుండెను. నిదురలేచిచూడగనే ప్రేమవతి పసిబిడ్డను ఒడిలో చేర్చుకొని కన్నులు మూయుచు పొట్టమీఁద ముద్దుపెట్టుకొనుచు ఆడించుచుండెను. ఎదుట పొయిమీఁద హల్వా ఉడుకుచుండెను. పసిబిడ్డ దానివైపు వ్రేలితో సైగచేయుచు వేడివేడి హల్వా తినఁగోరుచుండెను. ఈరోజు ప్రేమవతి ముఖము కమలమువలె వికసించి కళకళలాడుచుండెను. ఆప్రదేశమున ప్రేమ స్థావరమేర్పఱచుకొనుటచే, ఇఁక తానుండరాదని తీవ్రదృష్టి నిష్క్రమించెను. సేవతికి తల్లిమీఁద నమ్మకము కలుగక మంచముమీఁదనుండి ఓఁరచూపుతోనే చూచుచుండెను. ఇంతలో ప్రేమవతి ప్రేమతో "లేవే, అమ్మాయీ. చాల ప్రొద్దెక్కినది" అనెను.

సేవతికి శరీరము గగుర్పొడిచి కన్నులవెంట అశ్రులు జలజలరాలెను. నేఁటి కెన్నో నెలలకు తల్లినోటినుండి అనురాగభరితమగు పలుకు వెలువడినందున ఆమె వెంటనే లేచి కూర్చుండి, తల్లిని కౌగిలించుకొని ఏడువ నారంభించెను. ప్రేమవతి నేత్రములందును కన్నీరు కాన్పించెను. కృశించిన వృక్షము నేఁడు కొంచెము పచ్చపడినది. ఇద్దఱు కొంతసేపు ఏడ్చి ఊరకొనినమీఁదట ప్రేమవతి "సేవతీ! వెనుకటి చర్యలవలన నీ కాశ్చర్యముకలిగినదా? ఆశ్చర్యమేబిడ్డా, కన్నులందశ్రులు లేనపుడు

ఏడుపెక్కడనుండి వచ్చును? గుండె రాయికాగా ప్రేమ ఎట్లుకనుపడును? కన్నీరు మీనాయనతో పోయెను. ప్రేమ తమ్మునితో పోయినది. ఈరోజు కారిన కెంపుబిందువులు ఎక్కడనుండి వచ్చినవో నాకే తెలియదు'' అనెను.

ఇట్లు పలుకుచుండగనే ఆమె కన్నులు మూతలు పడసాగెను. సేవతి తందరబిందర లాగుచు తల్లిని పఱుపుమీఁద పరుండబెట్టి విసన కఱ్ఱతో వీవ నారంభించెను. అప్పటినుండియు చూచినప్పుడెల్ల ప్రేమవతి ఏడ్చుచునే యుండెను. పసిబిడ్డను క్షణమైన దగ్గఱనుండి కదలనీయదు. ప్రతివారితో అమృతము చిలుకునట్లు మొదటివలె ఆమె మాటాడ సాగెను. ఆమె హృదయమునుండి యేదో తెరజారిపోయినట్లు తోఁచు చుండెను. తీవ్రమగు చలిగాలి తోలినప్పుడు శీఘ్రముగా నదులు మంచు గ్రమ్మును. అందలి జలచరములు మంచు తెరలో దాగును. పడవలు చిక్కుపడును. మందగమనము రజతవర్ణము కలిగి ప్రాణాధారమగు జలప్రవాహరూపము కొంచెముకూడ కనుపడదు. మంచు తెరచాటున ఆ మధుర నిద్రలో ఒడలు తెలియక పడియున్నను గ్రీష్మసామ్రాజ్యము వచ్చినపుడు మంచుకరగును. రజతనది మంచు తెరను తొలగించు కొనును. మరల చేపలు మొదలగు జంతువులువచ్చి నివసించును. నావలపై మనుష్యు లెప్పటివలె రాకపోకలు సాగింతురు.

కాని ప్రేమవతి కీదశ స్థిరముగా నుండక మృత్యుముఖమును సమీపించుచున్నట్లు గోచరించుచుండెను. ఇట్టి మనోవికారమే ఆమెనింత వఱకు జీవిత కారావాసమందుంచెను. కాకున్న ప్రేమవతివంటి కోమల హృదయ ఘోరయాతనా పరంపరల నింతకాలము సహించి యుండ గలదా?

అమ్మను చూచిపొండని సేవతి బంధువులకు తంతులిచ్చెను. కాని ఒక్కరైనరాలేదు. ప్రాణనాథునకు సెలవు దొరకలేదు. వ్రజరాణి

జబ్బుపడెను. రాధాచరణుఁడు వాయు పరివర్తనమునకు సిమ్లా వెళ్ళెను. పోయినవాఁడుపోవగా ఉన్న ఒకకొడుకునైన చూడవలయునని ఆమె ప్రాణమాపుకొనియుండ "ఇప్పుడు వచ్చుటకు వీలుకాదు" అని యతని నగ్గఱనుండి ఉత్తరము రాగానే ప్రేమవతి నిట్టూర్పు విడిచి కన్నులు మూసికొని పెద్దనిద్దురపోయి మరల లేవనేలేదు.

౧౯

మానవహృదయము గూఢవస్తువు. ఒకప్పుడది లక్షలకొలది ధనరాసులను కన్నెత్తిచూడక, ఒకప్పుడు పాతగుడ్డలకే పాలుపడును. ఒకప్పుడు వందలకొలది నిర్దోషులు మరణించినను "అయ్యో" యనక, ఒకప్పుడు పురిటిలో పోయిన బిడ్డకే అన్నము నీళ్లు వదలును. చంద్రునకు కమలాచరణునకు సహోదరప్రేమ యున్నను, కమలాచరణునకు సంభవించిన యాకస్మికమరణము వలన కలుగవలసిన శోకము చంద్రునకు కలుగలేదు. ఆతని మరణవార్త వినినంతనే యులికిపడి పదినిమిషములు చంద్రుఁడు చింతపడెను. కాని యది మిత్రుని మరణమునకు సరితూగునా? వ్రజరాణిని, పెండ్లి కానప్పటి నుండియే యతఁడు తోడబుట్టిన దానిగా భావించుచున్నను, అందు సంపూర్ణజయ మాతఁడు పొందలేదు. ప్రతి సమయమందును ఆతలఁపు ఆతని పవిత్ర బాంధవ్యసీమనుండి లంఘించి పోవుచుండెను. కమలాచరణునిపై ఆతనికి విశిష్టప్రేమ లేదు. కాని వ్రజరాణివిన్న కొంచెము ప్రసన్నముగా నుండుననియు, సుశీలకు తాను చేసిన దానికి కొంత ప్రాయశ్చిత్తముగా నక్కఱకు వచ్చుననియు నాతఁడు తలఁచి, ప్రయాగయందున్న కాలములో ఆతనిని గౌరవభావముతో చూచుచుండెను. వ్రజరాణి

అత్తవారింటికి పోయిన మీదట కొన్నిరోజులవఱకు చంద్రుడు ఆమెను తన హృద్వీథిని తలచలేదు. కాని యామె జబ్బుపడిన దను సంగతి తెలిసి కాశీవెళ్లినపుడు కలిగిన సంధానము వ్రజరాణికి సంజీవిగా పనిచేసెను. అప్పటినుండియు తనమీద ఆమెకున్న యనురాగములో వీసమైనను కమలాచరణునిమీద లేదని చంద్రునికి నమ్మకము కలిగెను.

కరుణాభరితములగు ఉత్తరము లెన్నో చంద్రుడు వ్రజరాణికి వ్రాసెను. కాని ఉత్తరములువ్రాయుచు "దీనివలన నేమి యుపతిల్లునో" అని యాలోచించు కొనుచుండెడువాడు. తరుచుగా సమవేదన ప్రేమను ప్రోథము చేయును. అందుచేత నీ యుత్తరములు కొంచెము పనిచేయుననుట ఆశ్చర్యమేమి ? ఇంతేగాక ఆతని ధార్మికప్రవృత్తి వికృతరూపము ధరించి, ఈశ్వరుడు తన యనురాగమును స్థిరముగా నెలకొల్పుట కయియే కమలాచరణుని తన మార్గమున కడ్డురాకుండ తొలగించెనను పిచ్చి యభిప్రాయము కూడ పడెను. వ్రజరాణిమీద ఇట్టి చెడుకోర్కె పెట్టుకొని యుండుట సదాచార విరుద్ధమని ఆతనికి తెలియును. సౌశీల్యాదిగుణములుగా తన ఈప్సితము లీడేర గలిగిన, వ్రజరాణి తన్నెంతో కాలము చిన్నచూపు చూడజాలదని యాతడు దృఢముగా విశ్వసించెను!

దాదాపు నెలవఱకు చంద్రుడు ఈచింతతోనే చీకాకు పడుచుండ "రహస్యముగా నొకసారి వ్రజరాణిని చూడవలయును" అను ప్రబలేచ్ఛ యతనికి కలిగెను. అప్పటికింకను వ్రజరాణి హృదయములో వైధవ్య దుఃఖము చల్లారక తీవ్రముగా నుండెను. ఇట్టి సమయమందే తాను చేయుపనుల వలనగాని, సంభాషణముల వలనగాని, తన దుర్వాంఛ బయటపడిన ఆ జన్మాంతము ఆమె కటాక్షవీక్షణములకు దూరుడై అధఃపతితుడై పోవుదుననన్న విషయము కూడ ఆతనికి

తెలియును. కాని యెట్టయెదుట ధనరాశిని చూచిన దొంగవలె మనసు నాపుకొనజాలక చంద్రుఁడు పరవశుఁడాయెను. మానవ ప్రారబ్ధము కాలాధీనమై యుండును. కాలమే వానిని మంచివానిగా, చెడువానిగా చేయును. కమలాచరణుని బొందిలో ప్రాణమున్నంత వఱకు చంద్రుడేమాత్రము తలయెత్తనైన సాహసించలేదు. వాని మృత్యువే చంద్రుని కీడులును నిచ్చెను. ఈస్వార్థపరత్వముచే నాతఁడు ఒకనాఁడు "ప్రజరాణి నన్ను చాల తలచుకొనుచున్నది" అని యెంచి కాశీపోవుటకు నిశ్చయించుకొనెను.

రాత్రి రెండుగంట లాయెను. ప్రకృతియంతయు శాంతముగా నుండెను. నిద్రాదేవి పట్టణమున నొకపటమును వ్యాపింపచేసి యుండెను. అప్పుడప్పుడు వృక్షముల మర్మరధ్వనులు వినబడుచుండెను. చెట్లు చేమలను నల్లని బట్టవలె పొగ యావరించి యుండెను. వీధులందలి లాంతరులు మేఘమండల మందలి నక్షత్రరాసులవలె ధూమనీలిమ మందు దాఁగి యుండెను. చంద్రుఁడు రైలుదిగెను. వానిగుండె దడ దడలాడుచుండెను. కాళ్లుచేతులు వణకుచుండెను. ఆతని కిటువంటి యనుభవములకు ఇదే ప్రారంభము. ఇట్టిదశ చాలసేపు వానికుండ లేదు. మధుపానాభ్యాసము లేనివానికి దాని దుర్గంధము వలననే మొదట వమనము కలుగును. కొంచెము రుచిచూచినపుడు నోరంతయు చేదుగానుండి "ఇటువంటి విషపదార్థమునెడ మానవు లేల ఆసక్తులై యుందు"రని ఆశ్చర్యపడును. కాని కొద్దిరోజులలోనే వానికి వెగటుదనము పోయి, అది యమృతముగా తోఁచును. పాపరసాస్వాదనము మధురసాస్వాదనముకన్న మిగుల భయంకరమైనది!

చంద్రుఁడు అంధకారములో మెల్లఁగా పోవుచుండెను. వాని కాళ్లకు పాపశృంఖలములు తగిలి యున్నందుననే యతివేగముగా ఆడుట లేదు. మహానందమున మునిగియుండవలసిన సమయమున

ఆతని కాఁచిన్నె లేమియు లేవు. పోవుచు పోవుచునే ఆగి కొంచెము నిలువఁబడి, యేదో యోజించుకొని ముందుకు సాగుచుండెను.

చంద్రుఁడు తల మోఁదుకొని నడచుచుండ భయముచే వాని పిక్కలు లాగుచుండెను. ఎన్నో యోచనలు చేయుచు రెండుగంటలలో ఆతఁడు శ్యామాచరణుని విశాలభవనము చేరెను. అంధకారమునం దాభవనము పిశాచమువలె నిలువబడియుండెను. తనపాదము లెవ్వరో కట్టివేసినట్లు చంద్రుఁడు గోడచాటున నిలువఁబడెను. "తిరిగి పోవుదునా, లోపలికి పోవుదునా? ఎవరైన చూచిన గొంతుమీఁదకు రాదా? వ్రజరాణి చూచిన నేమనును? నా చర్యల కామె కోపగించి ఎన్నఁడు నా మొగము చూడని దురవస్థ సంభవించునేమో?" అని అరగంటవఱకు సందేహపడుచుండెను. ఇట్టి సందేహములందే ఘోర పిశాచాకర్షణము ప్రబలమాయెను. ఇంద్రియ పరవశుఁడగు వానికి మంచిచెడ్డలు తెలియనందున ఆతఁడు మనస్సు దృఢపఱచుకొనెను. ఇంతవఱకు హృదయమందున్న పిఱికితనమును విడనాడి, ఆ భవనము వెనుకకువెళ్ళి తోఁట ప్రహరీగోడ దుమికి లోపల ప్రవేశించెను. ఆ తోఁటలోనుండి ఇంటిలోపలికి పోవుట కొక తలుపుండెను. అది దైవయోగమున తెఱచియున్నందున దానిని శుభశకునముగా తలఁచెను. కాని అదియే ధర్మద్వారము. లోపలి కేగుటతోడనే ఆతని కాళ్లు చేతులు తంనరలాడెను. గుండె బయటపడునట్లు ఉఱ్ఱూఁతలూఁగ సాగెను. ఉచ్ఛ్వాసనిశ్వాసము లాగిపోయెను. అంతరాత్మ "కూడదు కూడదు" అని ప్రబోధించెను; కాని మనస్సులోని దుర్వాంఛ ఆపినను ఆగకుండెను. అందువలన చంద్రుఁడు ఆ ద్వారమునుండి లోపల ప్రవేశించెను. దొడ్డిలోనున్న తులసికోట అరుగుకొద్ద దొంగవలె నిలువబడి "వ్రజరాణీసంయోగము కలుగునా? తలుపులన్నియు మూసియున్నవే. ఆమెకూడ నెక్కడికైన పోయినదేమో?" అని

యనుకొనుచుండ మూసియున్న తలుపుసందులనుండి వెలుతురు తటా లున కనబడెను. చప్పుడు చేయక, ఊపిరి బిగబట్టి యతఁడు తలుపు నొద్దకువచ్చి సందులలోనుండి లోపలిదృశ్యము చూచుచుండెను.

ప్రజరాణి తెల్లచీరె కట్టుకొని, తలవిరయబోసికొని, నేలమీఁద కూర్చుండి, గోడవైపు చూచి కాగితముమీఁద ఏదో వ్రాయు చుండెను. అప్పు డామె యాలోచనాసముద్రములో మునిగి ముత్య ములు వెలికి తెచ్చుచున్నట్లు కాన్పించుచుండెను. కలమును దంత ములతో నొక్కిపట్టి ఏదో యోజించుచు వ్రాయుచు, మరల కొంత సేపటికి గోడవైపు కనుబొమలెత్తి చూచుచుండెను. చంద్రుఁడు ఊపిరి బిగబట్టి యీ విచిత్రదృశ్యమును చూచుచుండెను. మనస్సు వాని వీపు మాటిమాటికి చఱచుచుండెను. కాని యిది ధర్మమున కంతిమప్రాకారము. ఇప్పుడు ధర్మము ఓడిన, హృద్ధామమును ఘోర పిశాచ మాక్రమించుకొనును. ధర్మ మిప్పుడు చంద్రుని ఆ గోతిలో పడనీయక తప్పించెను. లేకున్న నా జన్మాంతము ఆ పాపాగారము నుండి విముక్తిచెందుట కెవ్వనివశము! కాని యిప్పుడు వానిని పాప పంకమునుండి తప్పించినది కేవల ధర్మముకాదు; లజ్జాభయములు. సద్భావములన్నియు పరాజయమొందినపుడు దుష్ఫలభయమే కర్తవ్య చ్యుతులను గానీయక సంరక్షించును. ప్రజరాణి కాంతిహీనవదన మందు హృదయ స్వచ్ఛతౌన్నత్యభావసూచకమగు తేజమే వెలుఁగు చుండెను. ఆమె ముఖజ్యోతిలో చంద్రుని దుశ్చేష్టలను క్షణమాత్ర మున భస్మమొనర్చు భీకరానలముండెను. కావున నాతఁడు బుద్ధిగలిగి అధఃపతనమందు లజ్జ యుత్పన్నమొందినందున నచ్చటనే నిలువఁ బడి యేడువనారంభించెను.

చంద్రుని హృదయములో ఇంద్రియములు కల్పించిన నీచవికార ములను ఆదృశ్యము, బాలభాస్కరుని ప్రచండకిరణములు అంధకార

మును రూపుమాపినట్లు పటాపంచలు చేసివేసెను. వెంటనే పోయి ప్రజరాణి కాళ్లమీఁదపడి తన యపరాధములన్నియు క్షమింపుమని వేఁడుకొను కోరిక వానికి కలిగెను. ఆ దేవతామూర్తిని చూచుట తోడనే ఋషీశ్వరు నొద్దకు వెళ్లి సంసారక్లేశములచే కలుషితమైన హృదయమునకు ప్రాయశ్చిత్తము చేసికొనువానిబుద్ధి చంద్రునకు కలిగెను. ఆ ఘోరమోహపిశాచ మింతవఱకు వాని నీడ్చుకొని వచ్చెను. కాని యిక ముందొక యడుగైన లాగజాలక పోయెను. అంతట నతఁడు, ఎవరో వెనుకకు లాగుచున్నట్లు వచ్చిన త్రోవనే వెళ్లెను.

సూర్యోదయము కాబోవు చున్నందున ఆకాశమున తారకలు కాంతి హీనములగుచుండెను. రోలు రోకండ్ల చప్పుడు గబిగుబి వినబడుచుండెను. చంద్రుఁ డప్పుడు మునివ్రేళ్ల మీఁద నడచి నరునికంట బడక గంగానదివైపు వెళ్లెను. తల తడువుకొనగనే టోపీలేదు. జేబులో గడియారము లేదు. అందువలన వానిగుండె గుబాలు మనెను. నోటి నుండి హృదయవేదకమగు నిట్టూర్పు వెడలెను.

ఒకానొకప్పుడు మానవహృదయము క్షణములో మార్పుచెందు సంఘటనలు సంభవించును. మాతాపితల తీవ్రదృష్టి యొకటి యొకప్పుడు పుత్రుని విశాలయశోవిరాజితుని చేయును. మఱియొకప్పుడు భార్యచేసిన యుపదేశము భర్త జ్ఞానచక్షువులను తెఱచును. గర్వి తన సహచరుల దృష్టియం దవమానితుఁడై భూమికి భారమగుట కంగీకరింపఁడు. జీవితమునం దట్టి అవసరములు ఈశ్వర ప్రేరణచేతనే సంభవించును. చంద్రుఁడు సందుగొందులలో నుండి గంగాతీరమునకు వచ్చి అంతులేని శోకలజ్జలచే నశ్రుప్రవాహ మొనర్చుచుండుట కూడ చాల మంచిది. మానసికవికారప్రేరణలు అతని కధోగతి కల్పించుటకు శాయశక్తుల పనిచేసెను. కాని దయాళుఁడగు గురువర్యుని

దెబ్బవలె వానికా హెచ్చరిక నుపయోగించెను. మంచిరోజులు వచ్చి నపుడు విషముకూడ అమృతముగా పరిణమించును.

రాజుచున్న యగ్ని గాలితూపులచే ప్రజ్వలించు లాగున హృద యమునం దణిగియున్న యుత్సాహము ప్రపంచోపయోగమునకు పొంగి పోవును. తన దుఃఖానుభవము, పరుల యగచాట్లు, సత్సాం గత్యము, అధ్యయనము ఎవరికైన వైరాగ్యము కలిగించును. చంద్రుని హృదయమున నిస్స్వార్థముగా నుదారజీవితమును గడపుటకు చిర కాలమునుండి కోర్కె యున్నను, మనోవికారము వలన ఇప్పుడు కలి గిన హెచ్చరిక ఎంతోకాలమునకు చేకూర్చు ఫలితమును గడియలో నొనగూర్చెను. సాధారణపరిస్థితులందు 'సాంఘికసేవ' వాని జీవితము నకు గౌణకార్యము, కాని ఈసూచన సేవను వాని జీవితప్రధానోద్దే శ్యముగా చేసెను.

## ౨౦

సజీవనలాలు తీర్థయాత్రలకు, చంద్రుఁడు చదువుకొనుటకు ప్రయాగకు పోయిన నాఁటినుండియు సువామ జీవితములో చాల అంతర మేర్ప డెను. ఆయన పోవుచు వదలిన కంట్రాక్టుపనులను ఆమె అభివృద్ధిచేయ దొడఁగెను. సజీవనలాలు స్వయముగా సమస్త వ్యవహారములు చక్క బెట్టుకొనుచున్నను, వ్యాపారమునందు ఇప్పుడున్న యభివృద్ధి అప్పుడు లేదు. సువామ రాత్రింబగళ్లు ఇటుక, సున్నము మున్నగు వాని విషయమై యోజించి యోజించి తన మేధాశక్తిని వ్యయపఱచు చుండెను. ప్రతి దమ్మిడీకిని లెక్క వ్రాయుచు తానే అప్పుడప్పుడు పనివాండ్ర యొద్దకేగి పనిపాటలు చూచి వచ్చుచుండును. మొదట

దానధర్మములు, నోములు, వ్రతములు మున్నగువాని యందు కను పఱచిన శ్రద్ధకన్న ఇప్పుడీయింటిపనులందు ఎక్కువ శ్రద్ధచూపు చుండెను. ప్రతిరోజు జమాఖర్చులున్నను, ఏవిధముననో వ్యయమును చాల తగ్గించెను. చంద్రుఁడు పెద్దవాడయిన మీఁద భాగ్యవంతుఁడై సుఖముగా నుండ, తాను కదలక హాయిగా తిని కూర్చుండవచ్చు నను నభిలాషతో డబ్బున్న చాల గట్టిపట్టు పట్టుచుండెను.

సుకుమారుఁడు భాగ్యరాశియు నగు చంద్రునియం దామెకు చాల ప్రేమ కలదు. వాని జీవితవిశేషాంశములు చూచి ఆమె తన ప్రాణ ములు విడువ వలయునని కనిపెట్టుకొని యుండెను. గోప్యముగా కాలేజి ప్రిన్సిపలు దగ్గఱనుండియు, ప్రొఫెసరుల దగ్గఱనుండియు కుమా రుని ప్రవర్తనను గుఱించిన వార్తలు తెప్పించుకొను చుండెను. వారు వ్రాయు వ్రాతలనే, యామె భారతభాగవతములవలె చదువుచుం డును. అట్టి సమయమందే ఆమెకు ప్రయాగలో నుండి చంద్రుఁడు ఎక్కడికో పోయెనని తంతి పిడుగులాగున వచ్చెను. నిట్టూర్పువిడిచి యామె తల పట్టుకొని కూర్చుండెను. మూఁడవనాఁడు వానిపుస్తక ములు, బట్టలు, ఇతరసామగ్రులు వచ్చి చేరెను. ఆహా! ఇది ఉరిసిన పుండుపై నుప్పుగదా!

*　　　*　　　*　　　*　　　*

ప్రేమవతి మరణించిన దనగనే ప్రాణనాథుఁడు పాట్నానుండియు, రాధాచరణుఁడు సిమ్లానుండియు వచ్చిరి. ప్రాణముండగ నొక్కరును రాక పిదప వచ్చుటచే శవసందర్శనసౌభాగ్యమైనను వారి కబ్బ లేదు. కర్మలు గొప్పగా జరిగెను. రెండువారముల వఱకు గ్రామమున చాల సందడిగా నుండెను. తరువాత రాధాచరణుఁడు తన యుద్యోగస్థాన మునకు వెళ్లెను. ప్రాణనాథుఁడు కూడ పాట్నాకుబోవ సంసిద్ధుఁ డాయెను. ప్రయాగనుండి పాట్నా పోవలయునని యాతని యూహ.

కాని యింతదూరము వచ్చి వ్రజరాణియొద్దకు పోకుండ నుండరాదు. పోయిన ఆమె చాల దుఃఖపడి అనాధనుజేసి తన్నందరు విడనాడి పోయిరని యేడ్చునని సేవతి పట్టుపట్టెను.

సేవతి యిట్టి కళావిహీనమైన భవనములోనికి వచ్చుట వాడిన పుష్పములోనికి సుగంధము వచ్చినట్లే. వారు రాగానే వ్రజరాణి కన్నీళ్లు పెట్టుకొనెను. మాధవి సేవతిబిడ్డ నెత్తుకొని పేటయంతయు త్రిప్పుకొని వచ్చెను. చాలరోజులనుండి ఆయింటిబయట అరుగుల మీఁద నెవ్వరు కూర్చుండనందున అవి పాడుపడిన ట్లుండెను. నేఁ డాపరిదేశము యొక్క భాగ్యముకూడ పండెను. నిస్తేజముగా నున్న యిల్లు నేడు క్రొంచెము కళకళలాడు చుండెను.

ప్రేమవతి జీవితయాత్ర చాలించినది మొదలు వ్రజరాణియే మాధ విని దగ్గఱనుంచుకొని ఒకంటరిగా నివసించుచుండెను. ఇంతవఱకు గోప్యముగా నున్న హృదయతాపము, మానసికదుఃఖము నేఁడొక సుగుణమును ప్రకటించెను. ఆమె కావ్యములు చదువుచు పద్యరచన అభ్యసింపఁబోడఁగెను. సుఖదుఃఖములందు మానవులు ప్రకటించుభావము లన్నియు ఆమె కవిత్వమునందు విదితమగుచుండెను. ప్రస్తుతము వ్రజ రాణి రాత్రులందు ఏకాగ్రబుద్ధితో కూర్చుండి భాషలో తనభావ మౌక్తికమాల గ్రుచ్చుచుండెను. అన్యకవులు తమ మిత్రుల సాధు వాదములచేతను, కవితా ప్రియుల ప్రశంసచేతను ఉత్సాహ భరితు లగుచున్నారు, కాని వ్రజరాణి తన దీనచరిత్రను తన హృదయము నకే వినిపించుకొనుచుండెను.

సేవతివచ్చి రెండుమూఁడురోజులయ్యెను. ఒకనాఁడామె వ్రజరాణి యొద్దకేగి "వదినా! నీవెప్పుడు ఏదో ధ్యానములోనుండి వ్రాయుచు న్నట్లు కనుపడుచున్నావు. నాకా వ్రాసినది చూపవా?" అనెను. వ్రజ రాణి సిగ్గుపడి "ఏమియులేదు. మనసులో నేదియో చింతగానున్నం

దున పిచ్చిగీతలు గీయుచున్నాను'' అని యామె వంకచెప్పెను. అప్పుడు సేవతి "నేనునమ్మను'' అని వ్రజరాణి పెట్టె నెత్తుకొనివచ్చి దివ్యకవితామౌక్తికములతోనిండి సొబగొందు కాగితములను బయటకు తీసెను. విధిలేక వ్రజరాణి తనక్రొత్తపద్యములు వినుపింప నారంభించెను. ఆమెనోటినుండి పద్యపాదమొకటి కాకముందే సేవతికి రోమాంచమయ్యెను. పద్యము పూర్తియగువఱకు తదేక ధ్యానముతో రెప్పవేయక వినుచుండెను. భర్తృసాంగత్యమువలన సేవతికి కవిత్వమందు కొంచెమభిరుచి కలిగెను. అందువలన ఆమెకన్నులనుండి మాటిమాటికి ఆనందబాష్పములు రాలుచుండెను. వ్రజరాణి పద్యము చదువుట నాపగనే యేదేదో మనోహరవీణాగానము ఆగిపోయినట్లుండెను. సేవతి వ్రజరాణిని కౌగిలించుకొని, తరువాత ఆమెను వదలి, పసిబిడ్డలు నూతనవస్తువులను చూచి కొనుపించుకొనుటకు తల్లిదండ్రుల కడకు పోయినట్లు ఒక్క అంగలో ప్రాణనాథుని దగ్గఱకుపోయెను. అప్పుడాయన కూర్చుండి "నాతల్లి జబ్బుగానున్నందున పనిలో చేరుటకు ప్రస్తుతము నాలస్యమగును, కాన మఱియొక వారమురోజులు సెలవీయవలయును'' అని పై అధికారికి అర్జీ పెట్టుకొనుచుండెను. ఇంతలోనే సేవతి కనుపడ నతఁడు దానిని దాచి చిఱునవ్వునవ్వెను.

సేవతి—ఇదుగో కొంచెము లోపలికిరండు. మీరు వ్రజరాణి కావ్యము విన్న అబ్బురపడుదురు.'' అనెను. "ఇప్పుడామెకు కవిత్వధోరణి కలిగినదా? ఆమె వదినెకూడ సంగీతము బాగుగా పాడును కాదూ? ఏది ఆ—మఱచి పోయినావుర—పాడు విందును.''

"ఈపాడిమాటల కేమికాని కొంచెములోపలికివచ్చి చూడండి. నాకది చూచినప్పటినుండియు చెప్పలేని ఆశ్చర్యము కలుగుచున్నది."

"పద. నేనొక్క ఉత్తరము వ్రాసుకొని నీవెనుకనే వచ్చెదను.''

"నాకిదేమియు బాగుగాలేదు. రమ్మన్న రారెందుకు? కోపము

వచ్చిన నేనుమంచిదానను కాని సంగతిమీకు తెలియదా?"

నేవతి ప్రాణనాధుని చేయిపట్టుకొని యీడ్చుకొని పోయెను. ఆయన యింతవఱకు అదేదో సామాన్యమైన పద్యమని తలచెను. కాని లోపలికివచ్చి కూర్చుండగనే ప్రజరాణి బిడియపడుచు స్వీయ భావ పూరితమగు, "ప్రేమోన్మాదిని"ని చదువ నారంభింప ఆయువ కుని కన్నులు వికసించెను. పద్యములన్న పద్యములా! హృదయము లోని యొక్కొక్క దుఃఖధార ప్రేమరహస్యభరితమగు కథగానుండెను. ప్రజరాణి చదువు పద్యములు వినుచు ముగ్ధుడై యాతడు రీళ్ళలో ఊగుచుండెను. శబ్దసౌష్ఠవమందును, భావోద్గారమందును ఆతడత్యం తోల్లాసము చెందుచుండెను. అరుణోదయాత్పూర్వమున వీచు మంద మారుతము, వికసించు ప్రసూనముకుళములు, సుగంధభరిత పుష్ప ములు, ఆకాశమందలి తేటకాంతులుగల ఒక వర్ణము ప్రకటిత మగుచుండెను.

ఒక్కొక్క శబ్దమందు నవ వికసిత పుష్పశోభ, హిమకణముల శైత్యము, విద్యోతమాన మగుచుండెను. వానియందు ప్రజరాణి సౌశీల్యము అర్ధమధురిమ సువర్ణమునకు సుగంధ మబ్బినట్లుండెను. ఆమె తన హృదయ తాపమంతయు ఆపద్యములందు నింపెను. మొదట ప్రాణనాధుడు నవ్వులాటకువచ్చి చివరకు పట్టరాని సంతో షముతో వెడలిపోయెను. ఒకనాడాతడు ప్రజరాణినిచూచి "నీపద్య ములు అచ్చుపడినచో అందఱు చాల ఆదరింతురు" అనెను. ప్రజరాణి తలవంచుకొని "ఎవ్వరును వీనిని ఆదరింతురను విశ్వాసమునాకులేదు" అనిపలికెను.

౧౬౦ 'అట్లనుకొనవలదు. సహృదయులందఱు నీ కవిత్వతమును మెచ్చు కొందురు. పుష్పసౌరభము పక్షుల కలకలారావము, మనోహర కౌముదీకాంతులుచూచి ఆనందించు వారెల్లరు నీకవిత్వమునకు తప్పక

అగ్రస్థానమివ్వగలను"

ప్రతికవియు తనకావ్యమునకు ప్రశంస లభించినమీాఁట దానిని ముద్రింపించుటకై చెందు ఆందోళనమే వ్రజరాణికూడ చెందెను. ఆమె పైకివద్దనుచున్నను అనర్దను శబ్దమే సరేయను దానితో సమానము,

"కమల"యను సుప్రసిద్ధ మాసపత్రిక ప్రయాగలో వెలువడుచుండెను. ప్రాణనాథుఁడు "ప్రేమోన్మాదిని"ని దానికి పంపెను. ఆపత్రికా సంపాదకుఁడు కావ్యప్రియుఁడు. ఆయన యామె పద్యములను అభినందించి పత్రికలో ప్రకటించెను. తరువాత సాహిత్యప్రపంచమందు చాల అలజడి కలిగెను. ప్రథమమునందెన్నఁడు ఎవరికి ఇట్టి ప్రతిష్ఠలభించలేదు. వానిని చదివినవారు ఒకరిమొగమొకరు చూచుకొని విస్మయమందుచుండిరి. కావ్యప్రియులందఱు ఈయున్మత్త బాలికనుగూర్చి చాలరోజులు తర్కించుచునేయుండిరి. ఇది క్రొత్తపోకడయని ఎవరికిని తెలియకుండెను.

అప్పటినుండి "కమల" పత్రికలో వ్రజరాణి రచనలు విరివిగా కానవచ్చుచుండెను. జనులందఱీభారతమహిళకు అగ్రస్థానమొసంగిరి. భారతమహిళను పద్యములు పంపవలసినదని వ్రాయని పత్రికయేలేదు. పత్రిక తెఱచి పాఠకులందఱు భారతమహిళ ఎక్కడని వెదకుచుండిరి. అనేకు లామె కవిత్వమునే అనుసరింప దొడగిరి.

మూఁడు సంవత్సరములవఱకు ఈ "భారతమహిళ" ఎవ్వరైనది బయటపడకుండెను. క్రమముగా ప్రాణనాథునకు వ్రజరాణి యందాదరము వృద్ధినొందుటచే, ఆమె జీవిత చరిత్రవ్రాయనెంచెను. సేవతి వలన ఆమె జీవితవిషయమును సేకరించి "భారతమహిళ" అను శీర్షికతో ఒక వ్యాసము వ్రాసెను. ఇంతవఱకు అతఁడేవ్యాసమువ్రాయలేదు. కాని దృఢమగు శ్రద్ధయే యతని భాషాలోపములు నివారించెను. వ్యాసము చాల మనోహరమై సమత్సాభరితమైయుండెను.

ఈవ్యాసము ముద్రింపగానే వ్రజరాణికి నలువైపులనుండి బహూకృతులు లభింపసాగెను. రాధాచరణుఁడు ఎంతో దూరమునుండి ఆమె సందర్శనమునకువచ్చెను. కమల, సీత, ఉమ, చంద్ర, మఱెందఱో ఆమె చిన్ననాటి సఖురండ్రు వ్రజరాణిని చూచుటకు రానారంభించిరి. గొప్పగొప్ప ప్రభువుల సముఖమందును తలలొగ్గని వారెందఱో వ్రజరాణిని దర్శించుటకు వచ్చుచుండిరి. రమాదేవి స్వయముగా రాలేకపోయినను "నీపాదపద్మములపై తలచేర్పవలయునను గాఢాభిలాష నాకుకలదు" అని యుత్తరము వ్రాసెను.

## ౨౧

సుగంధపుష్పములతో చెలిమిచేసిన అడవి పూలకును సువాసన యబ్బును. మాధవి పేదయింట పుట్టినను ఉత్తమ స్త్రీ జాతికుండవలసిన లక్షణములలో నొక్కటైన విధాత తఱుగుచేయ లేదు. వ్రజరాణి అత్తవారింటికి రాగానే మాధవి సాంగత్యము కుదిరెను. ఏమెఱుఁగని యాబాలిక అప్పటినుండియు వ్రజరాణిని ప్రేమించుచుండెను. ఆమె నొకదేవతగా తలపోయుచున్నదనినను అతిశయోక్తి కాదు. వ్రజరాణి యడుగుజాడలనే నడచుచుండెను. ఆమెకూడ అన్నము తినునపుడు మాధవిని తనప్రొత్తున కూర్చుండబెట్టుకొనుచు, నిదురపుచ్చుచు క్రొత్తక్రొత్త బట్టలు కొనిపెట్టుచు తోడబుట్టిన దానికన్న ఇనుమిక్కిలి సాకుచుండెను. చంద్రునికి వ్రజరాణిమీఁద కలహార్దిక సంబంధమే ఆమె కాతనిమీఁద ఉండెను. కమలాచరణునకు తన్ను నిచ్చి వివాహము చేతురని స్థిరపడిన మీఁద చంద్రునికన్న ఆమె తక్కువ చింతించలేదు. కాని స్త్రీలకుండు స్వాభావికలజ్జవలన అది

ప్రకటింపజాలక పోయెను. వివాహమైన తరువాతకూడ అహోరా త్రము లామె "నేను చంద్రు నెట్లు సమాధాన పఱతును? హాయిగా నేను జీవితము గడపుచుండ ఆత డెట్టివేదన పడుచున్నాడో" అని చింతించెను. అప్పటికి మాధవి పన్నెండేండ్ల పిల్ల. ఆమె యందచంద ములు, ముద్దు ముచ్చటలు, కలుపుగోలు తనము చూచినవారందఱు చాల మెచ్చుకొను చుండిరి. ఆకస్మికముగా నొకనాడు "మాధవి చంద్రుని ఆలింగనము చేసికొనుటకు తగదా" అను నాలోచన ప్రజ రాణికి కలిగెను. అప్పటినుండియు ఆమె మాధవిని భాగ్యవంతులబిడ్డ వలె ఆలన పాలన చేయుటకు వెనుకటికన్న విశేషప్రయత్నము చేయ సాగెను. "మాధవికి పదియాఱేండ్ల వయస్సు రాగానే చంద్రుని దగ్గ ఱకు తీసుకొని వెళ్లి, "చంద్రుడూ! ఇదిగో, ఈయువతి నాచెల్లెలు. దీనిని నీవు పెండ్లిచేసి కొనుము అని వేడు కొనెదను. ఆతడు నామాట మీఱ సాహసించునా? సాహసింపడు. పిన్ని నాయొద్దకు వచ్చి మాధ విని నాకోడలుగా చేసికొందుననిన ఎంతో సంతోషము నాకు కలు గును" అని అనేకవిధముల భావికాలమును తలపోయు చుండెను. ఈతలంపుచేతనే ఆమె మాటిమాటికి, మాధవి యొడలుపొంగి చం ద్రునిమీఁద అనురాగము వృద్ధియగునట్లు అనేకవిధముల నతఁడు అటువంటివాఁడు ఇటువంటివాఁ డని పొగడుచుండును.

"ఎంత పిచ్చిదానను. ఆ మహనీయుని పాదధూళి తాకుటకైన తగని నేను ఎన్నో గొంతెమ కోర్కెలు పెట్టుకొనుచున్నాను. నన్నా యన భార్యగా స్వీకరించునా? ఏమైన కానిమ్ము. శక్తికొలది ప్రయ త్నించి చూచెదను. ప్రేమయం దేమైన కొంచె మాకర్షణశక్తియున్న నేను తప్పక ఆయన పాదములచెంత చేరగలను" అని యా యమా యక మాధవి తలఁచుచుండెను. కాని యీ తలంపులన్నియు శోక రూపమున కన్నులనుండి జారిపోవునని కొంచెమైన నామె యనుకొన

లేదు. ఆమెకు పదునైదవయేడు నిండకముందే ప్రజరాణి తలమీఁద సంసారకష్టము లన్నియు విరుచుకొని పడెను. ఆ తీవ్రప్రభంజనుని యూపులవలన మాధవి హృదయములోని కల్పితపుష్పవాటిక మూలముట్ట నాశనమయ్యెను. ఇట్టి విషమావస్థ యందే చంద్రుఁడు కనుపడ లేదను కబురువచ్చెను. ఆ భీకరప్రభంజనము దయతలఁచి వదలిన మొలకను ఈ భయంకరాగ్ని కాల్చి బూడిదచేసెను.

మానసికముగా మాధవి చంద్రునిభార్య యయ్యెను. అతనికి తన శరీరము, మనస్సు అప్పగించెను. ప్రపంచములోని మనోహరవస్తు వొకటి తన పాదసాన్నిధ్యమున చేరినదను సంగతి చంద్రునకు తెలియనే తెలియదు. ఆమె యింతవర కొకమాఱు మాత్రము చంద్రుని వాగమృతము గ్రోలెను. చంద్రున కీవిషయ మణుమాత్రము తెలియదు. కాని మాధవియన్ననో ఆతని ప్రేమాగ్నిలో బడి తపించు చుండెను. అది మొదలుకొని మాధవి చేయని వ్రతములు లేవు. మ్రొక్కని దేవతలు లేరు. ఇవన్నియు ఆతఁడు చిరాయువుగా నుండుటకే చేయుచుండెను. ఇట్టి కృత్యములవలన ఆమె చాల దృఢచిత్తము కలది యయ్యెను. అందువలననే యామె "చంద్రునితో నావివాహము జరిగెను" అని నిర్ణయించు కొనెను. మాధవి ఇట్టి విపరీతభావన లందు దగిలియుండుట చూచి ప్రజరాణి దిగులుచే "దీనికీ 'గతి' నేనే కల్పించితిని. ఈ నవకుసుమ మెవ్వరికంఠదామములో నుండునో; ఎవ్వని గాఢాలింగనమున జేరి సుఖించునో. పరమేశ్వరా! నే నెంతో శ్రమపడి ఈబీజమును మొలిపించి పాలుపోసి పెంచియుండ పుష్పమీ విధమున కొమ్మమీఁదనే వాడుచున్నదే!" అని యనుకొని దుఃఖించుచుండెను. ప్రజరాణి మధురకావ్యము లల్లుచు కొంచె మానందించుచున్నను మాధవి కదికూడ లేకుండెను. నిరంతరము పరిచయములేని ప్రియుని స్మరించుటయందే కాలము గడపుచుండెను. చంద్రుఁడు

అదృశ్యుఁడైన కొన్ని నెలల తరువాత ఒకనాఁడు మాధవి ఆతఁడు సన్యాసి యయ్యెనని కలగనెను. ఇందువలన ఆమె యమితానందము చెందెను. చంద్రుఁడు తప్పక సన్యాసి యయ్యెనను గాలికబురు వినిన నాఁటి నుండి ఆమె సమస్తభోగములు విడిచి సన్యాసిని యయ్యెను.

ఎన్నడైన యూరక కూర్చుండి కూర్చుండి బద్ధకముగా నున్న సుహాసకడ కేగి, అచ్చట చికాకుగానున్న తన హృదయమునకు కొంచెము శాంతికల్పించు కొనును. ఆయిల్లు మాధవికి పవిత్రాలయముగా నుండెను. సుహాసకు ప్రజరాణికి వైమనస్య మున్నంతకాలము ఆయువతి యచ్చటకు కదాచితుగా వెళ్లుచుండెను. కాని చివరకు వారిరువురకు మాటలు కలిసి గంగాయమునలవలె ఆలింగన మొనర్చుకొని యుండ, మాధవి రాకపోకలు హెచ్చెను. మాధవి సుహాస యొద్ద అహోరాత్రములు కూర్చుండును. ఇంటియుందలి చంద్రుడు కొయ్యగుఱ్ఱము నెక్కి పరుగులెత్తుట చేతను, కాగితపు పడవలు నీటికుండమున నడిపించుట చేతను ఆ గృహమందలి ప్రత్యంగులము భూమియు ఆతని స్మారకచిహ్నముగా నుండెను. పడవలన్నియు కాలగతిని చెడిపోయెను, కాని గుఱ్ఱము మాత్రము చెక్కుచెదరకుండెను. దాని కళాకాంతులు కొంచెము తరిగినను మాధవి దానిని పోసీయక బాగుచేయించివాటికలోని నీటికుండముసమీపమందున్న పొగడచెట్టు నీడను కట్టివేసెను. భవనములో చంద్రుఁడు పరుండు గది మాధవికి దేవాలయముగా నుండెను. అందున్న పందిరిమంచమే చంద్రుని చిచ్చుకొట్టి నిదురపుచ్చెను. మాధవి దాని నిపుడు పూలతో నలంకరింపసాగెను. ఇంతవఱ కెన్నఁడెఱుఁగని మహాసౌందర్యముతో ఆగది రమణీయముగా కనుపడుచుండెను. అందు తగిలించిన చిత్రపటముల ధూళి తొలఁగి పోయెను. లాంపు మరల దేదీప్యమానముగా వెలిగెను. మాధవికి కలిగిన ఆనందమువలన సుహాస దుఃఖము శాంతిం

చెను. ఆమె చంద్రునిపేరు కూడ తలంచుట లేదు. వ్రజరాణితో ఆమెకు మాటలు కలిసినను ఎవ్వరుకూడ చంద్రుని అనుకొనుటయే లేదు. వ్రజరాణి సిగ్గుతో ఊరకుండెను. సువామ క్రోధముచే ఏడుపు దిగమ్రింగెను. కాని మాధవి ప్రేమగానము వలన రాళ్లుసహితము నీరయిపోయెను. ప్రేమపరవశయై యామె చంద్రుని బాలలీలలు సువామను గుచ్చిగుచ్చి యడిగిన ఆమె కన్నీరునించగా ఇరువు రేడ్చుచు వాని సంగతులు చెప్పుకొనుచుండ రాత్రింబగళ్లు గడచి పోవుచుండెను. ఇంతవఱకు మాధవి తన మనోభిలాష సువామకు తెలుపక దాంచెను. "తపస్వినినై ఇట్లే ప్రేమానలమున తగులబడుచు ఆశారహితముగా పడి యుండవలయు నేమో" అని యామె వాపోవు చుండెను. ఒకనాఁడు వ్రజరాణి "కమల" సంచిక చూడగనే ముఖపత్రము మీఁద దివ్యతేజముగల త్రివర్ణచిత్రపటము కనుపడెను. ఆతఁడెవరో మహాత్ముఁడుగా తోఁచుచుండెను. "ఎచ్చటనో ఈయనను చూచిన ట్లున్న" దని ఆమె యనేకవిధముల జ్ఞాపకమునకు తెచ్చుకొనుచుండ, ఆకస్మికముగా చంద్రుఁడు తలపునకు వచ్చెను. ఆనందోద్రేకమున నెగిరిపడి "మాధవీ, కొంచెమిటురా" అనెను.

మాధవి వేడుకకయి తోఁటలోని పూలచెట్లకు నీరు పోయుచుం డెను. ఆమెచీరె నీళ్లలో చప్పగా తడిసెను. వెంద్రుకలు జీరాడుచుండ లలాటమున చెమట బిందువులుదోప కన్నులందు ఆనందబాష్ప ములు మెఱయుచుండ వచ్చి వ్రజరాణియొద్ద నిలువఁబడెను.

వ్రజరాణి "రా, నీకు బొమ్మచూపెదను" అనెను.

"అది ఎవరిదిదో చూపించు" అని మాధవి పటమును శ్రద్ధతో చూచుచుండ కన్నులందు నీరు క్రమ్మెను.

వ్రజరాణి "గుఱుతు పట్టితివా!" అని యడిగెను.

"గుఱుతు పట్టకేమి? ఎన్నో సారులు కలలో చూచితిని. చూడ

రాదా ఆముఖమం డెట్టికాంతి ఉట్టిపడుచున్నదో''

"ఈయననుగూర్చి ఏదో కొంచెము వ్రాసి యున్నదే"

మాధవి రెండవపుట తెఱచిచూడ "బాలానందస్వామి" అను శీర్షికతో ఒక వ్యాసము వ్రాసి యుండెను. ఇరువురు కొంతసేపు వ్యాసమంతయు చదివిరి.

వ్రజరాణి "నేను మొదటనే ఆతడు ఎప్పుడైన సన్యాసము పుచ్చుకొను వాడే యని అనుకొంటిని" అనెను.

మాధవి తలవంచుకొని నేలవైపు చూచుచు మెదలకుండెను.

వ్రజరాణి "అప్పటికి ఇప్పటికి నెంతభేదమో చూడు. ముఖమండల మంతయు దివ్యజ్యోతితో ఎట్లు కళకళలాడు చున్నదో. ఈసౌందర్యము అప్పుడు లేదు" అనెను.

"నిజమే"

"ఎంతో తపస్సుచేయ నేటి కదిఫలించినది. (కన్నీరునించి) కాల మహిమ ఎవరికి తెలియదుగదా? ఇరువురమొక కంచములోదిని, ఒకచోటనే ఆడుకొంటిమి. కాని నేడాతడు సన్యాసియయ్యెను. నాకు వైధవ్యముపట్టినది. ఇంతవఱకు మనమేమైన నాతనికిజ్ఞాపకముంటిమో లేదో. సన్యాసము పుచ్చుకొని సమస్తము విసర్జించిన వానికి ఎవరితో నేమిపని? పిన్నికి సహితము ఉత్తరము వ్రాయకుండగా మనమందఱ మేపాటివారము? మాధవీ! చిన్నతనమున ఆయన ఆటలకయి యోగినని వచ్చినపుడు నేను మిఠాయిబిచ్చము పెట్టుచుండెడిదానను" అనెను.

మాధవి కన్నీరునించి "ఆయన దర్శన మెప్పుడు లభించునో తెలియదుకదా" అని సిగ్గుచే తలవంచుకొనెను. "త్వరగానే వచ్చునులే. మన ప్రాణనాథుఁడు వ్యాసము చాల బాగుగా వ్రాసెను."

"ఆహా, ప్రతిమాటయందును భక్తిరసము పొంగిపోవుచున్నదే"

"ఒక భక్తియేమిటి? శబ్దసౌష్ఠవముచూడు, ఎంతసొంపుగానున్నదో!

మొదటనే చంద్రుని మాటలందొక అద్భుతశక్తియుండెడిది. ఇప్పుడిం కెట్టులుండెనో వేరుగా చెప్పవలయునా? నిజముగా ప్రాణనాథునకు ఇట్టి మహాచ్ఛక్తి పుట్టించినవాఁడు ప్రపంచమున కొక నూతన సందేశ మివ్వగలఁడు.''

"పిన్ని యొద్దకు వెళ్లుదముపద.''

"ఆమె ఇట్లగునని ఎన్నఁడనుకొనలేదు. ఇదివిన్న ఏమనునో! సంతో షించునా!''

"ఆమెకుకూడ నిదే కోరికకలదు. తప్పకసంతోషపడును.''

"ఏమోనాకు నమ్మకములేదు. కాని, పోదముపద''

ఇరువురు బయలుదేఱిరి. ప్రజారాణిముఖము వాడియుండెను. కాని మాధవి అంగములు సంతోషముతో ఉప్పొంగుచుండెను. ఎవరైన నెదురుపడి "నీకాళ్ళు భూమిమీఁద ఆనుటలేదు. వాడిన ముఖమున సంతోష చిహ్నము లగుపడుచున్నవి. ఇట్లుండ నీకేమి సంపదకలిగెను? ఎల్లప్పుడు దిగులుపడి యుండుదానవు నేడేల ఆనందముతో నుంటివి? నీభర్త సందర్శనము లభించుననుదానికేమైన నిదర్శనము కనుపడినదా? ఆతడింతవఱకెన్నఁడు నిన్ను అనురాగ దృష్టితో చూడ లేదు. తిన్నగా పలుకరించలేదు. అట్టియెడ నీవిట్లేల ఉబ్బి తబ్బిబ్బు లగుచుంటివి?'' అనియడిగిన ఏమని ప్రత్యుత్తర మీయగలదు?

మాధవి హృదయము అనురాగముతో నిండియుండెను. ఆ యను రాగము బజారువస్తువువలె బేరమాడ తగినదికాదు. ప్రతిఫల మపే క్షించునదికాదు. పావనహృదయుఁడగు ప్రియుడు తనలో దేదీప్య మానముగా విరాజిల్లుచున్నాఁడను గొప్ప అభిమానము ఆమెకుకలదు. ఆయభిమానమే యామె ప్రేమ పరవశత్వమునకు కారణము.

రెండవ నెలలోనే ప్రజారాణి బాలానందస్వాగతమునకు పద్య ములు వ్రాసెను. అవిచాల హృదయంగమముగా నుండుటచే అచ్చ

గుటతోడనే ఇదివఱకామె పద్యములు గుర్తెఱింగిన సాహిత్యభిలాషు లందఱు వానిని చూచిన వెంటనే ఎంతో సంతసించిరి. కావ్యాకాశ మందు వాయువేగముకన్న తీవ్రగామియగు ఆమెకల్పనావిహంగము తళుక్కనెను. ఆపద్యములు చదివిన వారంద అద్భుతమొంది బాలా నందునికి భక్తులయిరి.

౨౨

౦

వ్రజరాణికి కావ్యప్రసిద్ధి కలిగిన నాటనుండి మహిళాసభ లన్నియు ఆమెయింటనే జరుగుచుండెను. దానికి శాఖలను పురమంతట నెల కొల్పి వానిని ఆమెయే నడపుచుండెను. ఇతర గ్రామములనుండియు స్త్రీలు తీర్థయాత్రకు వచ్చునట్లు ఎడతెగక వచ్చుచుండిరి. ధర్మసింగు ఆమె పద్యములను సేకరించి సర్వాంగసుందరములగు కొన్ని సంపు టములుగా ప్రచురించెను. ఆసంపుటములే ఆమె కావ్యచాతుర్యపటి మను దేశ దేశములకు చాటెను. అమెరికా, జర్మని మున్నగు దేశ ములవారు కూడ ఆమె మనోహర కవిత్వమును మనఃపూర్వకముగా నభినందించిరి. భారతవర్షమందలి ప్రతి గ్రంథాలయమును ఆమె సంపు టము లలంకరించెను. వ్రజరాణి పద్యములన్నిటిలో బాలానందుని గుఱించి వ్రాసినవి అత్యద్భుతముగా నుండెను. ఆయనకూడ తన యన ర్గళవాగ్ధాటియందామె పద్యములు జతజేర్చుకొనుచుండెను. అంతే గాక ఆయన వ్రజరాణి కావ్యసంగ్రహమునకు విపులమగు పీఠిక వ్రాసెను.

ఒకనాటి ప్రాతఃకాలమున సీత, రుక్మిణి, చంద్రకుమారి, మహా రాణి మున్నగువా రందఱు వ్రజరాణి యింటికి వచ్చిరి. చంద్ర వారి

మూవారు అక్కడనే యుండిరి. రాణి సంతోషించి ఖజానాతాళపు చెవి ఆయనకిచ్చి 'ఇదంతయు మీదే' అనెనట. బాలానందుడు నవ్వి "నాకు డబ్బక్కఱ లేదు. మీరాజ్యములో మూడువందల గోసంరక్షణ శాలలు ఏర్పఱచ వలసిన దనెనట. ఆయన నోటినుండి మాటవచ్చుటే ఆలస్యముగా, ఎక్కడ చూచినను ఇప్పుడు గోశాలలే. అక్కడ పాలు నీళ్లకన్న సమృద్ధిగా నున్నవట. ఇటువంటి మహాత్ము డెక్క డుండును.

చంద్రకుమారి—నవగఢ మహారాజుకు క్షయరోగము బాలానందు డిచ్చిన మూలికల వలననే కుదిరెనట. మొదట డాక్టరులు చేతులు వెల్లికిల వేసిరి. వైద్యులు తమ సంచులు కడిగిపోసిరి. అక్కడ నుండి బాలానందుడు బయలుదేఱగనే రాణి తొమ్మిదిలక్షలు వెలగల రత్నాలహారము ఆయనమీద వేసెనట. ఆయన దానిని కన్నెత్తియైన చూడ లేదట.

మహారాణి—ఎంత పెడబుద్ధి ఆయనది.

రుక్మిణి—ఆహారము తీసుకొని ఆయన మెడలో వేసుకొన్న చాల అందముగా నుండెడిదే.

ప్రజారాణి—అట్లుకాదే, దానిని తీసుకొని సొమ్ములపిచ్చిమెత్తి మొత్తుకొనుచున్న మహారాణి మెడలో వేసిన సరసముగా నుండెడిది. ఏమే, అంతేనా?

మహారాణి—అవును. అది నాకిచ్చిన బ్రతికినన్నాళ్లు ఆయన చాకిరి చేయుమన్న చేయుదును.

చంద్రకుమారి—మావారు 'భారతసభకు' సభ్యులయిరి. వారెంతో కాలమునుండి లక్ష ప్రయత్నములు చేసి నూటయేబది రూపాయలు గడించిరి. ఇప్పుడు గుఱ్ఱము కొనవలయునని వానిని తీసుకుపోయిరి. ఆసభలోనివారికి గుఱ్ఱము లేనిది అడుగైన సాగదా?

మహారాణి—నిన్న వారందఱు చేతులు చేతులు పట్టుకొని బారులు తీరి పోవుచుండుట చాల వింతగానుండెను.

ఇంతలో సేవతి క్రొత్తవార్తా పత్రిక తీసికొని వచ్చెను. ప్రజరాణి "ఏమైన క్రొత్తసంగతు లున్నవా?" అని యడిగెను.

సేవతి—"బాలానందుడు మాణిక్యపురమునకు వచ్చెను. ఎవరో గొల్లవాడు తన కూతురి పెండ్లియగుచుండ ఆయనకు శుభలేఖపంపెను. అందువలన బాలానందుడు వాని యూరికి వెళ్లెను. గొల్లలందఱు చాల వైభవముతో ఆయనకు స్వాగతమిచ్చి సమిష్టిన ఐదువందల గోవులు కానుకగా నిచ్చిరి. బాలానందుడు వారి నాశీర్వదించి పెండ్లి కొడుకును కౌగిలించు కొనెను. ఐదుగురు గొల్లలు భారతసభలో సభ్యులైరి" అని చదివెను.

ప్రజరాణి—చాల మంచి వార్త [redacted] వింటిమి. మాధవీ! దానిని కత్తిరించి దాచిపెట్టుము. ఇంక నేమైన సంగతు లున్నవా?

సేవతి—"పాట్నాలో ఉప్పరివాండ్రు దేవాలయమును కట్టించిరి. అచ్చటి భారతసభవారు బాలానందుని చాల సత్కరించిరి."

ప్రజరాణి—మొత్తముమీద పాట్నావారు అందఱికన్న ఎక్కువ ఉత్సాహము కనుపఱచుచున్నారు.

చంద్రకుమారి—గొల్లలుకూడ ఇక పంగనామములు పెట్టుదురు కాబోలు. ఉప్పరులు గుళ్లు గోపురాలు కట్టింతురు కాబోలు. ఎట్టి మాయదారి కాలము వచ్చెను.

రుక్మిణి—వారు మాత్రము మనుష్యులు కారా? అందఱితో బాటు ఈశ్వరుడు వారిని సృష్టించలేదా? మీరే ఈశ్వరుని పూజించవలయునని ఇతరులు కూడదని ఎచ్చటనైన సిద్ధాంతము చేసియున్నదా?

చంద్రకుమారి—అట్లని నేను ఉప్పరులతో సమానమేనా? ఏమి మాటలివి?

రుక్మిణి—నీతోలు కొంచెము ఎక్కువగా నున్నది. తెల్లని బట్టలు కట్టి నాలుగు నగలు తగిలించుకొంటివి. ఇదేనా భేదము? ఇంకేమైన నున్నదా?

చంద్రకుమారి—ఇంతేనా? నీవు సన్యాసి జందెమునకు సాతాని జుట్టుకు లంకెపెట్టు దానివలె నున్నావే. నే నెవ్వతెనో తెలియునా? సూర్యవంశస్థురాలను.

రుక్మిణి—నాకిది ఇదివఱకు తెలియదు కాని ఇప్పుడు తెలిసినది లే. కాని నీభర్త వంకరతలగుడ్డ చుట్టి వల్లెవాటు వేసికొని వీధులవెంట ఊడగొట్టిన నగవలె తిరుగుటయే కాని, ఏ యుప్పరితో నైన మల్ల యుద్ధము చేయగలడా? మీ మామయనను చిన్న ఉప్పరపిల్లవాడే మడిచి కాలిక్రింద పెట్టుకొన గలడు. తెలియునా?

వ్రజరాణి—అబ్బా, ఒక నమస్కారము చేసెదను. మీ వాదన చాలింతురు! వచ్చినప్పుడెల్ల ఏదో దెబ్బలాటకే డీకొందు రెందుకు?

సేవతి—తండ్రికొడుకుల కెట్టిదశ పట్టెనో చూడుడు. సాలిగ్రాము చంద్రుని నిమిత్తమే సన్యాసము పుచ్చుకొనిన ట్లున్నది. ఇదంతయు ఆయన నేర్పిన పాఠమేమో.

రుక్మిణి—మఱింకేమను కొంటివి? తండ్రి బ్రహ్మానందస్వామి యయ్యెను. ఆయన, కొడుకు నేమైన గుర్తించెనేమో”

సేవతి—గుర్తించి ఆయన సంతోషము పట్టజాలక పోవచ్చును.

రుక్మిణి—అదికూడ ఈశ్వర సంకల్పమే కావచ్చును. కాకున్న చంద్రుడు ఆయనను వెదకుకొనుచు మానససరోవరమున కేలవెళ్లును?

సేవతి—అంతయు భగవదిచ్ఛ. వానికి తెలియక నేదియు జరుగదు కదా?

వ్రజరాణి—మీరు మానాన్న సంగతి మఱచితిరా? మొదట చంద్రునికి ఆయన ఋషివేషముతో కనుపడిరి. సంవత్సరము దాక

చంద్రుడు ఆయన దగ్గఱనే యుండెను. తరువాత ఇద్దఱుకలిసి మానస సరోవరము వెళ్లిరి.

రుక్మిణి—అవునే. ప్రాణనాథుడు వ్రాసిన వ్యాసములో ఈసంగతి కూడ నుండెను. బాలానందుడును నాకు సజీవనలాలు సాంగత్యమబ్బకున్న కూటికై కొంపలవెంట తిరుగు బైరాగులలో చేరెడువాడనే అని ఒకచోట చెప్పుకొనెను.

చంద్రకుమారి—ఆయన ఆత్మోన్నతికయి పరమేశ్వరుడు మొక్కటి నుండియు సమస్త పరికరములు జతపరిచెను.

సేవతి—చూడవే, ఇంత చిన్నవయసునందే భారతసూర్యుడయి నాడు. ఇప్పు డిరువదియైదవ యేడేనా?

వ్రజరాణి—కాదు. ముప్పదవ యేడు. నాకన్న నొకయేడే పెద్ద.

సేవతి—ఆయనకీర్తి కాంతులు విని సుహాము సంతోషపడవచ్చును.

రుక్మిణి—ఏమో, నాకామెను చూచినపుడెల్ల ఏడుపే వచ్చును.

చంద్రకుమారి—ఆమె బ్రతుకంతయు భగ్గున నుండిపోయి నపుడు ఏడుపేల రాకుండును?

రుక్మిణి—తనకొడుకు కందఱికి ఆదర్శకుడు గావలెనను కోరికే ఆమె కున్నదట.

చంద్రకుమారి—నాకు తెలియక అడిగెదను, సాంఘికసేవ ఆయన గృహస్థుగానుండి చేయుటకు వీలులేదా?

రుక్మిణి—ఒక సాంఘికసేవ యేమిటి? గృహస్థుగానుండి మఱే పనియు చేయుటకు వీలు లేనే లేదు. గృహస్థులు కేవలము తమ ఆలుబిడ్డల సరంక్షణకై పెనుగబడి త్రొక్కుకొను చుండుటే కాని మఱే మియు చేయలేరు.

చంద్రకుమారి—చేతకానివారి కవన్నియు సాకులు కాని చేయువారు చేయుట లేదా?

రుక్మిణి—ఆ చేయకేమి. మీ యాయన మా యాయన రాత్రిం బగళ్లు చేయుచున్నది చూచుటలేదా?

నెల గడచెను. ప్రజరాణి కావ్యము నూతనసందేశము తీసికొని బాలానందుని యొద్దకు వెళ్లెను. కాని ఆయన ఆ యాహ్వానము నంగీకరించెనో లేదో ఎవ్వరికిని తెలియదు. కాశీవాసులు ఎదురుచూచి చూచి విసిగి పోయిరి. బాలానందుఁడు రోజుకు రోజు దక్షిణదేశము నకే పోవుచున్నందున ప్రజలందఱు క్రమముగా నిరాశపడిరి. అందఱి కన్న నెక్కువ ప్రజరాణి చాల నిరాశపడెను.

బాలానందుఁడు కాశీవచ్చునని తలపని సమయమున ప్రాణనాథుఁడువచ్చి "సోదరీ! ఇఁక నెమ్మదిగానుండుము. బాలానందుడు నేఁడువచ్చుచున్నాఁడు" అనెను.

ప్రజరాణి అప్పుడేదో వ్రాయుచుండెను. ఆకబురు వినగనే ఆమె చేతిలోని కలము క్రిందపడెను. మాధవిలేచి వాకిలివైపు దుమికెను. ప్రాణనాథుఁడు నవ్వి "అప్పుడే వచ్చెననియా మీరంత త్వరపడు చున్నారు?" అనెను.

మాధవి—"ఎప్పుడువచ్చును? ఇక్కడినుండియే వెళ్లునుకదా" అని యడిగెను.

"ఎక్కడినుండి ఎటువత్తురో ఎవరికి తెలియదు. ఏవిధమైన కోలాహలమన్నను ఆయనకు చాల అసహ్యము. అందువలన వచ్చెడువేళ నిర్ణయింపకయే చప్పునవచ్చిపడును. ధర్మసింగు సేవకుడువచ్చి 'బాలానందుడువచ్చుచున్నాడు. ఆయన స్వాగతమున కేవిధమగు డాంబికములు చేయవద్దు' అనిచెప్పెను. కాని మనవారేమైన విందురా? పట్టణములోని వారందఱు శాశ్వతముగా ననుకొనులాగున ఆయనను మహావైభవముతో పల్లకీలో కూర్చుండబెట్టి ఊరేగించి తోడ్కొని వచ్చుటకు నిశ్చయించుకొనిరి. ఎక్కడచూచినను మనుష్యులే. ఆయన

వచ్చుటతోడనే టెలిఫోనుద్వారా అందఱకు తెలుపుదురు. కాలేజి హైస్కూళ్ళ విద్యార్థులు చక్కని దుస్తులు ధరించి జెండాలు పట్టుకొని ఎదురుచూచుచున్నారు. ఇంటింటను గంపలకు గంపలు పూలున్నవి. బజారులోని దుకాణము లన్నియు శృంగారించుచున్నారు. పట్టణమంతట అలజడిగానున్నది''

"మనయింటిముందఱగా పోయిన ఇక్కడ ఆపుదము''

"మనమందుకు ముందుగా నేమియు సిద్ధముచేయలేదు. ఎట్లాపగలము? వారెక్కడినుండి వెళ్లునది తెలియదు."

ప్రజారాణి—(విచారించి) కనీసము హారతియిచ్చు నేర్పాటైన చేయవలయును."

ప్రాణ—చివర కిదియైన చేయకున్న బాగుండదు. మీపనిమీరు చేయుడు. నేను బయట పట్టాలు పరిపింతును.

ప్రాణనాథుఁడు బయటికివెళ్లి తనపనియందుండెను.మాధవి పూలు కోయుచుండెను. ప్రజారాణి బంగారు పళ్ళెముతోమెను. సేవతి, చంద్ర లోపలి పనులు చక్కబెట్టుచుండిరి.

మాధవి సంతోషముపట్టజాలక ఆయన వచ్చుచుండెనో, లేదో, యని నిముషమునకు పదిసారులు వాకిలిదగ్గఱకువచ్చి తొంగి చూచుచుండెను. మేళముల చప్పుడగుచున్న దేమోయని ఆమె చెవియొగ్గి వినుచుండెను. ఆనందోద్వేగముచే ఆమె హృదయ ముబికి పోవుచుండెను. ఆమె తోటలో పూలు కోయుచున్నను, ధ్యానమచ్చట లేనందున ఎన్నో ముండ్లు ఆమె చేతిలో గ్రుచ్చుకొనెను. పూలతోపాటు వానికొమ్మలనుకూడ, కోసెను. ఆమె యటునిటు తందర బిందరలాడుచున్నందున చాల సారులు కొమ్మలు తట్టుకొని క్రిందపడెను. చీరె కొట్టుకు తగులుకొని చిరిగెను. ఆమె పసిపిల్లవలె ప్రవర్తించుచుండెను.

కాని వ్రజరాణి వదనము చాల వాడియుండెను. నిండుకుండ కొంచెము తొణకినంతనే నీళ్లు క్రిందబడిపోవునట్లు వెనుకటిసంగతులు జ్ఞప్తికి తెచ్చుకొనుచున్నందున ఆమెకన్నులనుండి అశ్రువులు తొణికి జారిపడుచుండెను. "మేమిద్దఱము అన్నా చెల్లెలువలె గడిపిన దినములు కలవు. ఒక్కచోటనాడి ఒక్కచోటపాడితిమి. నేటికి పదునాలుగేండ్ల నుండి ఆయన ముఖముచూడని దౌర్భాగ్యము నాకు కలిగినను, నాక న్నులనుండి కొంచెము నీరుకార్చిన ఆత డుత్తరీయముతో వానినిఅద్ది మనోహరములగు మధుర భాషణములు నాకు వినుపించును. ఆ మహా నీయుని తలచి యేడ్చియేడ్చి నా కన్నులు వాచినవి. హృదయమెన్నో కష్టములు సహించినది. ఈసందర్భమున ఆయనను చూతునని కల నైన అనుకొనలేదు. హా! నాకు వైధవ్యముపట్టినది ; ఆతడు సన్యాసి యయ్యెను." అని చాల విచారపడెను.

ఆకస్మికముగా మాధవి సువాము కీసంగతి తెలియునో తెలియదో, యనుకొని వ్రజరాణి యొద్దకు వచ్చి "పిన్ని కెవరైన ఈసంగతిచెప్పిరో లేదో, నేనైన చెప్పి వచ్చెదను" అనెను.

బయటనుండి వచ్చుచున్న ప్రాణనాథుఁడు, ఆమాటవిని "అందరి కన్న ముందే ఆమె కాసంగతి తెలియజేసితిని. యథావిధిగానన్నియు సిద్ధమగుచున్నవి. బాలానందుఁడు సరాసరి ఇంటికేపోవును" అనెను.

వ్రజరాణి—అట్లయిన మన మక్కడికి త్వరగా వెళ్లుదము పదండి. లేకున్న ఆలస్యమగును.

మాధవి—హారతి పళ్ళెము తెత్తునా?

వ్రజరాణి—"అది ఎవరంత దూరము మోయుదురు? వంట లక్క నైనపిలువు" (అని యులికిపడి) "ఓసీ! నీచేతులనిండ ఆ నెత్తురెక్క డిదే" అనెను.

మాధవి—పూలుకోయుచుండ ముండ్లు గుచ్చుకొన్న వేమో!

6-6-55

చంద్ర—ఈనాడే క్రొత్తచీరెకట్టుకొని చీలికలు పేలికలు చేసినది చూడ రాదా మహాతల్లి.

మాధవి—మీతొందఱవల్లనే.

మాధవి ఎట్లో మాటలాడుచుండెను, కాని కన్నులుమాత్రము అశ్రుపూరితములై యుండెను. చంద్రస్వభావము మంచిదైనను బాలా నందుని సేవచేయుటకు రాధాచరణుఁ డుద్యోగమువదలిన నాఁటినుండి బాలానందుఁడన్న చాలమండిపోవుచుండెను.వ్రజరాణిఏమియు ననజాల కుండెను,కాని మాధవి కొంచె మామెను మందలించుచునేయుండెను. అప్పుడు వ్రజరాణి చంద్రను ఉరిమిచూచి మాధవితో,

„వెళ్ళి ఆచీరవిడిచి క్రొత్తచీర కట్టుకొనిరా. రామ రామ! ఎంత హడావుడిదానవే. చేయియంతయు చూడు ఎట్లున్నదో!" అనెను.

మాధవి—ఇప్పుడు నాకు చీరవద్దు గీరెవద్దు. ఆలస్యమగును. ఇట్లేవచ్చిన నన్నెవ్వరక్కడ కాననెదరు?

వ్రజరాణి—నామాట విను. పోయిరా. ఇంక చాలా ఆలస్య మున్నది.

అని ప్రేమతో నెత్తురుకారుచున్న మాధవిచేతులు కడిగి,తలదువ్వి, ఆమెచే చీరకట్టించి, కౌగిలించుకొని సజల నేత్రయై చూచుచు, „చెల్లీ! ధైర్యముగా నుండు" అనెను.

మాధవి మందహాసము చేసి „నీవు నాదగ్గఱనుండి చక్కగా చూచుచుండుము. నా కీనాడు బొత్తుగా నమ్మకములేదు" అనెను.

„ఇది పిచ్చిదయినది" అని వ్రజరాణి యనుకొనెను.

కొంతసేపటికి మాధవి, వ్రజరాణి, సేవతి, చంద్ర, మఱికొంద ఱాఁడువారుకలిసి సువామ యింటికేగి, అచ్చటి వైభవము చూచి వింతపడిరి. వాకిలి యందొక చందువా ధగధగ లాడు నిలువుటద్దములతో అలంకరింపబడియుండెను. మేళములు మ్రోగుచుండెను.

పెద్దపెద్ద పళ్ళెములందు, తట్టలందు మిఠాయి కొల్లగానుండెను. నగరములోని ప్రసిద్ధపురుషులందఱు అమూల్య వస్త్రాభరణములు ధరించి ఆయనకు స్వాగతమనుటకువచ్చి యట నిలిచియుండిరి. బగ్గీ బండ్లు గుఱ్ఱపుబండ్లు కనుచూపు మేరవఱకు కనుపడుటయే లేదు. బాలానందుఁడెప్పుడు కాలినడకను సంచారము చేయుచున్నందున, అందఱ కాయన కనుపడడేమోయని ఆ ఏర్పాటు జరిగెను. చాలమంది మెడకు రూపాయల జోలెలు కట్టుకొని బాలానందుని మీఁద ఎగజల్లుటకు సిద్ధముగనుండిరి. ధర్మసింగు, ఆతని ఐదుగురు కొడుకులతో కాషాయవస్త్రములు కట్టుకొని, వంకర తలగుడ్డలు చుట్టుకొని, పట్టు జెండాలు మొలలో దోపుకొని ఈలలు వేయుచుండిరి. ప్రజరాణి ప్రజల కగుపడగనే లక్షలకొలది నేత్రములు పూజ్యభావముతో ఆమె పాదములమీఁద వ్రాలెను. రమణీయమణులందఱు లోపలికి పోగనే, ఇండ్లువాకిండ్లు దొడ్లు దోవలన్నియు క్రొత్తకోడలివలె శోభాయమానముగానుండెను. అనేకస్త్రీలు మంగళగీతములు పాడుటకు కాచియుండిరి. ఎక్కడచూచినను సుగంధకుసుమములు కొండలుకొండలుగా పడియుండెను. సుహాస తెల్లచీర కట్టుకొని ఆనందమూర్తియై వాకిట నిలువబడి ప్రజరాణిని మాధవిని చూడగనే కన్నుల నీరు కార్చెను. అప్పుడు ప్రజరాణి "పిన్నీ, నేడీ యింటిభాగ్యము పండినది" అనెను.

సుహాస—మీవల్లనే నాకిట్టి సౌభాగ్యము కలిగినది. భగవంతుఁడు దీనికి తగిన ప్రతిఫలము మీకొసంగుగాక! అనెను.

ఇంతలో గంటలు, శంఖములు మ్రోగగనే 'బాలానందజీ వచ్చెను' అనిగోల చెలరేగెను. స్త్రీలందఱు మంగళగీతముల నారంభించిరి. మాధవి హారతిపళ్ళెము తీసికొని ఆయనరాక కెదురుచూచుచుండెను. కొంతసేపటికి అద్వైతాంబర ధారులగు యువకులు కనిపించిరి. 'భారతసభ'లోని నూటయేబదిమంది సభ్యులు గుఱ్ఱములెక్కి వచ్చు

చుండిరి. వారి వెనుక జనసమూహముండెను. నగరమంతయు నక్కడనే విరిగిపడినట్లుండెను. ఒకరి కాళ్ళొకరు త్రొక్కుకొనుచుండిరి. సముద్ర తరంగములవలె జనులు తెంపులేక గుంపులుగుంపులుగా వచ్చుచుండిరి. ఆ నిబిడజనాటవినుండి బాలానందుని ముఖము మేఘాచ్ఛాదితమైన చంద్రునివలే కనుపడెను. లలాటమున ఎఱ్ఱని కుంకుమ బొట్టుండెను. మెడలో కాషాయాంబరము వ్రేలాడుచుండెను.

వాకిట నిలచిన సువామకు బాలానందుఁడు సమీపించుకొలది ధైర్యము తప్పిపోవుచుండెను. మెల్లగా కన్నీరు కార్చుచు కొడుకు వచ్చువైపు సాగెను. తాను పోగొట్టుకొనిన ముద్దుల పుత్రుఁడు నేఁడు మరల లభించుచున్నందున ఆతని మనఃపూర్వకముగా కౌఁగిలించు కొనుట కామెచాల ఆతుర పడుచుండెను.

సువామ వచ్చుచుండుట చూచి జనులందఱు వెనుకసర్దుకొని ఆమెను పోనిచ్చిరి. బాలానందుఁడు కొన్నియడుగులు ముందుకునడిచి తల్లి పాదములకు నమస్కరించెను. సువామ పుత్రుని తలమీఁద ముత్యములు రాల్చుచుండెను.

ఆదృశ్యమును చూడగనే ప్రజల హృదయములు ద్రవించిపోయెను. ఏబదివేలమంది గొంతులు పగులునట్లు "బాలానందకి జయ్" అని ఆకాశము బ్రద్దలగునట్లు గంభీర హర్షధ్వనిచేయగనే, ఆతనిమీఁద నలువైపులనుండి పుష్పవృష్టికురిసెను. మరల మొదటివలెనే "సాలి గ్రామునకు జెయ్" అను నినాదము పుట్టెను. అనేకులు భక్త్యుద్వేగముతో ఒడలు మఱచి పరుగిడి సువామ పాదధూళిని దమ తల దాల్చిరి. ఇట్టిమనోహర హర్షధ్వనులు నాగస్వరమువిన్న త్రాచువలె సువామ సంతోషపడెను. నేఁటి కామె చేతులకు, తప్పించుకొనిపోయిన కొడుకు చిక్కెను.

ఆహా! ఇట్టియపూర్వ దృశ్యము! మాటిమాటికి మింటి కెగయు

చున్న హర్షధ్వానులకు స్వర్గవాసులు తుళ్ళిపడి లేచుచుండిరి. ఎంతో కాలము ఘోరతపముచేసి మధ్యపోగొట్టుకొని మరల పొందియుండుటచే చెప్పశక్యముగాని ఆనందము వెల్లి విరియుచుండ ఆమె పుత్రుని కౌగిలించుకొనెను. రత్నములు, పవరలు, పుష్పములు వారిరువురి మీాద కురియుచుండెను. తల్లికొడుకు లిద్దఱు కంఠమువఱకు పూలతో నిండిపోయిరి.

సువాము కొడుకుచేయిపట్టుకొని యింటికి తీసుకొని వచ్చుటతోడనే వాకిలియొద్ద స్త్రీలందఱు మంగళ గీతములు పాడసాగిరి. మాధవి బంగారు పళ్ళెరమందు ధూపము, దీపము, పుష్పములు ఉంచుకొని హారతిచ్చెను. మాధవి నెత్తురు చేతులతో గ్రుచ్చిన హారమును వ్రజరాణి బాలానందుని మెడలో వేసెను. ఆతఁడు సజలనేత్రములతో వ్రజరాణినిచూచి యామెకు నమస్కరించెను.

౨౩

మానవహృదయము సమస్తాభిలాషల కాటపట్టు. మాధవి తల్లియొద్ద నాడుకొనిన రోజులలో ఆమె మనస్సులో ఏకోర్కెలు, దిగులు లేక నెమ్మదిగా నుండెను. కాని బొమ్మరిండ్లు వేయుట సాగించినది మొదలు, అందులో బొమ్మలపెండ్లి చేసిన బాగుండునని తలచెను. ఊరిలోని బాలికలు బొమ్మలపెండ్లిండ్లు చేసికొనుచుండ నాబొమ్మల కర్మమేమి కాలిన దని వానికి నగలుచేయించి చీరలు సారెలు కట్టి, పెండ్లి చేయవలయునని కొన్నాళ్లు దిగులుపడి యేడ్చెను. కాని ఒకనాఁడు మబ్బుపట్టి ఏనుఁగు తొండములావు ధారగట్టి వాన కురియగా ఆమె బొమ్మరిండ్లు చదునాయెను. అందువలన వాని పెండ్లి జరుగలేదు.

ఇఁక కొంతకాలము గడచిన మీఁద ఆమె తల్లివెంట వ్రజరాణి యొద్దకు వచ్చుచు పోవుచుండెను. వ్రజరాణి మంచితనము చూచి చనువుతో ఆమె కంచములో దిని, ఆమె యొడిలో పరుండెడిది. అప్పుడామె హృదయములో "మాయిల్లు మహారమణీయముగా నుండవలె; దానికి వెండితలుపులు పెట్టించవలె; నేలంతయు నున్నగా గచ్చు చేయించవలె; వ్రజరాణిని మాయింటికి తీసుకువచ్చి పప్పు పరమాన్నముచేసి విందుచేయ వలె; పందిరిమంచము మీఁద పరుండబెట్టి ఆమెకాళ్లు పిసుకవలె" అని యాందోళన పడు చుండెడిది. ఆకోర్కెలన్నియు చాలవఱ కామెను కలవర పెట్టుచుండెను. కాని బొమ్మరిండ్ల వలెనే ఆకోర్కెలుకూడ నేల గూలెను.

ఇంకను కొంతకాలము గడువ ఆమెకు యౌవన మంకురించెను. వ్రజరాణి చంద్రుని గుణములు గోరంతలు కొండంతలుగా వర్ణించి యామెకు చెప్పెను. ఆరోజులలో ఆతని పురాణము తప్ప మఱేదియు ఆమెకు విన నిష్టములేదు. క్రమముగా తాను చంద్రుని భార్య కావలయునని ఆమె దృఢనిశ్చయము చేసుకొనెను. నిద్రపోవుచు ఆతనితోనే మాట్లాడును. ఈచర్యల వలన ఆమెకు పిచ్చియెత్తిన ట్లుండెను. ఇంతలోనే చంద్రు డదృశ్యుడయ్యె ననునది వినగా ఆకోర్కె కూడ బొమ్మరిండ్లతో కలిసెను. ఆమెకట్టిన గాలిలోని మేడలన్నియు రూపుమాసెను.

ఆమె నిరాశపడి చంద్రుఁడు తనను వివాహ మాడవలయునని నోములు, వ్రతములు చేయసాగెను. ఇట్లెన్నో సంవత్సరములు ఆమె తపస్వినిగా గడపెను. కల్పితప్రేమ వలన ఆమెవాడిపోయెను. కాని నేఁడు హృదయమున నూతనాభిలాషలు మొలక లెత్తెను. పదిసంవత్సరముల నుండి చేసిన తపస్సంతయు ఒక్క క్షణములో నిర్మూల మాయెను.

నేఁడు బాలానందునికి హారతిచ్చినది మొదలు వ్రజరాణికి కన్నీ రాపినను ఆగలేదు. పగలు గడచెను. చుక్కలన్నియు క్రమముగా

పొడుచు చుండెను. సూర్యుడు అలసి దాగుకొనెను. పక్షులు గూండ్లకు చేరెను. కాని మాధవి కన్నులుమాత్ర మలయలేదు. "అయ్యో! నే నీవిధమున ఏడ్చుటకే పుట్టితినా? నేనింత శ్రమపడుచున్న నారితో ఒకసారి యైన నవ్వలేదు. ఏడ్చుచుండగనే ఇప్పటికి సగమాయువు గతించెను. శేషించినది కూడ ఇట్లే గడచునా? నేనుకూడ కొన్నాళ్లు సుఖపడితినని అనుకొను రోజులు రావా!" అని ఆమె విచారపడుచుండెను. ఇంతకు ముందెన్నడు మాధవి నిరాశచేత దిగులుపడక తన కల్పితప్రేమ యందే యుండెను. నేడో ఆమెకు నూతనాభిలాషలు గోచరించెను. వాని ప్రేరణచేత అశ్రువులు దొరలు చుండెను. ఎంతో కాలమునుండి ఆశపెట్టుకొని యున్న మాధవికి నేడు తనకోర్కెయందనుమానము కలిగెను.

సువాసుకు కూడ నూతనాభిలాషలు పొడసూపెను. బాలానందుడు కనుపడ నంతవఱకు ఒక్కమాఱు వానిని కన్నులార చూచి మనస్తాపము తీర్చుకొందు నని యనుకొనెను. నేడాతనిని కన్నులార చూచి యింక కొంత చూచుటకు కోరెను.

నేడు సువాసు, వ్రజరాణి, బాలానందుడు కూర్చుండి ప్రొద్దు గ్రుంకువఱకు మాటాడుకొనుచుండిరి. బాలానందుడు తన యనుభవము లన్నియు తెలిపెను. సువాసు తనచరిత్ర వెళ్లబోసుకొనెను. వ్రజరాణి ఆతనితో కొంచెముసేపు మాటాడెను, కాని ఆతనివలన వినుట మాత్రము చాల వినెను. సాలిగ్రాము సన్యాసము పుచ్చుకొనునది విని, ఇరువు రాడువాండ్రు దుఃఖించిరి. బాలానందుడు దీపాలు పెట్టువేళ సంధ్యావందనము చేసికొనుటకు గంగాతీరమునకు వెళ్లెను. సువాసు వంటచేయుటకు కూర్చుండెను. ఇప్పటి కామె ఏ చింతయు లేక వంట చేయుచు,

"వ్రజరాణీ! నా కొడుకు తిరిగి మనలోకములో ప్రవేశింపవలయు

నను కోరిక నాకు కలదు. అది ఈశ్వరేచ్ఛవలన సంపూర్తియయ్యెను. చంద్రుఁడు తాత తండ్రులవంశమును పావనము చేసెను. నేటియుదయమున జరిగిన జయకారములవలన నా మొదలు పొంగిపోయెను. వాడీ వైరాగ్యము వదలవలయుననియే నేఁ కోరుచున్నాను. ఇంటి పట్టుననుండి జాతీయోద్ధరణవ్యవహారములలో జోక్యముకలుగ జేసుకొనిన నేనడ్డమువత్తునా? అట్లుండవలయుననియే నాకోరిక. యిట్లు సన్యాసిగానుండిన నా గుండెలు బ్రద్దలగుచున్నవి" అనెను.

వ్రజరాణి సువామభావము కనిపెట్టి,

"పిన్ని, ఈ సంగతి నాకు మొదటినుండియు తెలియును. కాని సమయము వచ్చినపుడు హెచ్చరించెదను" అనెను.

"సమయ మెప్పుడు వచ్చునో? ఎప్పటికప్పుడు ఎక్కడికి లేచిపోవునోయని భయమువేయుచున్నది. దండము తీసికొని తోటలో దిరుగుచున్నాడని విన్నాను కాని ఏమిచేయునో! పాపమా మాధవి పడు నవస్థ నేను చూడజాలను. దానిని చూచుట తోడనే నా గుండె లెగసి పోవుచున్నవి. ఎందఱో ఆడువాండ్రను చూచితిని, కాని ఇదెక్కడి ప్రేమయో, హద్దులేదు? ఏడ్చి యేడ్చి సగమాయువు గడపినది. నా ముందఱ నెన్నడు ముఖము చిన్నబుచ్చుకొనలేదుగాని, యేడ్చు కండ్లు, నవ్వుముఖము, దాచినను దాగవు. నా కిట్టి కోడలు కావలయుననియే కొండంత యాశకలదు. దాని నీశ్వరుడు సంపూర్తిచేసెను" అనెను.

"నేఁడది పగలంతయు ఏడ్పుతోనే గడిపినది. ముఖము చాలవాచి యున్నది."

"అటులయిన నేడే వానిని కదలించి చూడుము. లేకున్న ఆతఁడు రేపెక్కడికైన పోయినతరువాత, మనమెంత మొత్తుకున్నను రాడు"

వ్రజరాణి విచారించి, "కదలించుటకు నేను వెనుకాడను, కాని ఈ

విషయమున మాధవియే పాటుపడిన చాలమంచిది'' అనెను.

"పాపము పసిదాని కేమి తెలియును ?"

"అది మాటలాడ నక్కఱలేదు. దాని కన్నులే సమస్తము చెప్ప గలవు"

"బాబు మనస్సులో నే మను కొనునో"

"ఏమను కొనును ? నీవు దాని నింకను పసిపిల్లగా భ్రమపడు చున్నావు. అది యిదివఱకే చంద్రుని భార్యయయ్యెను. వారి వివాహము ఈశ్వర సమ్ముఖమున జరిగెను. అట్లు కాకున్న లోకములోని కెవ్వరు పురుషులులేరా ? మాధవివంటి దాని నెవ్వరు కాదందురు ? అది యింతవఱ కెవ్వరిని వరించక ఏడ్చి యేడ్చి చంద్రుని కొఱకే సగమాయువు గడపినది. ఇప్పటికి పన్నెండేండ్లనుండి సన్యాసివేషము తోపడరాని అగచాట్లు పడుచున్నది. మంచముమీద పరుండక, రంగుచీరెలు కట్టుకొనక, వెంట్రుకలు చిక్కుదీసికొని వ్రేలుముడియైన వేసు కొనక కనుపడుచుండ, దాని వివాహమయినదని తెలియుటలేదా ? మనస్సులు కలిసినవి. వివాహము కాని పెద్ద కుంకుమబొట్టు, బ్రహ్మముడులు, తలంబ్రాలు, ఇవన్నియు డాంబికములు."

"సరే, మీ యిష్టము వచ్చినట్లు చేయుడు. పదుగురు విని నవ్వకుండిన నాకు చాలును."

రాత్రి తొమ్మిది గంటలయ్యెను. ఆకాశమున చుక్కలు మెఱయు చుండెను. మాధవి తోటలో నొంటరిగా కూర్చుండి నక్షత్రములను చూచి "ఆహా ! అవి చూచుట కెంత సొంపుగా నున్నవి. కాని చాలదూరము. ఎవరైన అచ్చటికి పోగలరా ? నా కోర్కెలా నక్షత్రముల వంటివేనా ?" అని తనలో తాను యోజించుకొనుచుండ, వ్రజరాణి వచ్చి యామె చేయి కదలించెను. మాధవి ఉలికిపడెను.

వ్రజరాణి—'ఇక్కడ చీకటిలో కూర్చుండి ఏమిచేయుచున్నావు ?'

అని అడిగెను.

"ఏమియు లేదు. చుక్కలను చూచుచున్నాను. చూడు, అవి ఎంత సొంపుగానున్నవో! చిక్కనౌకదా"

"ఇప్పుడు చుక్కలు లెక్కించవలసిన సమయముకాదు. ఏ యతిథికై పొద్దుటినుండి ఆ సంగము పట్టజాలక పొంగిపోవుచుంటివో, ఆయనకీ విధముననే సేవచేసెదవా?"

"నేనా అతిథిసేవకు తగియున్నగదా"

"అట్లయిన ఇక్కడినుండి లెమ్ము. నేను దానికి తగిన యుపాయము చెప్పెదను."

అని ప్రజారాణి మాధవి చేయిపట్టుకొని లేవదీసి లోపలికి తీసికొని వెళ్లెను. సుహాసు అన్నము వండెను. తల్లిచేతి యన్నము చాలకాలమునకు లభించినందున అపరిమితానందముతో ఆతడు భోజనము చేసెను. బాలానందుడును భోజనముచేసి పండుకొనిన తరువాత, ప్రజారాణి మాధవిని పిలిచి "ఇప్పుడీమూలముఖము దాచుకొని యుంటివేల?" అనెను.

"కొంచెము తింటిని, పరుండవలయు నని యే నా ప్రాణము కోరుచున్నది."

"మాధవీ! ఇంత నిరాశపడుచువేల? ఇన్నాళ్లు కష్టపడి చివరకు ఈ రోజున పాడుచేయుదువా?"

మాధవి లేచెను. కాని మనస్సు ఆ మెడ క్రిందికే లాగుచుండెను. చేదెడు మబ్బు ఆకాశమున కనుపడి చెరువులు కుంటలు ఏకముచేయవలయునని తీవ్రపడుచుండ, ఆకస్మికముగా తుపానువచ్చి ఛిన్నభిన్నము చేసెను.

"ఎన్నడైన చంద్రుని దర్శనము చేసికొని, ఆతని యమృతమయ వాక్కులు విని సంతృప్తిపడెడు సుదినము నాకీ జన్మలో లభింపకుం

డునా" అని మాధవికి సంపూర్ణాభిలాష కలదు. అట్టి దినమునకే ఆమె యెన్నో ప్రయత్నములు చేసెను.

నేటి ప్రాతఃకాలమునుండి మాధవి ప్రసన్నవదనముతో నుండి పూలదండ గుచ్చెను. ఎన్నో ముండ్లు ఆమె చేతులలో గుచ్చుకొన్నను, అటునిటు పడుచు లేచుచుండెను. చిరకాలమునుండి పిచ్చిదానివలె వేచియున్న శుభదినము నేడు లభించుటచే, ఆమెకింత పరవశత్వము కలిగెను. సంతోషమునకును హద్దుకలదు. సుఖమనునది ఎఱుగని దానికిపుడు కలిగినది చాలదా? పాప మామె ఇంతకన్న ఎక్కువ భరింపలేకపోయెను. ఎన్నడు పెదవులమీదికి నవ్వురానివారికి చిఱు నగవే అసలు నవ్వుతో సమానము. మాధవి బాలానందుని దగ్గఱకు పోయెను. కాని క్రొత్త క్రొత్తనగలు పెట్టుకొని శృంగారించుకొని భర్తకడ కేగు శోభనపు పెండ్లికూతురివలె ఆమె పోలేదు. ఆతఁ డున్నగది తన దేవతామందిరమని ఆ మందిరములో విగ్రహము లేన పుడు బాష్పపుష్పములను నివేదించుచుండెను. కాని నేడు విగ్రహము ప్రత్యక్షముగా కనపడుచుండ ఆమె యిట్లు వెనుకంజవేయుచున్న దేల!

రాత్రి చాలభయంకరముగా నుండెను. వీధులందు ట్రాముబండ్ల గంటలు వినబడుచుండెను. మాధవి మెల్లగా బాలానందుని గదిదఱకు రాగా, ఆమెగుండె గుబుక్కుమనెను. లోపలికి పోవు సాహసమామెకు కలుగలేదు. ఎవరోవచ్చి యామె కాళ్లు కట్టివేసినట్లుండెను. వచ్చిన దోవనే పోయి యేడువసాగెను. అప్పుడామె యంతరాత్మ "మాధవీ! ఇది చాలసిగ్గుపడవలసిన విషయము. నీవు బాలానందుని దాసివి. నీ కాతనిమీద అనురాగము కలదు, కాని నీ వాతని భార్యవుకావు. నీ వాతని గృహిణిగా నుండతగవు. ప్రేమవేఱు,సాహసచర్యస్థు వేఱు. ప్రేమచిత్త విభ్రాంతికాని వివాహమో పవిత్రధర్మము" అని యామెకు చెప్పినట్లు తోఁచెను. వరుడు విశాలసభామంటపమున భార్యాహస్తము

పట్టుకొని, ఈ మెను నా గృహిణిగా, అర్ధాంగిగా తలతును. ఇందుకీ సభాసదులు, పంచభూతములు, సాక్షుల' అని పలికినట్లు పెండ్లివేడు కలు ఆమె మతికివచ్చెను.

"ఆహా! ఎట్టి మంచిమాటలు! నా కెన్నడైన ఇట్టిమాటలు విన్న భాగ్యముపట్టినదా? నేను పంచభూతములను సాక్షులుగా జేసికొనలేదు. ఓ అగ్నీ! ఓ నక్షత్రములారా! దేవలోకవాసులారా! మాధవి ఇతర దుష్టసంకల్పములకు తా వొసంగక తనహృదయములో బాలానందుని దివ్యస్వరూపమునకే తా వొసంగినది. కాన మీ రందఱు సాక్షులుగా నుండుడు. అగ్నీ! నే నాయింటిలో కాలుపెట్టినవెంటనే నన్ను భస్మము చేయుము! ఆకాశమా! నీవు నీ యగణితనేత్రములతో నే నింటి లోనికి పోవుచుండుట చూచితివేని నా మీద పిడుగు పడవేయుము!"

కొంతసేపటివఱకు మాధవి ఈ యాలోచనలోనే కూర్చుండి యుండ, తటాలున ఆమె చెవులకు భగ్గు, భగ్గుమను శబ్దమువినఁబడెను. ఆమె యులికిపడి తిరిగిచూడగనే బాలానందుని గదిలో చాల వెలు తురు కానవచ్చెను. మంట కిటికీలవెంట బయటికివచ్చి,దొడ్డియంతయు వ్యాపించిపోయెను. అప్పుడు మాధవి నిర్విణ్ణయైచూడ, బల్లపై లాంపు మండుచుండెను.ఆమె అవాయుచువ్వవలె లోపలికిపోయిచూడ లాంపు పగిలి నేలపై పడియుండెను. క్రిందపరచిన పట్టాలపై చమురు పడినం దున నొకవైపునుండి అవియు మండుచుండెను. రెండవవైపు బాలా నందుఁడు పరుండి సుఖముగా నిద్రించుచుండెను. ఇంతగందరగోళము జరుగుచున్నను ఆయన మేల్కొనలేదు. మాధవి అక్కడ పరచిన తివాసీ చుట్టి భగ్గుభగ్గున మండుచున్న మంటమీద కొట్టెను. 'ధమ్' అను శబ్దము కలుగగనే బాలానందునికి మెలకువవచ్చెను. ఇల్లంతయు పొగతో నిండిపోయెను. నలుదిశల నూనెవాసన కొట్టుచుండెను. దీని కంతకు కారణము నాతఁడు తెలిసికొని,

"గదిలో నిప్పంటుకొనెనా? ఎక్కడిది?" అని ప్రశ్నించెను.

"ఈలాంతరునుండి క్రిందపడినది."

"నీవు సమయమునకు ఎక్కడనుండి వచ్చితివి?"

"ఇక్కడే బయట కూర్చుంటిని."

"నావల్ల నీకు చాల కష్టముకలిగినది. ఇకవెళ్లి పండుకొమ్ము. చాల ప్రొద్దుపోయినది."

"వెళ్లెదను. నిద్ర ప్రతిదినము వచ్చుచున్నదే కాని యిట్టి యవసరము అన్నప్పుడెల్ల రాదుకదా?"

అపూర్వ కరుణాభరితములగు మాధవి పలుకులువిని యామె వైపు బాలానందుఁడు నిశ్చలముగా చూచెను. ఆయన మొదట మాధవిని చూచినప్పుడు, ఈమె వికసించుచున్న మొగ్గవలెనుండెను. కాని నేడు వాడిన పుష్పమువలెనుండెను. ముఖమున వికాసములేదు. నేత్రములందు ఆనందకరములగు తళుకు బెళుకులు లేవు. జడలోపూలులేవు. లలాటమున కస్తూరి బొట్టులేదు. శరీరమున పేరునకైన ఒకనగలేదు. ఊహించి యూహించి "బ్రహ్మసరిగా తరుణావస్థయందే ఈదౌర్భాగ్యురాలి సౌందర్యము హరించెను" అని బాలానందుఁడు తలఁచి చాల విచారపడి,

"మాధవీ! నీకు వివాహమైనదా?" అని యడిగెను. మాధవికి గుండెలో శూలము గ్రుచ్చినట్లయ్యెను. సజల నేత్రయై ఆమె,

"అయినది" అని బదులు చెప్పెను.

"నీభర్త ఎక్కడఉన్నాడు?"

"నాసంగతి వారికి తెలియనే తెలియదు. వారు నన్ను వివాహమాడలేదు."

బాలానందుఁడు విస్మితుఁడై,

"నీభర్త ఏమిచేయుచున్నాడు?" అని యడిగెను.

"దేశసేవ"

బాలానందుని కన్నులనుండి పొరలు రాలినట్లయ్యెను. అందుచే మాధవి మనోగతమును గ్రహించి అతఁడు,

"మాధవీ, వివాహము ఎన్నిదినములక్రిందట జరిగినది" అనెను.

"నాకు జ్ఞాపకములేదు. చాలరోజులు కావచ్చును."

బాలానందుని లోచనములు వారిధారలతో నిండెను. ముఖమండలమున్మ్లానమయి నట్లుండెను. "భారతమాతా! ఒకే భావనయందు తన యౌవనము, సమస్త జీవితాశలు సమర్పించెడు నారీమణులు ఇట్టి పతితావస్థయందును నీయందనీమనున్నారు" అనితలంచి యతఁడు,

"అట్టిపతిని ఇంకను ఏల వదలకుంటివి?" అని యడిగెను.

మాధవి అభిమానభరిత దృష్టితో బాలానందుని వైపుచూచి,

"స్వామీజీ! మీరిట్టి మాటలాడకుడు. గాంధారి సావిత్రి మున్నగు మహాపతివ్రతారత్నము లుద్భవించిన ఆర్యవంశస్థురాలనై ఒకసారి మనఃపూర్వకముగా వరించిన భర్తను విడనాడుదునా? అట్లెన్నడు చేయను. నే నిదేవిధమున వాపోవుచు నాభావిజీవితమంతయు గడుపవలసి వచ్చినను, ఆయనపై నాకెంతమాత్రము కోపములేదు. నాశరీరమున ప్రాణవాయువులు సంచరించునంతకాలము వారి హితమునకై భగవత్పూజ కావించుచుందును. సర్వత్ర ఆ మహనీయుని యనురాగము సంపాదించుకొని యున్న నాకు కొదువేమి కలదు? ఆ యనురాగమునే సౌభాగ్యమని తలచి సంతృప్తి నొందుదును. మొదటిసారి దూరమందుండి నా నాథుని దివ్యస్వరూపము చూచితిని. అప్పటి నుండియు ఆ మహనీయుని చిత్రప్రతిమ నాకన్నుల యెదుట అనుక్షణము తొలగక కనుపించుచునే యున్నది. ప్రబలవ్యాధిపీడితురాలనై మంచములో పడియున్నపుడు ఆచిత్రప్రతిమయే నా కుపచారములు

చేసెను. వియోగదుఃఖమున మునిగి నేను కార్చు అవిరళ బాష్పధారలు ఆప్రతిమయే తుడిచి నాకు ఊరటకలిగించును. ఆహా! అట్టి నిరుపమాన కరుణాళువగు పతిని ఎట్లు విడుతును? ఇంతవఱకు నేను వారిదానను. ఇకముందుకూడ వారి పాదసేవకురాలినే, కాని యితరము కాను. నామనస్సు, ప్రాణము వారివశము చేసితిని. వారాజ్ఞ ఇచ్చినచో పూలయ్యవలె భీకరానలమును చేరగలను. నాప్రాణములతో వారికేమైన అవసరమున్న యెడల భక్తిపరవశు డగువాడు ఈశ్వరునకు పూవులు అర్పించునట్లు నేను ఆనంద భరితనై నా ప్రాణము లర్పించుటకు వెనుతీయను" అని పలికెను.

గంభీరప్రేమభరితములగు మాటలు పలుకుచున్నందున మాధవి ముఖమండలము ఎఱ్ఱవారుచుండెను. బాలానందుఁడు మనస్సులో "చూడగా ఈమె నాకై సర్వసంగ పరిత్యాగము చేసినదానివలె కన్పడుచున్నది" అని తలఁపగనే యతనికన్ను లశ్రుపూరితములయ్యెను. ఏప్రేమ యొకరమణిజీవితము భస్మీభూతము చేసెనో దానికై యొక మానవుని ధైర్యమును కాల్చివేయుట ఏమంత గొప్ప విషయము కాదు! ప్రేమయెదుట ధైర్యమెందు కక్కఱకు వచ్చును? కావుననే బాలానందుఁడు మాధవిని చూచి,

"మాధవీ! నీవంటి నారీమణులు భారతమాత యశఃకాంతులు వెదజల్లుటకు తగినవారు. నీప్రేమవంటి అమూల్య పదార్థము నాచేత చిక్కుటచే నేనెంతో అదృష్టవంతుడను. నాకై నీవు యోగినిగా నుండుటకు కృతనిశ్చయురాల వయినచో, నేను నీకయి ఈవైరాగ్యము విసర్జింప గలను. ఎవనికై నీవు అనిర్వాచ్యములగు యాతనల ననుభవించి తపించియుంటివో ఆతఁడు నీకయి ఎట్టి త్యాగమైనను చేయుటకు సంసిద్ధుడు!" అనెను.

మాధవి దీనికే మొదటినుండి సిద్ధముగా నున్నందున వెంటనే

"స్వామీ! నే నబలను; మందబుద్ధిని. కాని నిజము చెప్పుచున్నాను నమ్ముడు. నేటి వఱకు స్వార్థమును గుఱించి నిముషమైన ఆలోచించి యుండలేదు. తమ చరణములకు సంసారబంధము తగిలించుటకే మిమ్మీవిధమున ప్రేమించుచున్నానని మీకు తలచినచో (చేతులు మోడ్చి) స్వామీ! మీరు నాతత్త్వము గుర్తెరుగ లేదు. నేను నాకు లభించిన దానికే, ఇంతకాల మిట్లు మిమ్ము ప్రేమించుటకు కారణము. నాజీవితములో నేడు చాల శుభదినము. ఏలనన—నాజీవితేశ్వరుని యెట్టయెదుట నిలువబడి, ఆపవిత్ర ముఖమునుండి అమృతభరితశబ్దములు వినుచున్నాను. స్వామీ! ఈరోజున ఇట్టి పవిత్రసంఘటనము చూచు సౌభాగ్యము నాకు కలుగునని యెన్నడు నేను తలచలేదు. నాయొద్ద ప్రాపంచిక రాజ్యమే యున్న యెడల, ఆనందముతో దానిని తమ పాదసన్నిధిని సమర్పించి యుండు దాననే. తమ పాదముల నుండి నేను ఎన్నడు విడిపోకుండ చేయుడని చేతులు జోడించి మిమ్ము వేడుకొనుచున్నాను. నేను సన్యసించి తమచెంతనే యుండగలను. కాషాయవస్త్రములుకట్టుకొని విభూతినలదుకొని ప్రళయము వచ్చినను మీసాన్నిధ్యము విడనాడను. ప్రాణనాథా! నేను ఎన్నో దుఃఖములు సహించితిని, కాని యిక నీయాతన సహింపజాలను."

అని చెప్పుచుండగనే ఆమెకంఠము గద్గదమయ్యెను. కన్నులనుండి ప్రేమామృతము కురియుచుండెను. అందువలన అక్కడ నుండజాలక నమస్కారము చేసి, యామె వ్రజరాణి యొద్దకేగి కూర్చుండెను. వ్రజరాణి యామెను కౌగిలించుకొని,

"ఏమి సంభాషణ జరిగెనే" అని యడిగెను.

"నీవు కోరునదే"

"నిజముచెప్పు ఆయన ఏమన్నాడు?"

"నేను చెప్పను."

ప్రజరాణి పోగొట్టుకొన్న ధనము మరల లభించినట్లు తలంచి,

"ఎన్నో దినములనుండి వాంఛించుచున్న నా యీప్సితము భగవంతుడు నేడు సంపూర్తి చేసినాడు. కావున మాయింటిలోనే వివాహము చేసెదను"

అని పలుకు మాధవి నిరాశతో మందహాసము చేసెను. ప్రజరాణి గద్గదస్వరమున,

"మమ్ము మఱచిపోవు కదా" అనెను.

వెంటనే ఆమె కన్నులనుండి అశ్రువులు రాలెను. కొంతసేపటికి, కంఠము సవరించుకొని,

"మమ్మింకనిను ఇక విడచి పోవుదువు కాబోలు" అనెను.

"మిమ్ము వదలి ఎక్కడకును పోవను"

"పోవే, వగలమారీ!"

"చూడరాదా, తొందరపడు టెందుకు?"

"నీ కెటువంటి నగలు కావలయునో చెప్పు"

"కొంగరెక్క వంటి తెల్లనివి."

"వధూవరులకు పట్టువో, జరీవో ఉండవలయును కదా"

"నాకవి వద్దు. తెల్లని బట్టలే కావలయును"

"నీకు చంద్రహారము బాగుండునా? నాది ఇచ్చెదనుతే."

"దానికి బదులు రుద్రాక్షమాల ఇమ్ము"

"పిచ్చిమాటలు మాటాడుచున్నా వెందుకు?"

"నాకు అవే అందముగా నుండును."

"నీమాట లేమియు నాకు తెలియుట లేదు. ఇంత చిన్నపోయియుంటి వెందుకు? నీవు ఈరత్నమునకయి ఎన్నో తపములు చేసి, ఎన్నో యోగములు సాధించి, ఎన్నో వ్రతములు సలిపియుండి కడకది లభింపగనే సంతోషము చూపవేల?"

"నీవు పెండ్లిమాటలు పలుకు చున్నందున నాకు ఏడుపు వచ్చు చున్నది."

"ఏడుపెందుకు? సంతోషముగా నుండు."

"అక్కయ్యా! విధాత నా కానంతోషము ముఖాన వ్రాసియుండ లేదు. మేఘ మండలములో గూడు కట్టవలెనని కోరుకొనుచుండు పక్షి చెట్లకొమ్మలందే నివసించు చుండునట్లు, నాజీవితవిశేషము ఇదే విధమున ప్రేమస్వప్నము కాంచుచు గడుపవలయు నని నిర్ణ యించు కొంటిని."

౨౪

రెండవనాఁడు బాలానందుఁడు స్నానసంధ్యానుష్ఠానములు ముగించుకొని రాజా ధర్మసింగుకయి వేచియుండెను. నేఁడు రాజ గడమునందొక విశాల గోశాలయొక్క ప్రారంభోత్సవము జరుగ నుండుటచే నగరములోని రచ్చలు, వీధులు, నవ్వుచున్నట్లుండెను. రోడ్డుకు రెండువైపుల పతాకము లెగురుచుండెను. వాకిండ్లన్నియు పుష్పమాలలు, తోరణములు ధరించి మాతృదేశమునకై సర్వస్వము త్యాగముచేసిన దేశభక్తుని శుభాగమనమును సందర్శించుటకై సిద్ధ ముగా నుండెను.

ఆనందదేవత సఖులతోకూడి విచ్చలవిడిగా విహారము చేయుచుం డెను. వాయువు మనోహరముగా వీచుచుండెను. ఎక్కడ చూచినను దిగులు విచారము కనుపడుటలేదు. అంతటను మంగళ తూర్యారావ ములు మ్రోగుచుండెను. పురుషులు ఉతికినబట్టలుకట్టుకొని విహ రించుచుండిరి. స్త్రీలు సమస్త శృంగారములు చేసుకొని కోకిలకంఠము

లతో మధురగీతములు పాడుచుండిరి. యువకులు నంకర తలగుడ్డలు చుట్టుకొని కోలాహలము చేయుచుండిరి. జాతి హితమునకయి తన సర్వస్వము ధారపోసిన ఒకానొక పురుషోత్తముని పాదములిచ్చట సోకుచుండుటచే ఎల్లరివదనము లందును కాంతు లుట్టిపడుచుండెను.

బాలానందుఁడు సహాయకులతో కలసి రాజగడము వైపు మరలగనే బాలభాస్కరుఁడు తన కోమలారుణకిరణ సహస్రములతో ఆతనిని పూర్వదిశనుండి స్వాగతమడిగెను. అనుపమాన తేజోవిరాజితమగు నతని ముఖమండలము కాంచినంతనే జనులందఱు ఏకకంఠముతో 'భారతమాతకుజయ్' అని వాయుమండలమును భేదించి యాకాశమును డీకొనునట్లు హర్షధ్వనిచేసిరి. శంఖముల, గంటల గణగణ ధ్వని చెలరేగెను. ప్రతివాని హృదయమునుండి వెలువడు నుత్సాహపూరిత వాక్యములచే దిక్కులు పిక్కటిల్లుచుండెను. దీపమును చూచిన మిడుతవలె బాలానందుఁడు కనుపడగనే జనులందఱొక్కపెట్టునవచ్చి ఆయనచుట్టుముూగిరి. "భాంత సభ" లోని నూటయేబదిమంది సభ్యులు అభివాదనముచేసిరి. వారి చక్కని దుస్తులు, ఉత్సాహభరితమానసములు, కదలుచున్న గుఱ్ఱములు, కన్నులపండువుగానుండెను. ఆసభలోని ప్రతిసభ్యుఁడును నిష్కళంక జాతీయాభిమాని. వారుచ్చరించు ఉత్సాహశబ్దములు జనుల చిత్తములలోని యావేశమును ద్విగుణీకృతము చేయుచుండెను. మార్గమున కిరువైపులను ప్రేక్షకులు ఇసుకచల్లినను రాలనట్లుండిరి. మేళములు మ్రోగుచుండెను. పుష్పఫలములు తెరపిలేక కురియుచుండెను. ఎక్కడచూచినను 'పురకాంతలు అలంకరించుకొని బంగారు పళ్ళెములందు కర్పూరము, పుష్పములు, కుంకుమము నుంచుకొని హారతి ఇచ్చుచుండిరి. క్రొత్తకోడండ్రవలె అంగడులన్నియు శృంగారింపబడియుండెను. నగరమంతయు తన యనుపమాన

శోభచే ఉద్యానవనములనుకూడ లక్ష్యపెట్టనట్లుండెను. శ్రావణ భయక నీలమేఘములు కాచుకొని యుండి యుండి హృదయములు దద్దరిల్లునట్లు ఫెళఫెళారావములు సలుపునట్లు ప్రజలందఱు ముక్త కంఠములతో 'భారతమాతకీజయ్!' అని యరచుచుండిరి. బాలానందుఁడు వేదిక నలంకరింపగనే యువకులు ఉదారంగు లేసుకోట్లు ధరించి, కేసరవర్ణముగల పాగాలుచుట్టి చేతులతో సొగసైన కఱ్ఱలు పట్టుకొని మార్గమునందు నిలువబడి యుండిరి. బాలానందుని వారు చూడగనే పదిమందిచొప్పున బారులుతీర్చి తమకఱ్ఱలు వాయించు కొనుచు విజయగీతము పాడదొడగిరి.

"బాలానందా, నీరాకను మాభాగ్యములెల్లను బండెన్
పాదార్పణమున పట్టణమండలి పాపములెల్లను మండెన్"

ఆహా! ఎట్టిహృదయాకర్షక దృశ్యము! గీతముసామాన్యమైనదైనను పలువురు కలిసి గానముచేయుహేతువున మహత్తరముగా తోఁచెను. జనులంద ఱామధురగీతమాలించి ముగ్ధులై నిలువబడిరి. ఎక్కడ చూచినను చప్పుడులేదు. అర్ధరాత్రమున కోకిలగానమువలె ఆప్రశాంత సమయమున ఎంతో కర్ణ రసాయనముగా నుండెను. దర్శకులందఱు కదలమెదలకుండిరి.

బాలానందుని దివ్యముఖమండలము ఆత్మానంద జ్యోతిచే ప్రకాశించుచుండెను. నేత్రములనుండి జాత్యభిమాన కిరణములు వెలువడుచుండెను. కలకలలాడు పైరునుచూచి హర్షముచే పొంగిపడు కృషీకుని వలె బాలానందుఁడు ఉత్సాహిదై గీతము ముగియగనే కొన్నియడుగులు ముందునకువేసి, యిరువురు బాలకులను ఎత్తి భుజముమీఁది కెక్కించుకొని, 'భారతమాతకీ జయ్' అని యఱచెను.

ఈవిధముగా మెల్లమెల్లన జనులందఱు రాజగడమునందు ఏకమయిరి. అక్కడ మహోన్నతమైన గోశాల ఆయన స్వాగతమునకై

నిలిచియుండెను. వాకిట మఖమల్ పరచియుండెను. వాకిండ్లు అరటి స్తంభములతోను, పుష్ప పత్రములతోను శోభిల్లుచుండెను. గోశాలలో వేయిగోవులు కట్టివేయబడి యుండెను. బాలానందుఁడు తనచేతి మీఁదుగా తొట్లలో తెలికపిండివేసి, తవుడుకలిపి, ఆవులను ప్రేమతో చరచెను. ఒకానొక భవనమున చలువరాతితో కట్టిన అష్టభుజ కుండములో పాలునిండుగా ఉండెను. బాలానందుఁడు గరిటెను పాలుతీసి కన్నులకద్దుకొని స్వీకరించెను. తరువాత జనులందఱుకూడ కొంచెము కొంచెము పాలు స్వీకరించిరి.

జనులందఱు నెమ్మదిగా కూర్చుండనైనలేదు. ఇంతలోనే యొకరు పరుగెత్తుకొని వచ్చి "బాదల్‌శాస్త్రి, ఉత్తమ చంద్రశ్రేష్ఠి, లాలా మక్ఖన్‌లాలు వెలుపల నిలువబడి స్వాములవారి దర్శనముచేసి కొంచెము మాట్లాడగోరుచున్నారు" అని చెప్పెను. శాస్త్రి కాశీపండితులలో చాల ప్రసిద్ధిచెందిన వాఁడు. ఆయన పట్టువస్త్రములు దిద్ది, పచ్చని బనాతుఅంగరకా తొడుగుకొని, కాశ్మీరశాలువ కప్పుకొని యుండెను. ఉత్తమచంద్రశ్రేష్ఠి, మక్ఖన్‌లాలు ఇరువురు నగరములో చాల ధనాఢ్యులు. వీరిపేరు పట్టణమందందఱికి తెలియును. శాస్త్రి వాదనకు కూర్చున్న, ప్రతివాది ఎంతవాఁడైనను నిమిషములో బట్ట దులుపుకొని లేచి పోవలసినదే. నగరములోని పండాలు, పౌరోహితులు, పూజారులు మున్నగు పూర్వాచారపరాయణులందఱు ఈయనకై రక్తపాతము చేయుటకును వెనుదీయరు. శాస్త్రి సనాతన హిందూధర్మ సంరక్షకుఁడని ప్రసిద్ధి. శ్రేష్ఠి లాలాలును మతమందు చాల పట్టుదల కలవారే. వీరందఱు ఎంతో కాలమునుండి బాలానందునితో వాగ్వాదము చేయుటకు వేచియుండ, నేఁటికి సమయము చిక్కెను. అందువలన వీరు తమ బలగముతో నిచ్చటకు వచ్చిపడిరి.

బాలానందుఁ డీమహాత్ముల యాగమనము విని బయటకువచ్చెను.

కాని యచ్చటి స్థితి చాలవిచిత్రముగా నుండెను. ఉభయపక్షముల వారును బట్టలు దోపుకొని, చొక్కాలు మోచేతులవఱకు సర్దుకొని కఱ్ఱలు పట్టుకొని కలహమునకు సిద్ధపడియుండిరి. శాస్త్రి పౌరోహితులను, పండాలను రెచ్చగొట్టుచుండెను. శ్రేష్ఠి బిగ్గఱగా "ఈశూద్రుల జందెములు త్రెంపుడు. చార్జిపెట్టిన తరువాత చూచెదను. మీకే మియు భయములేదు" అని పలుకుచుండెను.

"రండు. మీలో మొనగాండ్రెవరో నడుములు విరుగదన్నెదను" అని లాలా యనుచుండెను. బాలానందుఁడు రంగమంతయు చూచి, ధర్మసింగుతో "మీరువెళ్లి 'ఇది మీకు మంచిదిగాదని శాస్త్రికి చెప్పుడు.' లేకున్న రెండుపక్షములకు చాల హానికలుగును." అని చెప్పెను. అప్పుడు సింగుకన్నులవెంట నిప్పులు రాలుచుండ "ఈ దుష్టులతో మాట్లాడుటకు నాకు చాల అవమానము. పండాలను పౌరోహితులను చూచుకొనియే వారికి పొగరెక్కినది. నేడు నేనా పొగరంతయు అణచివేసెదను. మిమ్మెట్టులైన భంగపఱచవలయు ననియే వారియభిప్రాయము. కాని నా మైమఱుగురు పుత్రులతోసహా నేను బ్రతికియున్నంతవఱకు అట్టి ఘోరకార్యము జరుగనీయను. మీ రొకింత కనుసైగచేసిన చాలును. చిటికలో వీరి యెముకలు నుగ్గుచేసి వేసెదను" అనెను.

"ఈ వీరున కావేశమెక్కినది. రాజపుత్రులకు పౌరుషమెక్కినపుడు ఇతరులను చంపి తాము చత్తురేకాని మఱేమియు వినరు" అని తలచి, బాలానందుఁడు "రాజా! దూరదృష్టికల మీరును నేడిట్లు పలుకు చుంటిరేల! ఇట్టి కఠోరవాక్యములు పలుకుటకిదియేనా సమయము ఆగుడు. ముందుకు పోయి మనవారినికూడ ఆపుడు. లేకున్న చాల అనర్థము వాటిల్లును" అనెను.

ఇట్లు పలుకుచుండి బాలానందుఁడు చప్పున ఆగెను. సముద్రితరం

గములవలె ప్రజలు ఎక్కడెక్కడివారు రోషముతో వచ్చుచుండిరి. ప్రతివాని చేతిలోను కఱ్ఱలాడుచుండెను. కన్నులు నిప్పులు కురియు చుండెను. ముఖములు జేవురించి బొమముడితో నుండెను. చూచు చుండగనే యా గుంపు పూర్వాచారులనుసమీపించి, "నిలువునకుడు, ఎముకలు విరుగపొడువుడు." అని కేకలు వేయుచుండ, బాలానందుఁడు మెఱపువలె మెఱసి చంగున గుఱ్ఱముపై నెక్కి యుచ్చైస్స్వరమున నుపన్యసించెను.

"సోదరులారా! ఈగందరగోళమేమి? నామీదమీకు నిజమైన ఆదరమున్నచో ఎత్తినకఱ్ఱలుదించి, ఒకయడుగైన ముందుకుపోవలదు. మీకింకను వీరావేశమున్నందుకు నాకు సంతోషమే. క్రోధముకూడ పవిత్రోత్సాహభరితమగు నుద్వేగమే, కాని ఆత్మార్పణమనము పవిత్ర తరమైనది. ఇట్టి యనవుగాని వేళయందు మీక్రోధానలమును ప్రయోగింపక చల్లార్చుకొనుడు. మీరు జాత్యభివృద్ధికి ఇదేవిధమున ప్రాణార్పణము చేయుటకు సంసిద్ధులై యుంటిరా? తెలిసియు, ఇట్టి అకార్యమేల చేసెదరు. మీరు కొట్టబోవువారు అన్యులుకారు. మీతల్లిపాలనే త్రాగి మీరక్తస్పర్శకలవారే. అట్టివారిని శత్రువులుగా భావింప జెల్లునా? వారుమూర్ఖులైన మీ రామూర్ఖత్వమును తొలగించుట పాడి. వారు తిట్టిరని మీరు అభిమానము చెందవద్దు. యుద్ధమునకై వారు సిద్ధపడిన మీరు వినయవిధేయులై ప్రబలరోగముచే ఒడలు తెలియక దుర్భాషలాడుచున్నరోగిని నేర్పరియగువైద్యుడు చేదు మందులచే శాంతింపజేయు విధమును మీరుగమనింపుడు. నామాట కాదని ప్రవర్తించినవారు జాతిద్రోహులగుదురని నమ్ముడు."

ఈ వాక్యములువిని ఎక్కడివారక్కడ చిత్రప్రతిమలుగా నిలువఁ బడిరి. మదించి అడ్డదిడ్డముగా సంచరించు గుఱ్ఱములను నేర్పరియైన సారథి కళ్ళెముతో లొంగకొట్టునట్లు, సమస్తమానవ హృద

యములందు పొంగిపొరలెడి క్రోధాగ్నిని ఒక్కఁడు చల్లబఱచిన మాటలయందు ఎట్టి మహచ్ఛక్తి యున్నదో వేఱుగ చెప్పవలయునా? ఈశక్తి ఆయన కెవ్వరొసంగిరి? ఆతని శిరమున కిరీటములేదు. చేతులందు అద్భుతప్రభావోత్పాదకములగు అస్త్రశస్త్రములులేవు. ఇది కేవలమాతఁడు స్వార్థరహితబుద్ధిచే చేయు జాతిసేవాప్రభావమే. తన జాతియందు నిష్కళంక భక్తికలవాఁడు. సర్వస్వమును బలియిచ్చివేయును.

పండాలు, పౌరోహితులు మున్నగువారు బాలానందుని స్ఫురద్రూపముచూచి, యతని యుచ్చైస్స్వరము వినుటతోడనే, వారి క్రోధమంతయు శాంతించెను. సూర్యోదయమున మంచు విరిసిపోయినట్లు, బాలానందుని యాగమనమున విరోధిదళమంతయు ఛిన్నాభిన్నమాయెను. ఉపద్రవము కల్పింపవచ్చినవారందఱు శ్రద్ధాభక్తులతో బాలానందుని కాళ్లమీఁదపడి అతని యనుచరులలో చేరిరి. శాస్త్రి పండాలనెంతో ప్రోత్సాహ పఱచెనుకాని, నిరుపయోగమాయెను.

ఆసమయమున బాలానందుఁడు తన వాఙ్మాధుర్యముచే నిముషమాత్రములో పండాలు, గొల్లలు, ఉప్పరులు మొదలగు వారందఱు పరస్పరము కౌఁగిలించుకొనునట్లుచేసెను. చివరకీవిధమున ముగించెను.

"మీరందఱు దృఢముగా పనులు చేయుచున్న తప్పక ఒకానొక దినమున అభీష్టము సిద్ధించును. మీరెన్నడు ధైర్యమును విడనాడవలదు. దార్ఢ్యము వీరత్వమునకు ప్రధానాంగము. దీని నెన్నడు విడవరాదు. మీకనేక పరీక్షలు కలుగును. ఎన్నో నిరాశల నెదుర్కొనవలసివచ్చును. అట్టి విషమావస్థలయందు ప్రతిమతప్ప మఱేయితోవచూపు నమ్మకమైన వస్తువు కనుపడదు. దృఢత్వమువలన సాఫల్యము కలుగనిచో ఆశబ్దము నిష్ప్రయోజనము."

బాలానందుఁడు ఇంటికిపోయి వార్తాపత్రిక తెఱచి చూడగనే మొగము పాలిపోయెను. నిట్టూర్పు వెడలెను. అప్పుడు ధర్మసింగు ఉలికిపడి "కుశలమేనా" అని యడిగెను.

"బృందావనములో నదులకట్టలు తెగినందున, ఎందఱో జనులకు ఇండ్లు వాకిళ్లు లేవు"

"ఓహో అట్లనా?"

"అనేకులు వరదలలో కొట్టుకొని పోయిరి. పట్టణమంతయు నష్ట మయ్యెను. వీథులలో పడవలు నడచుచున్నవి. భారతసభాసభ్యులు చేరి శక్తికొలది సహాయము చేయుచున్నారు, కాని వారిసంఖ్య చాల కొద్ది."

"(కన్నీరు విడిచి) ఈశ్వరా! ఆ యనాథులకు నీవే నాథుడవు" అనెను.

"గోవులు, గోశాలలు కొట్టుకొని పోయెను. దాదాపు వేయి యాత్రులు నష్టమయినవి. మూఁడు ఘంటలవఱకు ముసలధారావర్షము కురిసెను. దాని పరిమాణము పదియాఱు దుక్కులు. పట్టణమున కుత్తరభాగమంతయు శూన్యమైనది. ఉండ కొంప, పండ మంచము, తిన తిండి లేక జనులు అల్లాడుచున్నారు. శవములు గుట్టలు గుట్టలుగా పడి యున్నవి. చాలమంది ఆకలిబాధ కోర్వలేక చచ్చుచున్నారు. జనుల విలాపమువలన గుండెలు పగిలిపోవు చున్నవి. పీడితులందఱు నారాక కెదురు చూచు చున్నారు. నేను వెళ్లిన బాధలు శాంతించు నని వారి నమ్మకమేమో"

అని కొంచెముసేపు ఆలోచనామగ్నుఁడై యుండి పిమ్మట "నేను పోవక తప్పదు. కావున ఇప్పుడే పోయెదను. తమరు బృందావనము లోని భారతసభవారు నాకు సంపూర్ణ సాహాయ్యము చేయువలయు నని తంతినిండు" అని పలికెను.

ధర్మసింగు వినయముతో,

"ఆజ్ఞయైన నేనును వచ్చెదను" అనెను.

"మీరు రావలసిన అవసరము లేదని తలచెదను. అంతగా అవసరమున్నచో వెంటనే తంతి ఇచ్చెదను. అప్పుడు రావచ్చును"

"అటులయిన మీరు రేపుదయము వెళ్లిన బాగుండును."

"కాదు. ఒకక్షణమైన నిచట నిలువజాలను. అక్కడికి చేరుటకే నాకు చాలదినములు పట్టును"

"బృందావనమున వరదలు వచ్చినవి. అచ్చటి ఆర్తరక్షణకై బాలానందుడు పోవుచున్నాడు" అను కబురు ఘడియలో పట్టణమంతటను ప్రాకి పోయెను. వెంటనే వేలకొలంది జనులు బాలానందుని సాగనంపుటకు కూడిరి. తొమ్మిదిగంటలు కాకముందే కొన్నివేలమంది వాకిట క్రిక్కిరిసి యుండిరి. ప్రతివాడును బృందావన దుస్థితిని విని సానుభూతి చూపువాడే. అనేకులు అచ్చటివారి సేవ చేయుటకు బాలానందునితో వెళ్లుటకై కటి బద్ధులై నిలిచిరి. వారికొక నిధిని గూడ ఏర్పఱచిరి.

ధర్మసింగు అంతఃపురమున పట్టణములోని స్త్రీలందఱు సుహాసకు ధన్యవాదము లర్పించుటకు సభచేసిరి. ఆ మహోన్నత ప్రాసాదమంతయు జనారణ్యముగా నుండెను. మొదట ప్రజరాణి కొందఱు స్త్రీలు కలసి మంగళహారతి నిచ్చిరి. తరువాత చాలమంది ఆడువాండ్రు కోలాటము వేయుచు హారతులు వెంటనుండ సుహాస గృహమునకు వచ్చిరి. సేవతి, చంద్ర, మున్నగువారు అతిథిసత్కారమునకు మొదటనే నియుక్తులైరి. సుహాస అందఱిని కౌగలించుకొని 'మాతృసేవాపరాయణులగు బిడ్డలను కనుడు' అని యాశీర్వదించెను. తరువాత ధర్మసింగు భార్యయగు మహారాణి హారతియివ్వగా అందఱును ఆమెతో కలిసి పాటపాడిరి. నేడు మాధవి ముఖమండలము పుష్పము

వలె వికసించియుండెను. నిన్నటివలె కొంచెమయినను చిన్నబోయి యుండలేదు. నేడామెచిత్తము సమస్త ఆశల కతీతమైయుండెను. కావుననే ముఖము కలకలలాడుచుండెను. కన్నులువికసించియుండెను. నిరాశలోపడియుండి ఎంతో దుఃఖమున యింతవఱకు తన జీవితమును గడపెను. కాని యిప్పు డాశకలిగియుండుటచే క్షణమైన దుఃఖము సహించుట అసాధ్యముగానుండెను.

మనోహారములగు మంగళగీతములతో భవనమంతయు ప్రతిధ్వనించుచుండ ఆకస్మికముగా బృందావన సమాచారము తెలుపుటకు ధర్మసింగువచ్చి "మీరందఱు స్వాములవారిని సాగనంపుటకు సిద్ధముగానుండుడు. వారిప్పుడే బృందావనమునకు వెళ్లుదురు" అని పలికెను.

వెంటనే సభయంతయు అర్ధరాత్రమువలె ప్రశాంతముగానుండెను. సుహాస అదరిపడిలేచి బాలానందుని ఆపుటకోయన వాకిలివైపురికెను. ఆమెవెనుక నిలిచియున్న స్త్రీ జనులందఱు వెంటనే వెళ్లిరి. అప్పుడు ప్రజరాణి—

"పిచ్చి నీవిప్పుడే ఆయనను వీడ్కొల్పెదవాఏమి. అదిగో ఆగదిలో నున్నాడుచూడు" అనెను.

"నేను అసలే వానిని పోనివ్వనప్పుడు వీడ్కొల్పు లేమిటి?"

"ఆయన తప్పక బృందావనము పోవలయునట"

"బృందావనమెందుకు పోవలయును? అదెక్కడవుండిన ఎవరికేమి? నేను ఎక్కువా? అదిఎక్కువా? నాపుత్రునిమీద నాకు అధికారము లేదా?"

"నీవిప్పుడు మాట్లాడిన నన్ను చంపుకొనినట్లే. ఎందఱో ఈయన సాయమున బ్రతుకుచుండ పోవకున్నచో అక్కడివారి కెట్లుండునో తెలియునా?"

మాతృప్రేమయెదుట సంఘసేవ యెందుకు పనికిరాదు కాని, ప్రజ

రాణి ఏంతో శ్రమపడి సుహాసను ఆపెను. సుహాస ఆపరిస్థితినిచూచి యాశ్చర్యపడుచు "అయ్యో! నేనెంత పిచ్చిదాననై బయటపడితిని" అని చాలనొచ్చుకొనెను. అప్పుడు మహారాణి—

"వ్రజరాణీ! బాలానందునికి జయమాల ఎవ్వరు వేయుదురు?" అని అడిగెను.

"నీవే"

"నీవేమిచేయుదువు?"

"నేను ఆయనకు బొట్టుపెట్టుదును."

"మాధవి ఎక్కడ?"

(మెల్లగా) "దానిని కదలింపకు. అది ఏదో ఆలోచనలోనున్నది" అనెను.

ఇంతలో బాలానందుఁడు బయటకువచ్చెను. స్త్రీలు ఆతని వెంటనే యుండిరి. తల్లి కనుపడగనే ఆయనపోయి యామె కాళ్లమీఁదపడెను. సుహాస కొడుకును లేవనెత్తి కౌఁగిలించుకొని యేమో అనబోయెను కాని అనురాగాతిశయమున ఆమె నోటినుండి మాట రాలేదు. మహారాణి పూలదండ తీసికొని, ఆతని మెడలో వేయబోయెను. కాని కాళ్లు గడగడవణకి ముందు కడుగుపెట్టలేక పోయెను. వ్రజరాణి కుంకుమభరణి తీసికొని బొట్టుపెట్టుటకు వెళ్ళెను, కాని యామెకన్నులు శ్రావణ నీలమేఘములవలె వర్షింపదొడగెను. మాధవిబయలుదేఱెను. ఆమెనేత్రములందు ప్రేమ తాండవించుచుండెను. ముఖమున శాంతము వెల్లివిరియుచుండెను. పెదవులందు మందహాసము గంతులువేయు చుండెను. హృదయము ఆనందసాగరమున మునకలు వేయుచుండెను. అట్టి పరిస్థితియందుండి ఆమె యపార ప్రేమామృతవృష్టి ఆతనిమీఁద బఱపి, పూలదండ మెడలోవేసెను. మొగమున కుంకుమ బొట్టుపెట్టెను. ఇదివఱకు వివాహ సంబంధములు వేడుకలు జరగలేదు.

అవి ఇప్పుడు జరిగెను. బాలానందుఁడు నిట్టూర్పువిడిచి "నేను అంతు లేని ప్రేమ సాగరములో కొట్టుకొని పోవుచున్నాను" అనుకొనెను. ధైర్యము లంగరవేసెను. తటాలున జారి నీటిలోపడు మనుష్యునివలె ఒడిసి మాధవిచేయి పట్టుకొనెను. ఆయన చేయి తగులగనే మాధవి యొడలు ఝల్లుమనెను. శరీరమున చెమటబొట్లు మెఱయసాగెను. గాలియూపులచే పూవుల రేకుల నంటియున్న మంచుబిందువులు రాలి భూమిపై పడునట్లు మాధవికన్నులనుండి కన్నీరు బాలానందుని చేతిమీఁద రాలెను. మాధవినేత్రములు బాలానందునకు అర్పించినవి ప్రేమమౌక్తికములుకాని అశ్రువులుకావు. ఇంకెన్నఁడు ఈనేత్ర ములు కన్నీరు విడువవు. పైనచుక్కలు తళతళ మెఱయు చుండెను. వానిచాటునుండి దేవతలు ఈదృశ్యమును చూచు చుండిరి. నేటి యుదయముననే బాలానందుని స్వాగతములో అందఱు,

"బాలానందా నీరాకను మాభాగ్యము లెల్లనుబండెన్"

అనిపాడిరి. ఇప్పుడో స్త్రీలంద ఱేకకంఠమున

"బాలానందా నీపోకను మాభాగ్యములెల్లను బండెన్"

అని పాడిరి. రాకఅదృష్టము పోకఅదృష్టము వచ్చినపుడు అందఱ కన్నులనుండిబాష్పములు రాలుచుండెను.పోవునపుడు అట్లులేయుండెను. నిన్ననవి క్రొత్తగా వచ్చిన అతిథి స్వాగతమునకు వచ్చెను. నేడు వీడ్కోలుపుటకువచ్చెను. లక్షణములన్నియు వెనుకటివే. కానిభేదము చాలకలదు.

మొకటి నుండియు మాధవి వాడినమొగ్గ. ఆ మొగ్గను నిరాశ ఎంతో బాధించెను. ఇరువదిసంవత్సరములనుండి అవస్థపడిన తపస్విని నేడు యోగినియయ్యెను. పాపమామె కీజన్మమం దేయాశయులేదు. ఉన్నదానిని దైవము నలిపివేసెను. ఆమె ప్రేమ అపారసముద్రము వంటిది. అందు సర్వము నష్టమగునట్లు వరదలు వచ్చెను. కడకామె యోగినివలె వస్త్రములు ధరించి సంసారబంధములనుండి విముక్తి చెందెను.

ఆయిన్మత్త యోగిని ఏస్థానమందును శాంతిగానక పుష్పసార భమువలె దేశ దేశములు తిరుగుచు ప్రేమగానము వినుపించుచుండెను. ఆమె బంగారు మేనిఛాయకు కాషాయాంబరములు ఎంతో శోభగా నుండెను. ఆప్రేమస్వరూపిణిని చూచి సకలజనులు బాష్పములు రాల్చుచుండిరి. ఆమె వీణవాయించి పాట పాడదొడగినపుడు శ్రోతల యుల్లములు పల్లవించును.

యోగినికి బాలానందుని పేరన్న చాలప్రేమ యున్నందున, తాను పాడుగీతములం దాతనికీర్తి నింపుచుండెను. ఏనాడు ప్రేమకై లజ్జను పరిత్యజించి యోగినీవేషము ధరించెనో, ఆనాడే సరస్వతీదేవి యామె నాలుకపై స్థావరమేర్పఱచుకొనెను. ఆమెయొక్క రసభరితము లగు గీతములువినుటకు ఎంతోదూరమునుండి జనులు వచ్చుచుండిరి. బాలగోపాలుని మురళీ నినాదమువిని గోపికలెల్ల ఇండ్లువాకిండ్లు విడ నాడి పరుగెత్తివచ్చినట్లు, సమస్తజనులువచ్చి యోగిని రాగాలాపన విని ఆనందాంబుధిలో నోలలాడుచుందురు.

ఆయోగిని నవ్వుచుండగా గాని, ఏడ్చుచుండగా గాని చూచిన వారులేరు. ఏకోర్కెలేక స్వచ్ఛముగా నున్న హృదయమున సుఖ దుఃఖములేల కలుగును? ఆమె ముఖమండలము నిరంతరము శాంతి స్వరూపమై యుండును. ఆమెనుచూచినవారి నేత్రములు పవిత్రానంద భరితములై ప్రకాశించుచుండును..

T. Narayan Reddy
24/2/59.

సమాప్తము.

ప్రకాశకులు :— అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయఁడుగారు

# సరస్వతీగ్రంథమండలి
# రాజమహేంద్రవరము

నవలలు - నవరసభరితములగు - నవలలు

ముచ్చటైన బొమ్మలతో ముద్దులొలుకు క్యాలికోబైండుతో
రెండుమాసముల కొక్కటిగా వెలువడుచుండును.

## నిబంధనలు

1. ఇందుఁ జందాదారులుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా రు 0-4-0 లు చెల్లింపవలయును.

2. ఇందు రెండు మాసముల కొక్కటిగ వెలువడుచుండు క్యాలికోబైండుగల ప్రతిగ్రంథమును 1-0-0 వెలకుఁ జందాదారులకుఁ బంపుచుందుము.

3. గ్రంథములఁ బంపుట కగు పోస్టేజీ మొదలగు కర్చు లన్నియును జందాదారులే భరింపవలయును.

4. చందాదారు లగువారు వెనుకటి గ్రంథముల నన్నిటిని గొనవలయు నను నియమములేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములు కూడఁ జందాదారుల వెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

5. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

6. ముందు ప్రకటింపఁబడు ఆయీపుస్తకములకు రు 7-2-0 లు ముందుగఁ బంపువారికి ఆయీపుస్తకములను అన్‌రిజష్టర్డు పార్శిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆయీపుస్తకములకు చెల్లింపవలసిన మనియార్డరు కమీషను 0-12-0 లును రిజిష్టర్డు ఖర్చు 0-12-0 లును 1-8-0 కూడివచ్చును.

ఇందీవరకు ప్రకటింపఁబడిన గ్రంథములు :—చిత్రపటశోభితములు.

## ప్రేమసుందరి

కర్త:
చిరావూరి కామేశ్వరరావు
బి. ఏ., ఎల్. టి.,

నవరసభరితమగు సాంఘికనవల. క్యాలికో బైండు 272 పుటలు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## చోరశిఖామణి

అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

లోకమహర్షకమగు డిటెక్టివునవల. క్యాలికో బైండు 197 పుటలు. వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## లక్ష్మీప్రసాదము

కర్త:
కేతవరపు వేంకటశాస్త్రి

నవరసభరితమగు సాంఘికనవల. ఇందు మూఢురాండ్రగు స్త్రీలవలన కుటుంబములందు సంభవించు కలహములును అందువలన కలుగు కష్టపరంపరలు చక్కఁగా వర్ణింపఁబడినవి. 346 పుటలు వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## హత్యారహస్యము

అనువాదకులు :
సాహితీసమితి సభ్యుడు

జటిలమగు ఇతివృత్తముగల డిటెక్టివునవల. తుదివరకు దోషులెవరో కనుగొనుటకు వీలు లేకుండు నటుల మండగులు పన్నిన పన్నాగము లత్యంత భయంకరములు. వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఫాస్టు (ప్రథమభాగము)

అనువాదకులు :
వెమురుమూడి శేషగిరిరావు

అధికార దుర్వినియోగము-అభేద్యములైన కోటలయందు దురాచారుల దురంతములు - మహాప్రళయము-రహస్యమువలన గలిగిన తీవ్రమనోవేదనము, మున్నగు చిత్రవిచిత్రకల్పన, పాఠకమహాశయుల జిత్తరువుల గావించుచుండును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఫాస్టు (ద్వితీయభాగము)

అనువాదకులు :
వెదురుమూడి శేషగిరిరావు

ఈశ్వర కృపాతిశయము, భక్తసంరక్షణము, భాగవతవిజయము, విమలప్రేమాభిరాములగు సాధు యువతీ యువజనుల కల్యాణము మున్నగు నత్యద్భుత ఘట్టములు. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## కుముద్వతి

రచయిత :
శ్రీమతి పులవర్తి కమలావతీదేవి

ఇందలి దుష్టకేతుని దౌష్ట్యము భయావహము. మాయామారీచుని మాయలు భయంకరకృత్యములు. చదివి యానందింపుడు. ఇయ్యది నవలకాదు. నవ రసరత్నాకరము. వీరశృంగార కరుణారసంబుల యేకీభావముచే త్రివేణీసంగమమునుబోలి చదువరుల హృదయముల రసరంజితములుగ జేయును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## చిన్నకోడలు

అనువాదకులు :
క్రొపవరపు నరసింహము

శ్రీయుత కాశీనాథ రఘునాథమిత్రగారిచే మహా రాష్ట్రభాషయందు వ్రాయబడిన థాకట్యాసూన్ భాయి నుండి తెలిగింపబడినది. కథాచమత్కృతి నవీనము. చిన్నకోడలు "లక్ష్మి" యొక్క శాంత్యౌదార్యాది సుగుణములును, పతిభక్తియు మిక్కిలి పేదస్థితియందున్న సంసారమును తన చాతుర్యముచే లక్ష్మిసంపన్నముగాఁజేయుట మొదలగు సంగతులు చదువవలసినవి. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## రహస్యభేదనము

కర్త :
కేతవరపు వెంకటశాస్త్రి

రహస్యాపరాధ పరిశోధక నవల. కథాకల్పన మత్యద్భుతము. సంఘటనము లతిభయంకరములు. నిగూఢహత్యలెన్నియో వర్ణింపఁబడినవి. ఇది స్వతంత్రగ్రంథము. ఇతివృత్తమాంధ్రదేశమునకు సంబంధించినది. ఇట్టి గ్రంథ మిదివఱ కాంధ్రదేశములో వెలువడలేదు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0.

## సింహగడము

అనువాదకులు :
శ్రీ వాసుదేవరావు

మహారాష్ట్ర భాషలో శ్రీహరినారాయణ ఆపటె గారు విరచించిన గ్రంథమున కనువాదము. రమణీయమగు యీకథ గాంభీర్యమై యుండును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మణిహారము
కర్త:
బులుసు వేంకటసుబ్బారావు
బి. ఎ., బి. ఎల్.,

ప్రభాకరునిపగిది ప్రకాశించు ప్రభాకరుడు, హృదయరంజనియగు రంజని, చంద్రునిబోలు విజయచంద్రుడు, వికసితహృదయపద్మినియగు పద్మిని, సార్వభౌమలక్షణలక్షితుం డగు అలకసుందరుడును చదువరి హృదయమును వివిధరసభావతరంగముల దేలించును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మొగలాయీ దర్బారు
(ప్రథమభాగము)
అనువాదకులు :
మొసలికంటి
సంజీవరావు పంతులు

కీ. శే. ధీరేంద్రనాధపాల్ గారి సుప్రసిద్ధ గ్రంధరాజమున కనువాదము. ఇయ్యది నవరసభరితమై, చరిత్రాత్మకమై, చిత్రవిచిత్రోపకథలతో విరాజిల్లుచు పాఠకమహాశయుల కెంతయు నానందదాయకముగ నుండును. అద్భుతసంఘటనములతో నిండి సులభశైలిని వ్రాయబడిన యీగ్రంథమెల్లరు చదునతగియున్నది. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మొగలాయీ దర్బారు
(ద్వితీయభాగము)
అనువాదకులు : మొసలికంటి
సంజీవరావు పంతులు

ప్రథమసంపుటమందలి నిగూఢములైన దారుణశవప్రదర్శనములు, పిశాచకృత్యములు ఇందు భేదింపబడి చదువరుల నానందనిమగ్నుల నొనర్చును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఘటనాచక్రము
అనువాదకులు :
గారపాటి ఆంజనేయ చాదరి

పాంచకడీదేన విరచితమగు భీషణపరిశోధ కనువాదము. ఆశ్చర్యములకు బుట్టినిల్లు, కౌతుకమునకు భాండారము, విచిత్రములకు గనియై, పాఠకులను విస్మయసాగరమున ముంచివేయును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## రాజసుందరి
కర్త :
కేతవరపు వేంకటశాస్త్రి

ఆంధ్రదేశాత్మకమగు స్వతంత్రకల్పన సాంఘికనవల. కథావిధాన మత్యద్భుతము. నిరుపమానము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## కుంకుమభరణి
అనువాదకులు :
శ్రీ శివశంకరశాస్త్రి

ఇది సాంఘికనవల. మామూలునవలలవలె గాక యిందు క్రొత్తచమత్కారములున్నవి. చదువుటకు మిక్కిలి మనోహరము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## జాగిలము

రచయిత :
శ్రీమతి
సీరము సుభద్రయాంబ

అతిభయంకర నిరూపక నవలారాజము. హంతకుడు భయంకరమగు జాగిలము సహాయమున చేయు హత్యలు హృదయవిదారకములు. అపరాధపరిశోధకులు యీవిషమసమస్యను ఛేదించుటతి విచిత్రము. హత్యలపై హత్యలు. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు 1_8_0

## సరస్వతి

అనువాదకులు :
శ్రీవాసుదేవరావు
శ్రీకృష్ణరఘునాథరావు

మహారాష్ట్రభాషనుండి యాంధ్రీకరింపఁబడిన సాంఘికనవల. మనోహరకథావిధానము. శైలి నాతికఠినము. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## ఆనందాభాయి

కర్త :
కేతవరపు వేంకటశాస్త్రి

ఇయ్యది యూహాజనితమే యైనను చరిత్రసమ్మిళితము. పండితకవులచే మనోహరముగా వ్రాయబడినది. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు 1_8_0.

## హత్యాన్వేషణము

అనువాదకులు :
గుర్రాల నారాయణరావు

అద్భుతమగు పరిశోధకనవలారాజము. ఆంగ్లేయ గ్రంథమునుండి మనోహరముగా భాషాంతరీకరింపఁబడినది. తుదివరకు చదివినగాని అపరాధిని తెలుసుకొనలేరు. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## మొగలాయీ దర్బారు

(తృతీయభాగము)
అనువాదకులు : మొసలికంటి సంజీవరావు పంతులు

మొదటి రెండు సంపుటములవలె నిదియును చరిత్రాత్మకమై, నవరసభరితమై, చిత్రవిచిత్రోపకథల కాలవాలమై, మనోహరమై, యానందదాయకమై, పాఠకుల కెంతయు విజ్ఞానప్రదమైయొప్పును. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## గంగ

కర్త :
చిర్రావూరి కామేశ్వరరావు
బి. ఎ. ఎల్. టి.,

గంగాచరిత్రము కరుణరసప్రపూర్ణము, ప్రేమభావాత్మకము, శైలి కోమలమై, సుధామధురమై, తేటనీటివెల్లువవలె, ముద్దులొలుకుచుండును. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## మొగలాయీ దర్బారు

(చతుర్థభాగము)
అనువాదకులు: మొసలికంటి సంజీవరావు పంతులు

కథోపకథావల్లరులతో నల్లిబిల్లిగ నల్లుకొనియున్న యీ నవలారాజము సర్వజనహృదయాకర్షణీయము. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## కోహినూరు

కర్త :
చిల్లరిగె శ్రీనివాసరావు

ఈ కోహినూరు అమూల్యమైన వజ్రముగాదు. అతిమనోహరమైన చారిత్రిక నవల. శైలి మృదుమధురము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఆర్సీన్ ల్యుపిన్

అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి ఎం. ఏ.,

అత్యద్భుతమయిన డిటెక్టివునవల. ఇందలి మర్మములు, మానవహంతకి మాయలు అనిర్వాచ్యములయి పాఠకులను విస్మయవిపరీత చేతస్కులను గావించును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## అపరిచిత

కర్త :
మాలే రాఘవరావు

మనోహరమైన సహజ సాంసారిక, సాంఘిక సంఘటనలతో వెల్లివిరియు అపూర్వపరిశోధక నవలారాజము. ఇందలి ఇతివృత్తము సర్వజనహృదయానందప్రదము. క్రొత్తపోకడలతో గూడిన దీని శైలి మృదుమధురము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## అంతఃపురము

(ప్రథమ భాగము)
అనువాదకులు :
మొసలికంటి సంజీవరావు పంతులు

సుప్రసిద్ధ రైనాల్డ్సు గ్రంథరాజమునకనువాదము. తురుష్క చరిత్రాధారమగు నియ్యది సర్వజనహృదయాకర్షణీయమైనది. నవరసభరితము — అందును శృంగారరసప్రధానము—అద్భుతసంఘటననిధానము. ఎల్లరు చదువదగినది. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## అంతఃపురము

(ద్వితీయభాగము)
అనువాదకులు :
మొసలికంటి సంజీవరావు పంతులు

అత్యద్భుతఘటనాసంయుతమును, విచిత్రకథావిలసితమును నగు గ్రంథరాజము. ప్రథమభాగమునందభివర్ణింపబడిన నిగూఢహత్యారహస్యములిందు వెల్లడింపబడినవి. శైలిమృదుమధురము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## అగ్రహారము

కర్త :
కేతవరపు వేంకటశాస్త్రి

మనోహరమైన స్వతంత్రసాంఘికనవల. అగ్రహారజీవితమిందు దర్పణమందువలె గానవగును. వరశుల్కాదిదురాచారముల దుష్ఫలితములు చక్కగ చూపింపబడినవి. అపూర్వమగు కథాకల్పనము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**ఛిన్నహస్తము**

(ప్రథమభాగము) అనువాదకులు:
జొన్నలగడ్డ సత్యనారాయణ
మూర్తి ఎం. ఎ., బి. ఎల్.,

అద్భుతమైనపరిశోధకనవల. సుప్రసిద్ధమగుఫ్రెంచి నవల ననుసరించి వ్రాయబడినది. కథాకల్పన మపూర్వము. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

**ఛిన్నహస్తము**

(ద్వితీయభాగము) అనువాదకులు:
జొన్నలగడ్డ సత్యనారాయణ
మూర్తి ఎం. ఎ., బి. ఎల్.,

ప్రథమభాగమునందలి అద్భుతఘటనములచిక్కులింపు బాహిరమును జూచి మహాద్భుత ఫలితము లను ప్రసవించినవి. ఛిన్నహస్త మెవ్వరిదోయెఱుగ వలెను వీడలేరు. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

**కంకణరహస్యము**

కర్త:
నేలటూరు అనంతాచార్యులు

చక్కని నిరూపకనవలారాజము. ఇతివృత్తము మనోహరరహస్య ఘటనాసంయుతము. ఒక భ్రాతృ వేషధారి రహస్యము. ఒకభ్రాతృద్రోహియొక్క రహస్యాభిలాష కంకణరహస్యమున ప్రతిఫలించినవి. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

**సంజీవి**

(ప్రథమభాగము)
అనువాదకులు :
మొసలికంటి సంజీవరావు
పంతులు

ఈ మనోహరనవలారాజము ప్రసిద్ధాంగ్ల నవలాకారుడగు స్కాట్ గ్రంథమున కనువాదము. తొల్లింటి క్రైస్తవ మహమ్మదీయాన్వయములమధ్య జరిగిన యద్భుత మతసంగ్రామ మిందలి యితివృత్తము. ఈ గ్రంథము నవలాపాఠకుల కత్యంతాకర్షణీయమైనది. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0

**సంజీవి**

(ద్వితీయభాగము)
అనువాదకులు :
మొసలికంటి సంజీవరావు
పంతులు

ఆంగ్లరాజ సోదరీహృదయ మాకర్షించిన కణతు డెవ్వడు? ఆంగ్లేయనృపాలుని సంజీవిని ప్రభావమున నుద్ధరించిన హకీము ఎవ్వడు? మనోహరగమనము గల కథావృత్తాంతము చదివియే తీరవలయును. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## అనుబంధగ్రంథములు

**మృత్యురంగిణి**

అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

గొప్ప డిటెక్టివునవల. ఒకానొక సుందరి యొక్క భయంకరకథ. నరహత్య – నారీహత్య – హత్యపై హత్యలు. వెల చందాదారులకు 0_8_0 ఇతరులకు రు 0_12_0.

**అభాగిని**

అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

బాల వితంతువులు పడు కష్టములు, దుండగులు పన్ను కుట్రలు_సమాజరీతిని వర్ణింపబడిననవరసభరితమగు సాంఘికనవల. వెల చందాదారులకు 0_8_0 ఇతరులకు 0_12_0

**భద్రనేత్రి**
అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

ఇది చక్కని పరిశోధకనవల. వెల చందాదారులకు రు 0_8_0 ఇతరులకు రు 0_12_0.

**విదురుని యుపదేశములు**
కర్త :
కేతవరపు వేంకటశాస్త్రి

చిత్తస్వాతంత్ర్యము – సత్యవాక్యపరిపాలనము – నీతిబలము – ధర్మోపదేశము జదువదగినవి వెల చందాదారులకు రు 0_8_0 ఇతరులకు రు 1_0_0.

**కాంచనమాల**
అనువాదకులు :
శ్రీ శివశంకరశాస్త్రి

అశోకుని కాలమునాటి బౌద్ధమతధర్మప్రచారము దెలుపు నవల. వెల చందాదారులకు 0_8_0 ఇతరులకు రు 1_0_0.

**సీమంతిని**
కర్త : ములుకట్ల వేంకటశాస్త్రి

పౌరాణిక గాథ నీతిదాయకము. వెల చందాదారులకు రు 0_8_0 ఇతరులకు రు 1_0_0.

**సుశీల**
అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. ఎల్.,

పతివ్రతయగు నీమె చరిత్రము హృదయవిదారకమయ్యును ప్రగాఢప్రణయాదర్శముజూపి యనేకుల పవిత్రుల జేయకమానదు. చందాదారులకు రు 0_8_0 ఇతరులకు రు 1_0_0.

**శశిరేఖ**
కర్త :
గుడిపాటి వెంకటాచలం బి. ఎ., ఎల్. టి.,

ప్రేమమూర్తియగు శశిరేఖ, ప్రియుని తరువాత ప్రియుని స్వీకరించుట యెట్లనసరమయ్యెనో, అయినను ఆమె నిర్మలచారిత్రి యెట్లయ్యెనోవ్రాయబడినది. వెల చందాదారులకు రు 0_8_0 ఇతరులకు రు 1_0_0.

**యమునాబాయి**
అనువాదకులు :
క్రొపవరపు నరసింహము

తమతమ పరిస్థితులను పరిశీలింపని ప్రేమాంధులగు యువతీయువకులకీ గ్రంథ మత్యంత బోధప్రదము. వెల చందాదారులకు రు 0_8_0 ఇతరులకు రు 0_12_0.

**శ్యామల**
అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం. ఏ., బి. ఎల్.,

శిథిలప్రణయుల దుఃఖగాథ. సాంఘికదురాచారమును ఖండించు ప్రేమైక నవల. చందాదారులకు రు 0_8_0 లు ఇతరులకు రు 1_0_0.

**కాలసర్పి**
అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం. ఏ., బి. ఎల్.,

అత్యద్భుత రహస్యాపరాధ పరిశోధక నవలారాజము. చందాదారులకు రు 0_8_0 ఇతరులకు రు 1_0_0

## కాంతంకథలు

కర్త:
మునిమాణిక్యం నరసింహారావు
బి. ఎ., ఎల్. టి.,

శ్రవణానందదాయకములై హాస్యరసపూరితములై యొప్పు వివిధకథల సంపుటము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## భారతకథాసారం

గ్రంథకర్త్రి
శ్రీమతి దేచిరాజు లక్ష్మీనరసమ్మ

మృదుమధురశైలిలో వ్రాయబడిన శ్రీమదాంధ్ర మహాభారత కథాసారము. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## కథాకల్పవల్లి

కొప్పర్తి నారాయణమూర్తి
బి. ఎ., ఎల్. టి.

మనోహరమైన కథల సంపుటము. ప్రతికథయు పాఠకుల నానందాబ్ధి నోలలాడించునదియే. ఎల్లరు చదివితీరవలసినట్టివి. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## అరక్షణీయ

అనువాదకులు:
సహదేవ సూర్యప్రకాశరావు

సుప్రసిద్ధుడగు శరశ్చంద్రకవివర్యుని వంగసాంఘిక నవల కనువాదము. కథాకల్పన మత్యంత సహజమై నీతి నింపుచున్నది. శైలి మృదుమధురము. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరుల కు రు 1-0-0

## మాధవి

అనువాదకులు:
జొన్నలగడ్డ సత్యనారాయణ
మూర్తి ఎం. ఎ., బి. ఎల్.,

రసభరితమైన సాంఘికనవల. శైలి మృదుమధురము. ప్రతివారును చదివితీరవలసినది. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## లలిత

అనువాదకులు:
జొన్నలగడ్డ సత్యనారాయణ
మూర్తి ఎం. ఎ., బి. ఎల్.,

మనోహరమైన సాంఘికనవలారాజము. ఇందు చిత్రింపబడిన ప్రేమమయజీవనము నిష్ఠురసాంఘిక దురాచారముల కతీతము. కరుణారసప్రపంచమున కాదరణపాత్రియము. ఇతివృత్తము పాషాణహృదయములనుగూడ కరగించివేయునట్టిది. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## పెండ్లిదండ

అనువాదకులు:
జొన్నలగడ్డ సత్యనారాయణ
మూర్తి ఎం. ఏ., బి. ఎల్.,

ఇందు నాయికానాయకుల జీవితము అతిరమ్యముగ చిత్రింపబడినది. బాల్యస్నేహమున ఆటలలో చంద్రశేఖరుడు లలితకంఠము నలంకరించిన పూలహారము పెండ్లిదండగా మారుట అత్యద్భుతము. ప్రణయైకజీవనుల పవిత్రజీవనము జదివి అనుకరింపదగినది.

### — నాటకానుబంధములు —

## మార్కండేయ

కర్త:
పింగళి వెంకటనరసయ్య

3 గంటల కాలములో ప్రదర్శించుట కనువుగ వ్రాయబడిన భక్తిపూరితమగు 6 అంకముల నాటకము. చక్కని పాటలు గలవు. వెల చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 0-12-0

## అహల్యాశాప విమోచనము

కర్త: పప్పు మల్లిఖార్జునరావు

భక్తిరసపూరితమగు చక్కని నాటకము. వెల చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 0-12-0.

## మీవారుపతనము

అనువాదకులు: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. ఎల్.,

వీరరసప్రధానమగు ఐదంకముల నాటకము. ఇతిహాసికవచననాటకమున కనువాదము. వెల చందాదారులకు రు 0-8-0 గు ఇతరులకు 1-0-0.

## షాజహాను

అనువాదకులు: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. ఎల్.,

విషాదాంతమైన మొగలాయీ చారిత్రక వచన నాటకము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## వరమాల

అనువాదకులు: మాడభూషి సురేంద్రాచార్యులు

హిందీనుండి యాంధ్రీకరింపబడిన మనోహరమగు నాటకము. ఇందు ప్రేమపరీక్ష, తత్పరిణామము హృదయంగమముగను చమత్కార ప్రదముగను నిరూపింపబడినవి. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## నూర్జహాను

అనువాదకులు: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. ఎల్.,

కరుణారసపూరితము, విషాదాంతమునగు చరిత్రాత్మక నాటకరాజము మనోహరగీతములు కలవు. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## దుర్గాదాసు

అనువాదకులు: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. ఎల్.,

వీరరసపూరితమును, ద్విజేంద్రుని విరచితములలో మిగుల పవిత్రమును నగు ఐదంకముల చక్కని నాటకము. ముఖ్యముగ చదువ తగినది. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు 1-0-0.

## చంద్రగుప్త

అనువాదకులు: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. ఎల్.,

సుప్రసిద్ధ డి. ఎల్. రాయిగారి పేరందిన చరిత్రాత్మకమైన నాటకము. చక్కని అనువాదము. నాటకకళకు అలంకారము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

ఇట్టివే చక్కని నవలలు పలువురు కవులచే రచింపబడుచు రెండుమాసముల కొకటిగా ప్రకటింపబడును.

సరస్వతీ గ్రంథమండలి, రాజమహేంద్రవరము.

# సరస్వతి ఇంగ్లీషు - తెనుగు పాకెట్టు డిక్షనరీ

# Saraswathi English-Telugu POCKET DICTIONARY.

గ్లేజు కాగితము—665 పేజీలు—సుమారు 17000 ఇంగ్లీషు

పదములకు సులభమగు తెలుగు అర్థములు

బాలబాలికలకు మిక్కిలి యుపయోగకరము

చక్కని క్యాలికో బైండు, వెల ప్రతి 1కి రు **2-0-0**

---

## వ స్తు గు ణ ప్ర కా శి క

పేజీలు 1168 వెల రు 6-0-0

సమస్తమూలికల ఉత్పత్తి స్వరూపములు, రసవీర్యవిపాకములు, గుణగతులు, గొప్ప ఔషధయోగములు తెలుగువచనమున అభివర్ణింపబడినవి. నవీనవైద్యకమతము ననుసరించియు గుణములు తెలుపబడినవి. ప్రతి యింటను ఉండతగినది. రు 6—0—0 మనీఆర్డరు పంపి దగ్గర రైలుస్టేషన్ పేరు తెలుపునెడల చార్జీలు మేమే భరించి పుస్తకము పంపుదుము. తెల్లని కాగితము, మంచి క్యాలికో బైండు.

---

## సం పూ ర్ణ భ క్త వి జ య ము

పేజీలు 840 రాయల్ సైజు వెల రు 6-0-0

మన ఆంధ్రు లెరుగని మహాభక్తుల చరిత్రము లెన్నో యిందున్నవి. కావుననే యిది సంపూర్ణభక్తవిజయము. హిందూదేశమంతయు తిరుగలేనివారును, అనేకభాష లెరుగనివారును, స్వయముగ మహాభక్తులను సేవించి యుండనివారును ఇది చదివిననే భక్తియొక్క సంపూర్ణత తెలిసికొనగలరు. దళసరి తెల్లని కాగితాలు. క్యాలికో బైండు. రు 6—0—0 ముందే పంపి రైలుస్టేషన్ పేరు తెలుపువారికి ఖర్చులు మేమే భరించి పుస్తక మంపెదము.

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి, అని వ్రాయవలెను.

---

☞ మా పుస్తకములు పేరుపడ్డ అన్ని బుక్ షాపులలోను ఈ ధరలకు దొరకును.